# స్కాందపురాణాంతర్గత బ్రహ్మోత్తరఖండము

(వచనం)

- డా॥ శివలెంక ప్రకాశరావు



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

స్కాందపురాణాంతర్గత

# బ్రహ్మోత్తరఖండం

(వచనం)

[తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయంతో ప్రచురితం]

డా॥ శివలెంక ప్రకాశరావు
ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రోపన్యాసకులు
పి. ఆర్. ప్రభుత్వకళాశాల
కాకినాడ

శ్రీ సరస్వతీ పబ్లికేషన్స్
కాకినాడ

# ప్రవేశిక

ఈ బ్రహ్మోత్తరఖండం వ్యాసప్రోక్తం, స్కాందపురాణాంతర్గతం. మా పితృపాదుల గ్రంథాలయంలో శివభక్తి పారమ్యమైన ఈ గ్రంథం కనబడటంతో దీనిని అనువదించాలనే ఉత్సాహం వెల్లువెత్తింది. అయితే ఇతఃపూర్వమే దీనిని శ్రీధరమల్లె వేంకట రామకవి అయిదాశ్వాసాల పద్యకావ్యంగా ఆంధ్రీకరించారు. అది వావిళ్ళవారు 1922 లో ప్రకటించారు. అలాగే బ్రహ్మశ్రీ పోతుకూచి రామమూర్తిశాస్త్రిగారు తాత్పర్యసహితంగా 1937 లో ప్రచురించారు.

కాబట్టి సర్వులకూ సులభయోగ్యంగా ఉండాలనే ఉద్దేశంతో యథామూలంగా శిష్టవ్యావహారికంలో వచనగ్రంథంగా రచించడానికి ప్రయత్నించాను. సహృదయమిత్రులు ప్రోత్సహించారు. అచ్చొత్తించడానికి ఏడుకొండలవాడు అభయమిచ్చాడు. ఇంకేం కొదవ ? పుస్తకం మీ హస్తాన్ని అలంకరించింది.

ఈ సందర్భంగా దీనిని ముద్రించడానికి ఆర్థికసహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారిగారికీ, అందంగా అచ్చొత్తించిన శ్రీపతి ప్రెస్ అధినేత శ్రీ టి. గణేశ్వరరావుగారికీ నా నమస్సుమనస్సులు. నన్ను సత్కార్యానికి పురికొల్పి అన్నియెడల సహకరించిన నా శ్రీమతికి శుభాశీస్సులు.

ఈ కృతిని ఆధ్యాత్మిక గురువరేణ్యులు శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య (శ్రీరామశరణ్) గారికి హృదయపూర్వకంగా అంకిత మొనరుస్తున్నాను.

కాకినాడ,
27-8-1988

సదా
భవదీయ
డా॥ శివలెంక ప్రకాశరావు

# విషయసూచిక

అధ్యాయం | | | పుట

# బ్రహ్మోత్తరఖండం

## ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుమ్ శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

వ్యాసం వసిష్టనప్తారం శక్తేః పౌత్రమకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

## ప్రథమోధ్యాయం

ఒకనాడు ఋషులందరూ కలసి సూతమునీంద్రుని దర్శించి నమస్కరించి "మునీంద్రా! సమస్తమైన పాపాలు పోగొట్టే పవిత్రమైన విష్ణుపురాణాన్ని నీవల్ల సంక్షేపంగా విన్నాం. ఇప్పుడు మేము పాపహరమైన శివునీ-శివభక్తుల మాహాత్మ్యాలను వినడానికి కుతూహలపడుతున్నాం. శివసంబంధమైన మంత్రాలూ, వ్రతాలూ, పూజాది విధానాలూ, శివభక్తి మహిమలు మొదలైన విషయాలను గూర్చి మాకు తెలియజేయవలసిందిగా ప్రార్థిస్తున్నాం" అని వేడుకున్నారు. అప్పుడు సూతుడు చాలాసంతోషించి "మీకు అకారణంగా శివకథలో భక్తి కలగడమే ఒక విశేషం. శివమహిమను గూర్చి విపులంగా ఒక్కసారిగా వర్ణించడం కల్పాయుష్షుకల మాన

వులకైనా సాధ్యంకాదు. కాబట్టి శివమహిమలో కొంతమాత్రమే నేను వివరిస్తాను.

షడక్షరీమంత్రమహిమ : అన్ని పుణ్యాలలో, సకల శ్రేయస్సులలోకీ, యజ్ఞాలన్నింటిలోకీ శివమంత్ర జపమనే యజ్ఞం చాలా గొప్పది. వాటిలో శివషడక్షరీమంత్రం శ్రేష్ఠమైంది, ప్రధానకారణమైంది, దివ్యమైంది అని మహర్షులు పేర్కొన్నారు. సనాతనుడైన శంకరుడు దేవతలందరిలో శ్రేష్ఠుడు. అలాగే శైవషడక్షరీమంత్రం మంత్రాలన్నిటిలోకీ ప్రధానమైంది. "ఏష పంచాక్షరీమంత్రః కేవలో ముక్తిదాయకః సంసేవ్యతే మునిశ్రేష్ఠైరశేషైస్సిద్ధికాంక్షిభిః" ముక్తినిచ్చే ఈ పంచాక్షరీమంత్రమే సిద్ధినికోరే సమస్త మునిశ్రేష్ఠులచే సేవింపబడుతోంది. వేదాలుకూడా ఈ మంత్రరాజంలో సిద్ధాంతాన్ని పొంది అపరిమితానందాన్ని అనుభవిస్తున్నాయి. అటువంటి మంత్రంలో ఒక్క అక్షరమహిమ చెప్పడానికి చతుర్ముఖుడికికూడా సాధ్యంకాదు. సర్వజ్ఞుడూ, పరిపూర్ణుడూ, సచ్చిదానంద స్వరూపుడూ అయిన శివుడు శుభకరమైన పంచాక్షరీ మంత్రంలోనే క్రీడిస్తాడు. పూర్వమునులంతా సర్వోపనిషత్సారమైన ఈ ఒక్క మంత్రంతోనే నిరామయుడైన బ్రహ్మను పొందారు. "నమస్కారేణ దేవత్వం శివేతి పరమాత్మని ఐక్యం గతో మంత్రస్తస్మాద్బ్రహ్మ మయోహ్యసౌ," "నమశ్శివాయ" అనే మంత్రంలో "నమః" అంటే దేవత్వం, "శివ" అంటే పరమాత్మలో ఐక్యమవడం అని అర్థం. భవపాశబద్ధులైన శరీరధారుల మేలుకోరి స్వయంగా శివుడే ఈ పంచాక్షరిని ఉపదేశించాడు. ఎవరి హృదయంలో ఈ మంత్రం ప్రకాశిస్తుందో వారికి ఏ ఇతర మంత్రాలతోగానీ, తీర్థయాత్రలతోగానీ, తపస్సుతోగానీ, యజ్ఞాలతోగానీ అవసరంలేదు. శరీరధారులు ఈ మంత్రాన్ని ఎంతవరకూ ఒక్కసారైనా ఉచ్చరిం

చరో, అంతవరకూ వారు దుఃఖసంకులమైన సంసార సముద్రంలో మునిగి తేలుతూనే వుంటారు. ఈ షడక్షరీమంత్రం అన్ని మంత్రాలకూ రాజాధిరాజు, సర్వవేదాంతాలకూ శిరోమణి, సర్వజ్ఞానాలకూ సదానందం. ఈ మంత్రం కైవల్యమార్గాన్ని చూపిస్తుంది. అవిద్యను నశింపజేస్తుంది. మహాపాతకాలకుకూడా దావాగ్ని ఇది.

ఓంకార సహితమైన మంత్రం షడక్షరి. ఓంకార రహితమైనది పంచాక్షరీమంత్రం. ఈ పంచాక్షరిని స్త్రీలైనా, శూద్రులైనా, సంకీర్ణులైనా ముక్తి కోరేవారందరూ స్వీకరించవచ్చు. దీనికి ఒక విధానంగానీ, హోమంగానీ, సంస్కారంగానీ, తర్పణంగానీ, దేశకాలాది నియమంకానీలేదు. ఈ మంత్రం ఎప్పుడూ శుద్ధిఅయిందే. "శివ" అనే రెండక్షరాలూ "నమః" అనేదానితోకలిసి బ్రహ్మహత్యాది మహాపాతకాలనుకూడా పోగొట్టి ముక్తిని ప్రసాదిస్తుంది. పవిత్రమైన క్షేత్రంలో సద్గురువుచే ఉపదేశింపబడిన ఈ మంత్రం జపిస్తే కోరినకోరికలు తీరడంలో ఆశ్చర్యంలేదు. కాబట్టి సద్గురువును ఆశ్రయించి, ఈ మంత్రాన్ని స్వీకరించడం ముఖ్యం. "గురవో నిర్మలాశ్శాన్తా సాధవో మితభాషిణః। కామక్రోధ వినిర్ముక్తా సదాచారా జితేంద్రియాః" ఆ గురువులు చిత్తశుద్ధికలవారై, శాంతులుగా, సజ్జనులుగా, మితభాషులుగా, కామక్రోధాది అరిషడ్వర్గాన్ని జయించినవారుగా, ఇంద్రియ నిగ్రహం కలవారుగా ఉండాలి. అటువంటి గురువు దయతో ఇచ్చిన మంత్రం వెంటనే సిద్ధిస్తుంది. జపం చేసుకోడానికి ప్రయాగ, పుష్కరం, కేదారం, గోకర్ణం, నైమిశారణ్యం శ్రేష్ఠమైనవి.

ఈ సందర్భంగా పురాతనమైన ఒక ఇతిహాసం చెప్పబడింది. మధురానగరాన్ని యదువంశానికి చెందిన దాశార్హుడనేరాజు పాలిస్తున్నాడు. ఆతడు సత్కీర్తికలవాడు, మంచి ఉత్సాహవంతుడు,

మహాబలవంతుడు, శాస్త్రజ్ఞానం కలవాడు, నీతిమంతుడు, శూరుడు, ధైర్యవంతుడు, అమితకాంతికలవాడు, గంభీరుడు, యుద్ధంలో వెను దీయనివాడు, మహారథికుడు, సకలశాస్త్రార్థకోవిదుడు, బ్రహ్మజ్ఞాన వేత్త. ఆతడి భార్యపేరు కళావతి. ఆమె కాశీరాజు కుమార్తె, రూప శీలగుణాన్వితురాలు. వివాహమైన తరవాత ఆమెను దాశార్హుడు తన మందిరానికి తీసుకువెళ్లాడు. ఒకనాటిరాత్రి పడకమీద పడుకొని ఆతడు భార్యఅయిన కళావతిని సంగమానికి పిలిచాడు. ఎన్నో విధాలుగా బ్రతిమలాడాడు. కాని ఆమె ఆతడి దగ్గరకు పోలేదు. దాంతో దాశార్హుడికి పౌరుషం పెచ్చింది. బలాత్కారంగానైనా ఆమెను పొందడానికి ఉద్యుక్తుడయ్యాడు.

అప్పుడామె "మహాభాగా! ఒక కారణార్థమై వ్రతనియమంలోఉన్న నన్ను ముట్టుకోవద్దు. ధర్మాధర్మాలు తెలిసినవాడవు. నన్ను బలాత్కారంచేయకు. ప్రేమతో పెట్టిన, భుజింపబడిన అన్నమే రుచిగాఉంటుంది. అన్యోన్యప్రేమగల దంపతుల సంగమమే సుఖాన్నిఇస్తుంది. కాబట్టి నీపట్ల నా కెప్పుడు ప్రేమ కలుగుతుందో అప్పుడు పొందుదువుగాని. "కాం ప్రీతిః కిం సుఖం పుంసాం బలాద్యోగేన యోషితాం అప్రీతాం రోగిణాం నారీం అంతర్వత్నీం రజస్వలాం వ్రతకర్శితామకామాం కః కామయేత బలాత్పునః॥" బలాత్కారంగా స్త్రీని అనుభవిస్తే పురుషులకు ప్రేమగానీ సుఖంగానీ కలగవు. అంతేకాదు. ఇష్టం లేనట్టిదీ, రోగిష్టిదీ, గర్భవతీ, ఋతుమతీ, వ్రతనియమంకలదీ, కామంలేనిదీ అయిన స్త్రీని ఎవడు పొందగోరతాడు? "ప్రీణనం లాలనం పోషోరంజనం మార్దవం త్వయా యువతౌ కుసుమేచైవ విధేయం సుఖమిచ్ఛతా." సుఖాన్ని కోరుతున్న నీవు యువతిపట్ల, పువ్వుపట్ల ప్రీతినీ, లాలననూ కలిగి పోషించి, రంజించి మార్దవాన్ని ప్రకటించాలి." అని చెప్పింది.

అయినప్పటికీ కామాతురుడైన రాజామెను బలాత్కారంగా చేతులలోకి తీసుకొని పొందగోరి కౌగిలించుకున్నాడు. అప్పుడామె శరీరం దహించడానికి పుట్టిన ఇనపగుండులా అనిపించింది. రాజుకు భయంవేసింది. వెంటనే ఆమెను విడిచిపెట్టాడు. "ప్రేయసీ! చిగురుటాకులాంటి నీ శరీరం అగ్నిలా ఎలా మారింది" అని ఆశ్చర్యంగా అడిగాడు. అప్పుడామె చిరునవ్వునవ్వి "ఓ నాథా! నా చిన్నతనంలో దుర్వాసమహర్షి పంచాక్షరీ మంత్రాన్ని నాకు ఉపదేశించాడు. ఆ మంత్రప్రభావంవల్ల పవిత్రమైన నా శరీరం మంత్రహీనులైనవారికి తాకడానికి శక్యంకాదు. పెక్కుమంది మద్యపానాసక్తులైన కులటలూ, వేశ్యలూ నీచేత సేవించబడ్డారు కాని శివుణ్ణి ఎప్పుడూ నీవు ధ్యానం చేయలేదు. శుభకరమైన మంత్రాన్ని జపించలేదు. అలాంటి నీవు నన్ను ఎలాతాకగలవు? కాబట్టి గురుముఖంగా శివపంచాక్షరీ మంత్రోపదేశం పొందు. ఆ తరవాత పాపవిముక్తుడవై నన్ను పొందుదువుగాని." అని వినయంతో సమాధానం చెప్పింది. కామాతురుడూ, మూఢమనస్కుడూ అయిన ఆ రాజు భార్యతో "శుభకరమైన ఆ మంత్రాన్ని నీవే నాకు ఉపదేశించు'' అని అన్నాడు అప్పుడామె "ఓ నాథా! నీవు నాకు గురువువు. కాబట్టి నేను నీకు మంత్రోపదేశం చేయకూడదు. మంత్రవేత్తలలో శ్రేష్ఠుడైన గర్గమహామునిని సేవించు''మని చెప్పింది.

తరవాత ఆ దంపతులిద్దరూ గర్గమహామునిని దర్శించి సాష్టాంగ వందనం చేశారు, ఆయనను పూజించి సంతోషపెట్టారు. "కరుణానిధీ! కులగురువర్యా! నాకు పంచాక్షరీ మంత్రాన్ని ఉపదేశించు దానికి నీవే అర్హుడవు. రాజ్యపాలనలో తెలిసీతెలియకో నేను చేసిన పాపాలు నశింపచేసే ఆ మంత్రాన్ని నాకు ప్రసాదించు" అని రాజా మునిని వేడుకున్నాడు.

అప్పుడా ముని ఆ రాజదంపతుల నిద్దరినీ పవిత్రమైన యమునా నది ఒడ్డుకు తీసుకొని వెళ్లాడు. అక్కడ ఒక చెట్టు మొదట్లో కూర్చుండి, అంతరింద్రియ నిగ్రహంతో ఉపవాసదీక్ష వహించిఉన్న రాజును తన ఎదురుగా తూర్పుముఖంగా కూర్చుండబెట్టి ఆతడి శిరస్సుపై తన హస్తముంచి శివాత్మకమైన ఆ మంత్రాన్ని గర్గముని ఉపదేశించాడు. సద్గురువు హస్తస్పర్శవల్ల ఆ రాజు శరీరం నుండి కోట్ల కొద్దీ కాకులు బయటకు వెడలివచ్చాయి. మంత్రప్రభావంవల్ల వాటి రెక్కలు కాలిపోయి "కావుకావు" మని అరుస్తూ అవన్నీ నేల కూలాయి. దానికి ఆశ్చర్యపడి ఆ రాజదంపతులు మునిని కారణం ఏమిటని అడిగారు. దానికాముని "ఓ రాజా! నీ వెత్తిన వేనవేల జన్మలలో ఎంతో పాపంచేశావు. కాని నీవు చేసిన కొద్దిపాటి పుణ్యం వల్ల పుణ్యాత్ములకు బిడ్డవయ్యావు. మనం చేసిన పుణ్యపాపాలే మన జన్మలకు కారణం. ఇప్పుడు పంచాక్షరీ మంత్రోపదేశంవల్ల నీ దేహంలోని పాపాలన్నీ కాకులరూపంలో బయటపడ్డాయి. ఈ పంచాక్షరీ మంత్రధారణంవల్ల బ్రహ్మహత్యలూ, అన్యభార్యాసంగమం, బంగారాన్ని అపహరించడం, మద్యపానం చేయడం, భ్రూణహత్యాది కోట్ల కొలదిపాపాలుకూడా తృటికాలంలో నశిస్తాయి. ఇప్పుడు నీవు పవిత్రుడవు. కాబట్టి ఇంక నీ భార్యతో సుఖంగా విహరించు" అని చెప్పి వారిని పంపించాడు. ఇంటికివెళ్ళి దాశార్హుడు మంచి గంధంలా చల్లటి శరీరంగల భార్యను కౌగిలించుకున్నాడు, దరిద్రుడు పెన్నిధిని పొందినట్లుగా సంతోషంతో సర్వసుఖాలూ అనుభవించాడు.

ఈ విధంగా సూతుడు కథను ముగించి, "సకలవేదోపనిషత్పురాణ శాస్త్రాది విద్యలకు శిరోమణి అయినదీ, సమస్త పాపాలనూ పోగొట్టునదీ, వర్ణింపశక్యంకాని మహిమకలదీ అగు ఈ పంచాక్షరీ మహామంత్రాన్నిగూర్చి మీకు సంక్షిప్తంగా చెప్పాను. పూర్వం

అగస్త్యుడూ, శ్రీరామచంద్రుడు మొదలైన మహానుభావులచే ఈ మంత్రం ఆదరింపబడింది, వేదంలో చెప్పబడింది, పరమాత్మ తత్వాన్ని బోధిస్తుంది ఇది. అందువల్ల ఓ ఋషులారా! మీరంతా "నమశ్శివాయ" అనే మంత్రాన్ని ఎల్లప్పుడూ జపించండి.'' అని చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో పంచాక్షరీ మహిమను వర్ణించే మొదటి అధ్యాయం.



# ద్వితీయోధ్యాయం

సూతుడు మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు. "ఓ ఋషులారా! ఏ మహామహిమను విన్నంతమాత్రంతో ఈ సందేహాలన్నీ పటాపంచలవుతాయో అటువంటి శివ సంబంధమైన మాహాత్మ్యాన్ని గూర్చి చెపుతున్నాను. శ్రద్ధగా వినండి. శివారాధనం పాపాన్ని హరిస్తుంది, అపరిమితానందాన్ని కలిగిస్తుంది. సర్వకామార్థసాధకమైందీ, దీర్ఘాయుర్విజయారోగ్య భక్తిముక్తి ఫలప్రదమైందీ అది. దానికి మించింది మరొకటిలేదు. పాతవైనా, క్రొత్తవైనా, చిన్నవైనా, పెద్దవైనా అన్ని పాపాలను పోగొట్టే సాధనం శివారాధనమే. గొప్ప మహర్షులు చెప్పిన ప్రాయశ్చిత్తంవల్లకూడా నశించని పాపాలనూ త్రికాలలో నశించని పాపాలనూ శివారాధన హరిస్తుంది. శివపూజయే సర్వశ్రేయోదాయకం, అభ్యుదయకారకం అని సర్వశాస్త్రాలూ ఘోషిస్తున్నాయి. తెలిసినా తెలియకపోయినా ఏ విధంగానైనా శివునుద్దేశించి చేసినకర్మ కించిత్తయినా మోక్షాన్ని ప్రసాదిస్తుంది. మాఘ చతుర్దశి అంటే శివరాత్రినాడు ఉపవాసభాగ్యం అందరికీ లభించదు.

ఆనాడు ఉపవాసంతో బాటు రాత్రి జాగరణ భాగ్యం లభించడం మరీ కష్టం. ఆ రోజు శివదర్శనం కల్గడం చాలాదుర్లభం. ఒకవేళ కలిగినా ఈశ్వరార్చన చేయగలగడం చాలాఅరుదు. ఎన్నో వేల జన్మలలో చేసిన సుకృతంవల్లనే ఆనాడు ఒక బిల్వదళాన్ని శివుడికి అర్పించే భాగ్యం కల్గుతుంది. అనేక వేల సంవత్సరాలు చేసిన గంగానదీ స్నాన ఫలం ఒక్క బిల్వదళంతో శివుణ్ని పూజిస్తేనే లభిస్తుంది. ఏ ఏ యుగాల్లో ఏ ఏ పుణ్యాలు చెప్పబడ్డాయో అవన్నీ ఒక్క మాఘచతుర్దశివల్లనే లభ్యమవుతాయి. బ్రహ్మాది దేవతలూ, వసిష్ఠాది మహర్షులూ శివరాత్రిని ఒక గొప్ప పర్వంగా వర్ణించారు. ఆనాడు చేసిన ఉపవాసం నూరు యజ్ఞాల ఫలాన్నిస్తుంది. ఆనాటిరాత్రి జాగరణం కోటి సంవత్సరాల తపస్సుచేసిన ఫలంకన్నా ఎక్కువ. ఒక్క బిల్వదళంతో శివపూజ చేసినవాడిపుణ్యానికి ముల్లోకాలలో సాటిలేదు.

ఈ సందర్భంగా గౌతముడు నాకు చెప్పిన అతిరహస్యమూ, శుభకరమూ అయిన పుణ్యకథ ఒకటి తెలియజేస్తాను. ఇక్ష్వాకు వంశంలో మిత్రసహుడనే రాజున్నాడు. అతడు విలువిద్యాకుశలుడు, సర్వధర్మపరాయణుడు, సకలశాస్త్ర విశారదుడు, వేదవేదాంగ విదుడు, ధీరుడు, బలోత్సాహయుతుడు అయినా దయాసముద్రుడు. అతడి శరీరం ఆకారం వహించిన పుణ్యరాశిలా, కాంతిసమూహంలా, ఆశ్చర్యాలకు ఆలవాలంలా ప్రకాశిస్తున్నది. అతడి హృదయం దయాక్రాంతం, శరీరం సౌందర్యోపేతం, చరణద్వయం సమస్త రాజలోకసేవిత మణిస్థగితకిరీట విరాజమానం. నలుడికి దమయంతిలా పతివ్రతాశిరోమణి అయిన దమయంతి అతడి భార్య.

ఒకనాడా రాజు వేటకోసం పెద్దసేనతో ఒక ఘోరారణ్యంలో ప్రవేశించాడు. అక్కడాతడు మహిషగవయశార్దూల వరాహ మృగేంద్రాది జంతువులను తన బాణాలతో నేలకూల్చాడు.

మృగయాసక్తుడైన ఆ రాజాసమయంలో అగ్నిసదృశుడైన ఒక నిశాచరుణ్ని కూడా వధించాడు. ఆ రక్కసుని తమ్ముడు తన సోదరుని మరణానికి విచారించి, దేవదానవులకు అజేయుడైన ఆ రాజును మాయోపాయం చేతనే జయించాలి అని యోచించి ఆతడొక మనుష్యరూపం ధరించి ముంచుకొచ్చిన ఉపద్రవంలా రాజును సమీపించాడు. ఆతడి పన్నాగం తెలియక రాజా రాక్షసుని పాకశాలాధిపతిగా నియమించాడు. వేటతమకంపోయిన తరవాత కొన్ని రోజులకు రాజు తన పట్టణానికి తిరిగిచేరాడు.

ఒకరోజున తండ్రి ఆబ్దికానికి రాజు వసిష్ఠమహర్షిని ఆహ్వానించాడు. వంటవాడైన రాక్షసుడు మహర్షికి మేకమాంసానికి బదులు నరమాంసాన్ని వడ్డించాడు. అదిచూచి క్రోధావేశుడై వసిష్ఠుడు "మోసంతో నాకు మనుష్యమాంసాన్ని వడ్డింపచేశావు కాబట్టి నీవు రాక్షసుడవై జన్మించుము"ని శపించాడు. తరవాత దివ్యదృష్టితో అసలు విషయం తెలుసుకొని ఆ శాపం పన్నెండేళ్ళు మాత్రమే అనుభవించేటట్లు మార్పుచేశాడు వశిష్ఠుడు. కాని రాజు కోపోద్దీపితుడై మోసాన్ని గ్రహించక వృథాగా తన్ను శపించిన గురువును తిరిగి శపించడానికి పూనుకొన్నాడు. ఆతడి భార్య పాదాలమీద పడి వేడుకొని ఆ పనిని విరమింపజేసింది. అప్పుడా రాజు శాపప్రయత్నాన్ని మానుకొని చేతిలోతీసుకొన్న నీటిని తన పాదాలపైనే విడిచిపెట్టాడు. దాంతో ఆతడి పాదాలు కాలుష్యాన్ని వహించాయి. ఆనాటినుండి ఆ రాజు "కల్మాషపాదు"డని పిలవబడుతూ గురుశాపవశంచే రాక్షసుడై కాలాంతక శలోపమానుడై వనసంచారుడై మనుష్యులనూ జంతువులనూ సంహరించ సాగాడు.

ఒకనాడాతడు యమసదృశుడై యువముని దంపతులనుచూచి, నరమాంసాశనాసక్తుడై తోడేలు లేడిపిల్లను పట్టినట్లుగాముని పుత్రుణ్ణిపట్టి మింగబోయాడు. అప్పుడామునిపత్ని గోలుగోలున విల పిస్తూ గజగజ వణుకుతూ "సూర్యవంశ యశోధనా! నీవు దమయంతీ పతివైన రాజేంద్రుడవు కాని రాక్షసుడవుకావు. నా భర్తను భక్షింపకు. ప్రతి జీవికీ ప్రాణాలు చాలా తీపి. ఆర్తత్రాణ పరాయణుడవైన నీవే నాకు దిక్కు. భర్తృహీనమై జడసదృశంగా ఉండే నా ఈ శరీరభారంవల్ల ఫలమేమిటి? బాలుడూ, వేదవిదుడూ, తపస్వీ, బహుశాస్త్రవేత్త అయిన నా భర్తకు నీవు ప్రాణదానం చేస్తే జగద్రక్షాపుణ్యఫలం కలుగుతుంది. బాలను, బ్రాహ్మణస్త్రీని నన్ను దయదలచు. "అనాథకృపణార్తేషు సఘృణాః ఖలు సాధవః" మంచి వారెప్పుడూ అనాథలూ, దీనులూ, ఆర్తులపట్ల కృపాంతఃకరణులౌ తారుకదా!" అని వేడుకొన్నది. అయినా నిర్దయుడైన ఆ రాక్షసుడు నరమాంస మందభిరుచితో విప్రసూనుని శిరస్సును భక్షించాడు. దీనురాలైన ఆ బ్రాహ్మణవనిత ఎంతగానో విలపించి తరవాత తన భర్త అస్థికలను ఒక చితిగా పేర్చి సహగమనంచేస్తూ రాక్షసాకారుడైన రాజును అది మొదలు స్త్రీని సంగమించే కోరిక ఎప్పుడు కలిగితే అప్పుడు మరణిస్తాడని శపించింది.

మునిశాపం తీరినవెంటనే రాజు నిజాకృతితో సంతోషంగా పట్టణానికి చేరాడు. విప్రసతీశాపం తెలుసుకొన్న ఆతడి భార్య కలగబోయే వైధవ్యానికి వెఱచి తన పొందుగోరే భర్తను నివారించింది. అనపత్యుడైన ఆ రాజు రాజ్యభోగాసక్తిలేని రాజ్యలక్ష్మిని విడిచి మళ్ళీ వనవాసానికి పోయాడు.

అప్పుడు సూర్యవంశాన్ని నిలపడంకోసం వసిష్ఠమహర్షి తన తపశ్శక్తివల్ల దమయంతికొక కుమారుణ్ణి ప్రసాదించాడు.

అరణ్యాల కేగినరాజు తనను ఒక ఘోరపిశాచం వెన్నంటి రావడం గమనించాడు. మునికుమారుని చంపిన పాపఫలమే అది. చాలా సంవత్సరాలు ఆతడు నిర్విణ్ణమానసుడై పెక్కు క్షేత్రాలూ, తీర్థాలూ సేవిస్తూ తిరిగాడు. ఎన్ని పుణ్యనదుల్లో మునిగినా, బ్రహ్మహత్యాపాతకం వదలక తిరిగి తిరిగి చివరకు రాజు మిథిలా నగరానికి చేరాడు. అక్కడ ఒక ఉద్యానవనంలో చింతాకులచిత్తుడై ఉండగా గౌతమమహర్షి వచ్చాడు. అగ్నిహోత్ర సదృశుడూ, అశేష మునిజన సేవితుడూ, సూర్యుడిలా సకలదోషతమోపహారి, చంద్రుడిలా అమలగుణాన్వితుడూ, శివుడిలా సకలవిద్యాకళాధరుడూ అయిన ఆ మునిశ్రేష్ఠుడికి రాజు పెక్కుమార్లు నమస్కరించాడు. దానికి సంతోషించి గౌతముడు "ఓ రాజా! కుశలమేనా? రాజ్యపదవి భద్రమేనా? నీ పాలనలో ప్రజలూ, అంతఃపుర జనులు సుఖులేనా? రాజ్యాన్ని విడిచి ఇలా ఎందుకు వచ్చావు? అలసటతో, దీర్ఘ నిట్టూర్పులతో దేనిని ధ్యానిస్తున్నావు?" అని ప్రశ్నించాడు. దానికి రాజు "ఓ బ్రాహ్మణోత్తమా! నీ దయవల్ల అందరూ కుశలమే. సద్వంశ సంజాతులైన రాజుల సంపదలు బ్రాహ్మణాధీనాలుకదా! అతిఘోరపిశాచం నన్ను వెంటాడుతూ అడుగడుగునా భయపెడుతున్నది. శాపగ్రస్తుడనైన నేను మహాపాపాన్ని చేశాను. ఎన్నివేల ప్రాయశ్చిత్తాలవల్లకూడా ఆ పాపం శాంతించడంలేదు. ధనమంతా దక్షిణగా ఇచ్చి ఎన్నో యజ్ఞాలు చేశాను. భూలోకంలోని పుణ్యనదులన్నింటిలో స్నానం చేశాను. ఒంటరిగా తిరుగుతూ సకల పుణ్యతీర్థాలూ సేవించాను. అన్ని మంత్రాలూ జపించాను. సకలదేవతలనారాధించాను. పర్ణమూల ఫలాశనుడనై మహావ్రతాలు చేశాను. ఎన్ని చేసినా నా మనస్సుకు ఏమాత్రం శాంతిలేదు. నీ దర్శనంవల్ల నాజన్మ సఫలమైనట్లుగా ఆనందిస్తున్నాను. మనస్సులో కల్గిన కోరిక

ఎప్పటికైనా తీరుతుందనేమాట నేటికి నాపట్ల వాస్తవమయింది. నా పూర్వజన్మ సుకృతంవల్ల నీ దర్శనమైంది. భవభయాపహారివైన నీవెక్కడనుండి ఇక్కడకు వచ్చావు. మార్గాయాసుడవైనట్లున్నావు. నిన్ను శరణు వేడుతున్నాను. నా పాపాలను నశింపజేయుము. మళ్ళీ సుఖాలను పొందుతాను" అని సమాధానం చెప్పాడు.

అప్పుడు గౌతముడు "ఓ మహారాజా ! ధన్యుడవు మహా పాపాలవల్ల కలిగినభయం విడిచిపెట్టు. శరణుకోరిన భక్తులకు శివుడు రక్షకుడు. మహాపాతకాలను సైతం హరించే గోకర్ణ క్షేత్రం ఒకటి ఉంది. అక్కడ శివుడు సన్నిహితుడై ఉంటాడు. అందువల్ల అక్కడ స్మరణంచేతనే చిన్నవైనా, పెద్దవైనా పాపాలు నశిస్తాయి. కైలాస శిఖరంమీద, మంధరపర్వత శిఖరంమీద ఉన్నట్లే శివుడు గోకర్ణ క్షేత్రంలోనూ ఉంటాడు. అగ్ని, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాధి పతులూ పోగొట్టలేని చీకటిని సూర్యుడు పటాపంచలు చేసినట్లే, ఏ ఇతర క్షేత్రాలూ తీర్థాలూ పోగొట్టలేని పాపాలను గోకర్ణ క్షేత్ర సందర్శనం పోగొడుతుంది. బ్రహ్మహత్యాది మహాపాపాలొనర్చిన వాడైనా ఒక్కసారి గోకర్ణ క్షేత్రాన్ని ప్రవేశిస్తే సమస్త పాపాలూ నశిస్తాయి. పూర్వం ఈ క్షేత్రంలో ఎందరో మహానుభావులు తపస్సు చేసి సిద్ధిపొందారు. ఇంద్రుడు, ఉపేంద్రుడు, బ్రహ్మ ఇత్యాది సిద్ధిని కాంక్షించేవారితో ఈ క్షేత్రం నిత్యం సేవింపబడుతున్నది. ఇతర క్షేత్రాలలో లక్షవత్సరాలు చేసిన తపఃఫలం ఈ క్షేత్రంలో ఒక్క రోజులోనే లభిస్తుంది. బ్రహ్మవిష్ణ్వాది దేవతల హితార్థియై శివు డిక్కడ మహాబలుడనే పేరుతో వెలిశాడు. రాక్షసరాజైన రావణుని తపస్సువల్ల లబ్ధమైన శివలింగాన్ని గణనాథుడు గోకర్ణ క్షేత్రంలో స్థాపించాడు.

ఆ క్షేత్రాన తూర్పుద్వారంలో దేవేంద్రుడు, బ్రహ్మ, విష్ణువు, విశ్వేదేవతలు, దేవతాగణాలు, ద్వాదశాదిత్యులు, అష్ట వసువులు, ఏకాదశరుద్రులు, తారకాసహితుడైన చంద్రుడు తమ ద్వారపాలకులతో విమానారూఢులై మహాబలుణ్ణి సేవిస్తున్నారు. దక్షిణద్వారాన్ని కాలం, మృత్యువు, యముడు, చిత్రగుప్తుడు, అగ్నిహోత్రుడు పితృదేవతలతోనూ, రుద్రులతో కలిసి ఆశ్రయించారు. వరుణుడు, సముద్రుడు గంగానదీ సమూహంతో పడమర ద్వారానఉండి దేవదేవుని సేవిస్తున్నారు. అలాగే వాయువు, కుబేరుడు, దేవతాశ్రేష్ఠుడు, భద్రకర్ణి, చండికాది మాతృమూర్తులతో ఉత్తరద్వారాన్ని ఆశ్రయించారు. విశ్వావసువు, చిత్రరథుడు, మహాబలుడైన చిత్రసేనుడు గంధర్వ సమూహంతో కూడి పరమేశ్వరుణ్ని గానంచేస్తారు. రంభ, కృతస్థల, మేనక, పూర్వచిత్తి, తిలోత్తమ, ఊర్వశ్యాది దేవతావేశ్యలు శంకరుని ఎదుట నాట్యం చేస్తారు. వసిష్ఠుడు, కాశ్యపుడు, కణ్వుడు, మహాతపశ్శాలి అయిన విశ్వామిత్రుడు, జైమిని, భరద్వాజుడు, జాబాలి, అంగిరసుడు, మొదలైన ఋషులూ, పవిత్రబ్రహ్మస్వరూపులమగు మేమూ దేవదేవుడైన మహాబలుని భక్తితో ఉపాసిస్తున్నాం. మరీచి, నారదుడు, అత్రిమహాముని, దక్షుడు మొదలైన రాజులూ, సనకాది మహాత్ములూ ఎదుట ఉపాసిస్తున్నారు. అలాగే జటావల్కలధారులైన అసంఖ్యాక మునులు, యోగులు, సన్యాసులు, దీక్షాపరులు, బ్రహ్మచారులు తమ తపస్సువల్ల పాపవిముక్తులై, చర్మం, ఎముకలు మాత్రమే మిగిలిన అవయవాలతో పెక్కుమంది దేవదేవుడైన శివుని పరమ భక్తితో సేవిస్తున్నారు. ఆ విధంగా గంధర్వసహితులైన దేవతలు, పితృదేవతలు, సిద్ధచారణులు, విద్యాధర కిన్నరకింపురుష నాగ యక్షులూ, పిశాచభేతాళరాక్షసులూ, సకలైశ్వర్యాలతో సర్వా

భరణభూషితులై స్వర్ణసంకాశ అగ్నివర్ణాలతో, శశిప్రభలతో, విద్యుత్పుంజాలతో సమానమైన విమానారూఢులై దేవదేవుని పరివేష్టించి, స్తోత్రంచేసి, సంగీతంపాడి, కథాపఠనంచేసి, నమస్కరించి నాట్యమాడి ఆనందిస్తున్నారు.

'గోకర్ణసదృశంక్షేత్రం నాస్తినాస్తి జగత్త్రయే' ఈ గోకర్ణంతో సమానమైన క్షేత్రం ముల్లోకాలలో ఎక్కడాలేదు. ఈ క్షేత్రంలో మహాత్ములైన అగస్త్యుడు, సనత్కుమారుడు, ప్రియవ్రత పుత్రులు ఎంతో తీవ్రంగా తపస్సు చేశారు. దేవశ్రేష్ఠుడైన అగ్ని, కందర్పుడు, భద్రకాళీదేవి, ప్రకాశించే శింశుమారుడు, దుర్ముఖుడు, మణినాగుడనే సర్పరాజు ఇక్కడనే తపస్సు చేశారు. ఏలాదేవి కొడుకు మొదలైన నాగులు, బలోపేతుడైన గరుత్మంతుడు, రావణవిభీషణ కుంభకర్ణులు ఇక్కడే తపస్సు చేశారు. అంతే కాక ఎందరో సిద్ధులూ, చారణులు, మానవులు ఈ క్షేత్రనాథుని భక్తితో సేవించి, తమ తమ పేర్లతో వేలకొలది శివలింగాలను స్థాపించి తపస్సిద్ధిని పొంది ఆయా ప్రదేశాలను చక్కని తీర్థాలుగా చేశారు. ఈ క్షేత్రంలో సకలదేవతల స్థానాలూ ఉన్నాయి. దేవదేవుడైన విష్ణువు, పరమేష్ఠిఅయిన బ్రహ్మ, వీరుడైన కార్తికేయుడు, విఘ్నేశ్వరుడు, క్షేత్రపాలకుడైన ధర్ముడు, దుర్గ మొదలైన ఇతర దేవతలచే స్థాపించబడ్డ కోట్లకొలది శివలింగాలున్నాయి. ఇక్కడ అడుగడుగునా లెక్కపెట్టలేనన్ని తీర్థాలున్నాయి. కాబట్టి ఈ క్షేత్రంలో స్నానంచేస్తే అన్ని క్షేత్రాలలో స్నానం చేసినట్లే! అంతెందుకు? ఈ క్షేత్రంలో రాళ్ళన్నీ శివలింగాలే! నీళ్ళన్నీ పుణ్యతీర్థాలే! అందుకే మహర్షులు ఈ క్షేత్రాన్ని కోటితీర్థమని అభివర్ణించారు.

'సర్వేషాం శివలింగానాం సార్వభౌమోమహాబలః' అన్ని శివలింగాలలో గోకర్ణేశ్వరుడైన మహాబలుడు సార్వభౌముడు. కృత యుగంలో శ్వేతవర్ణంతో, త్రేతాయుగంలో చాలా ఎర్రగా, ద్వాపరాన పీతవర్ణంతో, కలియుగాన నల్లగా ఒప్పుతూ ఏడుపాతాళ లోకాలలో వ్యాపించి ఆక్రమించి ఉన్నాడు ఆయన. ఘోరమహాకలి ప్రవేశించినవెంటనే మృదుత్వాన్ని పొందుతున్నాడు. పడమటి సముద్రతీరానఉన్న ఈ క్షేత్రం ఉత్తమమని వర్ణింపబడింది. ఇక్కడ బ్రహ్మహత్యాది మహాపాపాలుకూడా నశిస్తాయి. తల్లిదండ్రులను హతమార్చినవారు, సోదరభాగాలను హరించినవారు, సర్వగుణ హీనులు, పరదారాసక్తులు, దురాచారవృత్తులు, దుశ్శీలురు, దుష్టులు, లుబ్ధులు, అతిక్రోధనులు, మూఢులు, దొంగలు, అతి కామంగలవారు గోకర్ణక్షేత్రానికివచ్చి తీర్థాలలో స్నానంచేసి, మహాబలుని దర్శించి, శంకరపదవిని పొందుతున్నారు.

పుణ్యతిథులలోగాని, పుణ్యనక్షత్రాలలోగాని, పుణ్యవాసరాలలోగాని ఈ మహాదేవుని పూజించినవారు సారూప్యముక్తిని పొందుతారనడంలో సందేహంలేదు. ఎప్పుడో ఒకప్పుడు ఈ గోకర్ణ క్షేత్రాన్ని ప్రవేశించి ఈశ్వరుణ్ని పూజించిన మానవుడు పరమ పదవిని పొందుతాడు. ఆది సోమ బుధవారాలతో కూడిన అమావాశ్యనాడు సముద్రస్నానం, దానం, పితృతర్పణం, శివపూజా జప హోమాలు, వ్రతాలు, బ్రాహ్మణార్చనలు మొదలైనవి ఇక్కడ కొద్దిగా చేసినా అనంతఫలాన్నిస్తాయి. వ్యతీపాతాది యోగాలలో, సూర్యసంక్రమణాలలో, మహాప్రదోష సమయాలలో శివుని పూజిస్తే ముక్తి కలుగుతుంది. తిథులలో ఏ తిథియందు మహాక్రూరుడైన కిరాతుడొకడు శివపరమపదవిని పొందాడో చెప్తాను. విను. 'మాఘమాసో మహాపుణ్యో యాసా కృష్ణచతుర్దశీ శివలింగం బిల్వ

పత్రం దుర్లభంహి చతుష్టయం' మాఘమాసం చాలా పుణ్యప్రద మైంది. అందులో కృష్ణపక్షచతుర్దశినాడు శివలింగాన్ని దర్శించి ఒక్క బిల్వదళాన్నయినా సమర్పించడం నాలుగురకాల మానవు లకూ దుర్లభమే! మాయాబలంవల్ల మూడు వేదాలనూ పఠించక మూఢులు ఎలా సంచరిస్తారో అలాగే మాఘ బహుళచతుర్దశినాడు శివుని పూజించరు. ఉపవాసం. జాగరణం, శివసాన్నిధ్యం, గోకర్ణం అనేవి మానవులకు శివలోకానికి ఏర్పడినమెట్లు.

కాబట్టి ఓ రాజా! శివరాత్రినాడు గోకర్ణంలో శివుని సేవించి ఇప్పుడు నేను అక్కడనుండే వస్తున్నాను. అన్ని దేశాలనుండి నాలుగు వర్ణాలవారూ శివరాత్రి ఉత్సవం చూడడానికి అక్కడకు వచ్చారు. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాస అనే నాల్గు ఆశ్రమాలవారూ, స్త్రీ బాలవృద్ధులందరూ ఆ క్షేత్రాన్ని దర్శించి కృతకృత్యులయ్యారు. అలాగే నేనూ, నా శిష్యులూ, ఈ ఋషు లందరూ, సనకాదిదేవ ఋషులూ, రాజర్షులూ, మహాబలుని ఉపా సించి జన్మసాఫల్యాన్ని పొందాం. జనక మహారాజు యాగార్థమై ఆహ్వానం పంపగా అక్కడ నుండి తిరిగి వస్తున్నాను. దారిలో ఒక మహాశ్చర్యాన్ని చూచి అపరిమితానందాన్ని పొందాను" అని గౌతముడు చెప్పాడు.

ఇది స్కాందపురాణంలోని బ్రహ్మోత్తరఖండంలో మాఘ బహుళచతుర్దశి మహిమ మొదలైన వర్ణనలున్న రెండో అధ్యాయం.

— / —

# తృతీయోధ్యాయం

"ఓ మునివర్యా ! నిన్నాశ్చర్యపరచిన ఆ వృత్తాంతమేమిటి ?" అని ప్రశ్నించాడు రాజు. దానికి గౌతముడు "ఓ రాజా ! నేను గోకర్ణ క్షేత్రం నుండి వస్తూ దారిలో మధ్యాహ్న సమయానికి ఒక సరస్సును చేరాను. అందులో ఉన్న స్వచ్ఛమైన నీటిని త్రాగి మార్గాయాసాన్ని పోగొట్టుకొని, దట్టంగా చల్లగా ఉన్న ఒక మఱ్ఱిచెట్టు నీడకు చేరాను. దానికి సమీపంలో ఒక చండాలస్త్రీని చూచాను. ఆమె వృద్ధురాలు, గుడ్డిది, కృశించిన శరీరం, ఎండినముఖం కలది. ఆహారంలేక అనేక రోగాలతో బాధపడుతున్నది. కుష్ఠరోగ సంబంధమైన పుళ్ళనుండి కులకుల లాడుతున్న పురుగులు, కారుతున్నరక్తం, తీవ్రజ్వరం, క్షయరోగంవల్ల చెవులలో పెద్దధ్వని. మాటిమాటికి పడుతూ లేస్తూ ఏడుస్తూన్న ఆమె ఒళ్ళంతా సూర్యకిరణ తప్తమైన ధూళి నిండిఉంది. మలమూత్రాలు నిండిఉండటంతో దుర్గంధభూయిష్టంగా చేరశక్యం కాకుండాఉంది. శ్లేష్మరోగంవల్ల పెద్దపెద్ద నిట్టూర్పులు విడుస్తున్నది. బద్ధలైన నాసారంధ్రాలతో, వ్రేలాడుతున్న తలవెంట్రుకలతో ఆమె చావడానికి సిద్ధంగాఉంది. మరణావస్థలో ఉన్న ఆ స్త్రీ మీద దయగలిగి కొంతసేపు అక్కడే ఆగాను.

ఇంతలో ఆకాశమార్గాన శివదూతలు కాంతులుజిమ్మే ఒక విమానాన్ని తీసుకువచ్చారు సూర్యచంద్రాగ్నులను ఒక పంజరంలో ఉంచారా అన్నట్లు ఆ విమానంలోని శివదూతలు ప్రకాశిస్తున్నారు. వాళ్ళు త్రిశూలఖట్వాంగాసిధారులు, కరిచర్మాంబరులు, చంద్రార్ధ శిరోవిభూషణులు. చంద్రుడిలా, మల్లెమొగ్గల్లాఉన్న పెద్ద వక్షస్థలం కలవారూ, కిరీటకుండలాలతో అమూల్యకంకణాలతో ప్రకాశిస్తున్న వారూ, శుభచిహ్నోపేతులూ అయిన ఆ శివదూతల్ని

చూచాను. దగ్గరగావస్తున్న ఆ నల్గురి శివదూతలని ఆశ్చర్యంతో ఈ విధంగా ప్రశ్నించాను. "దేవతలకు ప్రభువైన ముక్కంటి పాదారవిందాలను ఎల్లప్పుడూ సేవిస్తూ ముల్లోకాలను రక్షిస్తూ త్రిశూల చర్మాసిగదాధరులైన ఓ శివదూతలారా! మీకు నమస్కారం. మీరు శివదూతలని తెలుసుకున్నాను. ఆశ్చర్యాన్ని కలిగించే మీరాక లోకసంరక్షణార్థమా లేక వినోదార్థమా లేక మానవ పాపవినాశార్థమా? నాయందు దయతో చెప్పండి."

అప్పుడు శివదూతలు "చావడానికి సిద్ధంగాఉన్న ఈ వృద్ధ చండాలిని తీసుకొని పోవడానికి రాజుగారి ఆజ్ఞవల్ల వచ్చాం" అని చెప్పారు. ఆ మాటలువిని ఆశ్చర్యమగ్నమానసుడనయాను. అంజలి ఘటించి "ఈ చండాలస్త్రీ ఘోరమైన పాపాలుచేసింది. యజ్ఞశాలా మంటపాన్ని చేరిన కుక్కలాగా ఈమె ఈ దివ్యవిమానాన్ని ఎక్కడానికి ఎలా అర్హురాలు. పుట్టిందిమొదలు అపవిత్రురాలై ఎన్నో పాపపుజన్మలెత్తిన ఈ దురాచారురాలిని శివలోకానికి ఎలాతీసుకు వెడతారు? ఈమెకు శివజ్ఞానంలేదు, ఘోరతరమైన తపస్సులేదు, సత్యంలేదు, దయలేదు. ఇలాంటిదానిని శివలోకానికి ఎలాతీసుకు వెడతారు? ఈమె ఎప్పుడూ పుణ్యతీర్థాలలో స్నానం చేయలేదు. ఏదానాలూ వ్రతాలూ చేయలేదు. ఈమెను శివలోకానికి ఎలా తీసుకువెడతారు? ఈమె పంచాక్షరీ మంత్రాన్ని జపించలేదు. శివుణ్ణి పూజించలేదు. శంకరుణ్ణి ఎప్పుడూ ధ్యానించలేదు. ఇలాంటి స్త్రీకి శివలోకం ఎలా పొందిస్తారు? ఈమె మాఘకృష్ణ చతుర్దశి నాడు ఉపవాసం చేయలేదు. ఈమెకు భూతదయ ఏకోశానాలేదు. కూపతటాకాది పుణ్యకార్యాలు ఎప్పుడూ చేయలేదు. ఈమెను శివలోకానికి ఎందుకు తీసుకుపోతున్నారు. ఈమెను అసలు చూడనే కూడదు. ఇంక మాటాడడం ఎట్లా? మంచి సావాసమైన ఎప్పుడూ

చేయని ఈ హీనురాలు శివలోక ప్రవేశానికి ఎట్లా అర్హ అవుతుంది? పూర్వజన్మ సుకృతం అంటారా? ఇలాంటి కుష్ఠ క్షయ రోగపు పురుగులతో ఆ పుణ్యమెప్పుడో హరించబడింది. 'అహో ఈశ్వర చర్యే యం దుర్విభావ్యా శరీరిణాం' శరీరధారులకు భగవంతుని చర్యలు తెలియవుకదా! పాపాత్ములకు కూడా పరమపదవి లభించడం ఎంత ఆశ్చర్యం!" అని నేను అనగా శివదూతలు నాపట్ల దయతో ఈ విధంగా చెప్పారు.

"ఓ బ్రాహ్మణుడా! శ్రద్ధగా విను. పూర్వజన్మలో పూర్ణ చంద్రబింబోపమానముఖి అయిన సౌమిని అనే ఒక బ్రాహ్మణకన్య ఉండేది. ఆమె అప్పుడే వికసించిన మల్లెపూలదండలా సుకుమారవతి. ఆమె తండ్రి కేకయుడు. సర్వశుభలక్షణోపేతగా రెండవ రతీదేవిలా ఉన్న ఆమె సౌందర్యానికి అందరూ ముగ్ధులయేవారు. దినదిన ప్రవర్ధమాన అయిన ఆ కన్య బంధువులందరిచే లాలింపబడుతూ కందర్ప ధనలక్ష్మిలా క్రమంగా యౌవనవతి అయింది. కొంతకాలానికి ఒక బ్రాహ్మణ యువకుణ్ని శాస్త్రోక్తంగా వివాహమాడింది. భర్తతో కలిసి శుభాచారపరురాలై ఆమె ఉండగా విధివశాత్తు ఆమె భర్త రోగపీడితుడై హఠాత్తుగా మరణించాడు.

దాంతో ఆ చిన్నది దుఃఖిస్తూ శీలవంతురాలుగా జితేంద్రియగా కొంతకాలం గడిపింది. కాని నిత్యమూ విజృంభిస్తున్న యౌవనంవల్ల మన్మథబాణాహతహృదయ అయింది ఆమె. పెద్దలచే శిక్షితురాలైనప్పటికీ, బంధువర్గంచే గుప్తంగా రక్షింపబడినప్పటికీ మన్మథాకృష్టమానసాన్ని నిలుపుకోలేకపోయింది. సౌందర్యవతి, అందులో మన్మథావేశతప్తురాలు. కాబట్టి భర్తృహీన అయినప్పటికీ వ్యభిచారాసక్తురాలయింది. తెలివిగల ఆమె తన జారత్వాన్నీ, దురాచారాన్నీ కొంతకాలం వరకూ ఇతరులకు తెలియనీయలేదు. దురా

లలో కాఠిన్యం, చూచుకాలు నల్లబడడం మొదలైన లక్షణాలవల్ల ఆమెను జారిణిగా, గర్భవతిగా బంధువులు గుర్తించారు.

'స్త్రియః కామేన నశ్యంతి బ్రాహ్మణోన్నృపసేవయా రాజానో బ్రహ్మదండేన యతయో భోగసంగ్రహాత్' కామోద్రేకంవల్ల స్త్రీలూ, రాజసేవవల్ల బ్రాహ్మణుడూ, బ్రాహ్మణాపకారంవల్ల రాజూ, విషయసుఖలాలసత్వంవల్ల సన్యాసులు నాశనమవుతారు. కుక్క ముట్టుకోవడంవల్ల అన్నం, కల్లుపోయడంవల్ల పాలూ, కుష్ఠువ్యాధివల్ల సౌందర్యం, వ్యభిచారి అయిన స్త్రీవల్ల వంశం నాశనమవుతుంది." అని ఆలోచించి ఆమె సోదరులు కొప్పుపట్టి ఈడ్చి ఆమెను ఊరికిదూరంగా విడిచిపెట్టారు. బంధువర్గం ఆమెకు ఘట శ్రాద్ధంకూడా పెట్టి చేతులు కడుక్కున్నారు.

ఊరిబయట తిరుగుతున్న ఆ బ్రాహ్మణ యువతిని ఒక ధనికుడైన శూద్రుడు చూచాడు. పీనోన్నతపయోధర అయిన ఆ సుందరయోనను మంచిమాటలుచెప్పి తన ఇంటికి తీసుకుపోగలిగాడు. ఆమె ఆతడికి భార్యగా సంచరిస్తూ మధుపానమత్తయై ఒళ్ళు తెలియకుండా కాముకుడైన ఆ శూద్రుడితో రాత్రింబవళ్లు యథేచ్ఛగా క్రీడించింది. మాంసాన్ని తింటూ నిత్యం కల్లుత్రాగుతూ అతడితో విహరిస్తూ కొంతకాలానికి ఒక పుత్రుణ్ని కన్నది.

ఒకరోజామె భర్తలేని సమయంలో మద్యపానం చేసిన మత్తులో ఒళ్లుతెలియక మాంసాహారం కావాలనుకొన్నది. చీకటి పడటంతోటే ఒక కత్తిపట్టుకొని బయట గోశాలలో కట్టబడిన మేకల దగ్గరకు వెళ్ళింది. మదోన్మత్తురాలైన ఆమె మేక అనే భ్రాంతితో "అంబా" అని అరుస్తున్న ఒక ఆవుదూడను చంపింది. ఇంటిలోకి తెచ్చి చూచి అది ఆవుదూడని తెలిసి భయంతో పూర్వజన్మ పుణ్య కర్మవల్ల "శివశివ" అని పలికింది. ఒక్క ముహూర్తకాలం ఆమె

శివుణ్ని ధ్యానించి మామూలుగా తనకిష్టమైన ఆహారంగా వండు కొని ఆ లేగమాంసాన్నే తిన్నది. సగం శరీరాన్ని ఆహారంగా వండుకొనితిని మిగిలిన సగాన్ని బయటపారవేసి ఏమీ ఎరగ నట్లుగా "అయ్యో! గోశాలలోని లేగదూడను పెద్దపులి మ్రింగింది" అని పెద్దగా ఏడ్చింది. అది విని చుట్టుపక్కల శూద్రులంతావచ్చి ఆ మాటలు నిజమనినమ్మి వాళ్లుకూడా దుఃఖించారు. తెల్లవారిన తరవాత ఆమె భర్తవచ్చి జరిగినదంతా తెలుసుకున్నాడు.

కొంతకాలానికి ఆమె మరణించి యమలోకానికి పోయింది. యముడాలోచించి దాని పూర్వకర్మ ననుసరించి చండాలజాతిలో పుట్టేటట్లుగా చేశాడు. అదేవిధంగా ఆమె ఒక చండాలస్త్రీ కడుపున జాత్యంధురాలుగా పుట్టింది. అయినా ఆమె తండ్రి ఎంతో దయతో ఆమెను పోషించాడు. అభోజ్యమైనదీ, కుక్క తినగామిగిలిందీ, దుర్వాసనకొట్టేదీ అయిన అన్నంపెట్టి త్రాగడానికి పనికిరాని నీళ్ళిచ్చి తల్లి ఆమెను పెంచింది. పుట్టుగుడ్డితనంతో బాటుగా కొన్నాళ్ళకు ఆమెకు కుష్ఠవ్యాధికూడా సోకడంవల్ల ఎవరూ పెళ్ళిచేసుకోలేదు. బాల్యం వెళ్ళకుండానే ఆమె తల్లిదండ్రులు చనిపోవడంవల్ల బంధువులూ, సోదరులూ ఆమెను విడిచిపెట్టారు. అప్పుడామె ఆకలికి బాధ పడుతూ. దిక్కులేక కన్నసాయంతో ఇంటింటికీ తిరిగి అడుక్కుంటూ చండాలుర ఉచ్ఛిష్టంతో కాలంగడిపేది. ఈ విధంగా కొంతకాలం వెళ్ళబుచ్చిన తరవాత వృద్ధాప్యంవల్ల శరీరావయవాలు కృశించి ఆమె చాలాబాధపడ్డది. తింటానికి తిండీ, త్రాగడానికి నీరూ, కట్టడానికి గుడ్డాకూడాలేక అలమటిస్తున్న ఆమె ఒక ఏడు శివరాత్రికి గోకర్ణ క్షేత్రానికి వెడుతున్న యాత్రీకులను చూచింది. దేశదేశాలనుండి అగ్నిహోత్రంతో కుటుంబసమేతంగా వస్తున్న మహాత్ములైన బ్రాహ్మణులూ; అంతఃపురస్త్రీలతో ఏనుగులూ, రథాలూ,

గుర్రాలూ ఎక్కి సపరివారసమేతంగా ఛత్రాలు ధరించి వస్తున్న రాజులూ; నవ్వుకుంటూ, ఆడుతూ పాడుతూ పరుగెత్తి వస్తున్న వైశ్యాది మిగిలిన వర్ణాలవారూ; తింటూ త్రాగుతూ కేకలువేస్తూ వస్తున్న మనుష్యుల కోలాహలం ఆమె విన్నది. వారందరూ గోకర్ణ క్షేత్రానికి వెడుతుంటే దేవతలు విమానారూఢులై చూచి సంతోషిస్తున్నారు. అన్నం బట్టలకోసం ఆ మహాజనాన్ని ఆమె అడుక్కోవడం మొదలుపెట్టింది. కాని ఆమె నెవరూ పట్టించుకోలేదు. అలాగే అడుక్కుంటూ ఒకళ్ళచేతిసాయంతో పూర్వజన్మ సుకృతం వల్ల చాలాకష్టంమీద చివరకు ఆమె గోకర్ణ క్షేత్రం చేరింది.

మార్గం దగ్గరగా ఉండి దీనంగా చేతులు జోడించి ఆమె యాత్రికులను "ఓ జనులారా! నా పూర్వజన్మ పాపంవల్ల బాధ పడుతున్న నన్ను కరుణించి కొంచెం అన్నదానం చేయండి. ఎందల కొద్దీ పూర్వజన్మలలో ఏ కొద్దిగానూ పుణ్యం సంపాదించనట్టి మంద భాగ్యను, పాపాత్మురాలను. ఆర్తులను రక్షించే, ఆశీర్వదించే ఎన్నో పుణ్యాలుచేసిన మహాత్ములారా! నాపట్ల దయదలచండి. అన్నవస్త్రాలకు నోచుకోక కిందపడుకోవడంవల్ల దుమ్ముకొట్టుకు పోయిన నన్ను కరుణించండి. చలికీ ఎండకూ బాధపడుతూ మహా వ్యాధులతో పీడింపబడుతున్న అంధురాలను, ముసలిదానను. నన్ను రక్షించండి. చాలారోజులనుండి ఉపవాసంవల్ల వృద్ధిపొందిన ఆకలి మంటలవల్ల శరీరావయవాలు దహించుకుపోతున్నాయి. నన్ను కాపాడండి." అని విలపిస్తూ అడుక్కుంటున్న ఆమె చేతిలో ఒక పుణ్యాత్ముడు బిల్వదళాలగుత్తిని పడవేశాడు. దానిని ఆమె జాగ్రత్తగా పసిగట్టి అది తినేవస్తువుకాదని దూరంగా పారవేసింది. అదృష్టంవల్ల ఆ బిల్వదళం అర్ధరాత్రివేళ ఒక శివలింగం శిరస్సుమీద పడింది. ఆ శివరాత్రిరోజున యాత్రికులను యాచిస్తూ ఆమె ఏమీ

తినలేదు. కాళికాదేవి ఆలయం వెనకఉన్న కొంచెం ఉత్తర దిక్కుగా వెళ్ళి ఆమె అక్కడ కూర్చున్నది. తెల్లవారడంతోటే నిరాశ చేసుకొని దుఃఖంతో తిరిగి తన స్వదేశానికి ప్రయాణమయింది. చాలారోజులనుండి ఉపవాసం చేయడంవల్ల అడుగడుగునా పడుతూ దీనంగా నడవసాగింది. ఎండవేడికి కాళ్ళుకాలుతూ తలవేడెక్కి కర్ర సాయంతో వంగి నడుస్తూ ఆ ప్రదేశాన్నిదాటి స్ఫృహదప్పి క్రింద పడి ప్రాణాలు కోల్పోయింది.

పిమ్మట దయాసముద్రుడైన ఈశ్వరుడు ఆమెను తన లోకానికి తీసుకురమ్మని ఈ విమానాన్ని ఇచ్చి మమ్మల్ని పంపాడు. ఈమె ప్రవృత్తిచే చండాల అయినప్పటికీ దయాళువైన ఈశ్వరుడీమెను తోడితెమ్మనినాడు. ఈ కర్మపరిపాకంవల్ల శాశ్వతమైన శివస్థానాన్ని పొందుతుంది. పూర్వజన్మలో ఆకలిదప్పులచే బాధపడింది. మద్య పానంచేసి కన్నూమిన్నూగానక మహాపాపాలు చేసింది. అందువల్ల ఈ జన్మలో పుట్టుగుడ్డిదయింది. గోవత్సమని తెలిసికూడా దాని మాంసాన్ని భక్షించింది. కాబట్టి నింద్యమైన చండాల స్త్రీ జన్మ ఎత్తింది. సన్మార్గాన్ని విడిచి వ్యభిచరించింది. అందువల్ల ఎవరూ దీనిని పెళ్ళాడలేదు. విధవగాఉన్న ఈమె పూర్వజన్మలో మదోన్మత్తమై జారుడితో కలిసిన పాపంవల్ల ఈ జన్మలో కుష్ఠవ్యాధికి సంబంధించిన పుళ్ళచే బాధపడింది. కామాంధురాలై యథేచ్ఛగా శూద్రుడితో విహరించడంవల్ల శరీరం నుండి రక్తం, చీము పురుగులు కారే స్థితి ఏర్పడింది. పూర్వజన్మలో సురాపానం చేసినందువల్ల ఈ జన్మలో క్షయ శూల మొదలైన రోగాలు కలిగాయి. పూర్వం ఈమె ఒక మంచివ్రతంకూడా చేయలేదు. తటాకాదులను త్రవ్వించ లేదు. అందువల్లనే ఈ జన్మలో ఏ సుఖమూ అనుభవించలేదు. ఓ మునీశ్వరా! మానవులందరిలో పాపపుచిహ్నాలున్నట్లు మహాత్మ్యాలు

గుర్తించారు. ఈ మానవలోకంలో రోగపీడితులూ, ధనహీనులూ, సంతానహీనులూ, దుర్లక్షణాలున్న దురాత్ములూ, తృప్తిలేని యాచకులూ, ఆహారం–మంచినీళ్లూ–కట్టుబట్ట అలంకారాలు లేనివారు కురూపులూ, నిరక్షరాస్యులూ, అంగవైకల్యం కలవారూ, అనిష్టభోజనులూ, దుష్టులూ, నింద్యులూ, పరసేవకులూ–వీరందరూ పూర్వజన్మలలో మహాపాపాత్ములే! ఇది తెలిసిన మనుజుడు పాపం చేయడు. ఒకవేళ చేసినట్లయితే ఆతడు ఆత్మహత్యాపాపాన్ని పొందుతాడు. 'దేహోయం మానుషో జంతోః బహుకర్మైక సాధనః'– ఈ మానవదేహం అనేక కర్మలు చేయడానికి ముఖ్య సాధనం.

కాబట్టి ఎప్పుడూ సత్కర్మలనే చేయాలి. దుష్కర్మలను విడిచిపెట్టాలి. సుఖాన్ని కోరేవాడు పుణ్యం చేయాలి. దుఃఖాన్ని కోరేవాడు పాపం చేయాలి. ఈ లోకంలో తెలివిగలవాడు ఈ రెండింటిలో ఒకదానినే చేస్తున్నాడు. దుర్లభమైన ఈ మానవ శరీరాన్ని ఆశ్రయించి, తన శ్రేయస్సుకోసం పుణ్యపాపాలలో ఒకదానినే ఆశ్రయిస్తున్నాడు. నరుడు ఆజన్మాంతమూ మహాపాపాలు చేసినప్పటికీ ఒక్క శివుణ్ణి ధ్యానిస్తే ఆ పాపాలన్నింటినీ దాటగలుగుతున్నాడు. పూర్వజన్మలో ఈమె చనిపోయి యమలోకాన్ని చేరినప్పుడు అక్కడ సభవారికి అనుమానం కలిగింది. ఈ యువతి బ్రాహ్మణస్త్రీ అయినప్పటికీ తన కులాచారాన్ని విడవడంవల్ల ఇక్కడకు తీసుకొని రాబడింది. ఈమె బాల్యంలో ఏకొంచెమైనా పుణ్యం చేసిందేమో చూడాలి. అనేకవేల జన్మలలో చేసిన పుణ్య పరిపాకంవల్లగాని మనుష్యులకు బ్రాహ్మణజన్మ లభించదు. కాబట్టి పూర్వజన్మలలో ఈమెకు ఏ మాత్రం పాపం లేదు. ఈ జన్మలోనే ఈమె దారుణమైన పాపం చేసింది. అయినా నరకవాసానికి తగదు.

గోవత్సాన్ని చంపినా పూర్వజన్మకర్మవల్ల "శివశివా" అని స్మరించింది. మంగళకరమైన శివనామాన్ని ఒకసారి భక్తితో పల్కినా పరమపదవి లభిస్తుంది. ఒకే జన్మలో చెడినదైనా ఆ పాపఫలాన్ని చండాలజాతినిపొంది క్రమంగా అనుభవిస్తుంది. అనేక బాధలచే మళ్ళీ మళ్ళీ పీడించబడుతున్నవాళ్ళకు వేరేనరక బాధ లేదు. దుష్టకులంలో పుట్టడం, దారిద్ర్యం, కుష్ఠరోగం, విమూఢత్వం-వీటిల్లో ఒక్కొక్కటీ ఒక్కొక్క నరకం. ఇంతకన్నా గొప్పనరకం ఎక్కడుంది? పూర్వజన్మ పరిపాకంవల్ల ఈమె వివశురాలైనప్పటికీ "శివశివ" అని ఉచ్చరించడంవల్ల మరోజన్మ అంత్యకాలంలో గొప్ప పుణ్యాన్ని పొందుతుంది. దానివల్ల శివపదవిని పొందుతుంది. అలాంటివారిని మేము శిక్షించడానికి అనర్హులం. ప్రభువైన రాజు ఆలోచించి ఏది తగునో అది చేస్తాడు. ఈ విధంగా యమలోకంలో చిత్రగుప్తాదులు ఆలోచించిన తరవాత ఈమె భూమిపై పడింది. మొదట దుష్టురాలైనా అజ్ఞానంవల్ల ఆవుదూడను చంపినపుడు శివనామాన్ని పలకడంవల్ల ఇప్పుడీశ్వరుడికి బిల్వదళాన్ని అర్పించేభాగ్యం కల్గింది. ఈమె గోకర్ణ క్షేత్రంలో శివరాత్రినాడు ఉపవసించి జాగరణముండి రాత్రియందు నిష్కామంగా శివలింగాన్ని అర్చించడంవల్ల లభించిన పుణ్యం ఇప్పుడీమె అనుభవిస్తుంది. దీనిలో ఏ సందేహమూ లేదు."

ఈ విధంగా చెప్పి శివదూతలు ఆ చండాలస్త్రీ జీవరేఖ నాకర్షించి దివ్యమైన తేజస్సుతో తిరిగి వెళ్లారు. దివ్యదేహాన్ని ధరించి కాంతిసమూహంతో ప్రకాశిస్తున్న ఆమెను సంతోషంగా వారు విమానంలో ఎక్కించారు. ఆమె పరమోదార రూపలక్షణశాలినిగా ఒప్పుతూ దివ్యభూషణాంబరధారయై ప్రకాశించింది. ఆమె శరీరం దివ్యసుగంధభరితంగా తేజోవిలాసంగా, దివ్యమాల్యావతంసమైన

దిగా విమానంలో ప్రకాశించింది. రత్నఛత్రపతాకాదులతో సంగీత వాద్యనిస్వనంతో శివదూతలమధ్యలో ఆమె ఆనందంగా కూర్చునది. తన పూర్వజన్మలను మళ్ళీమళ్ళీ తలచుకొని భయకంపితయై ఆశ్చర్య పడి నిద్రలో స్వప్నం పొందినట్లుగా లేచింది. "నేనెవతిని ? ఈ మహానుభావు లెవరు ? మనోహరమైన ఈ లోకమెక్కడిది ? కష్టపడే నా దేహమేమయింది ? చండాలవంశంలో పుట్టిన నాకీవైభవం ఎలా లభించింది ? ఎంత ఆశ్చర్యం ? ఎన్నివేల జన్మలనుండో పుడుతూ చస్తున్నాను. ఈశ్వరపూజా మాహాత్మ్యం ఎంత ఆశ్చర్యకరమైనది ! ఒక్క మారేడుదళం ఇచ్చినంత మాత్రానికే సంతుష్టిపొంది నాలాటి దానికికూడా తన కైలాసపదవి నిస్తున్నాడే ?" అని ఆలోచిస్తూ శివ పాదాలను స్మరిస్తున్న ఆమెను దివ్యవిమానంమీద శివదూతలు ఈశ్వరసన్నిధికి తీసుకొనిపోయారు. ఈశ్వరభక్తి లేశమైనా దాని మహిమ ఎంత గొప్పదో చెప్పాను." అని గౌతముడు అనగా రాజు "ఓ మునీశ్వరా ! పరమేశ్వరుని ఉత్తమ లోకమేది ? దాని లక్షణా లేమిటి ? నాకు చెప్పండి" అని అడిగాడు.

అప్పుడు గౌతముడు "బ్రహ్మాది లోకపాలకుల లోకాలలో లభించని మహానందం ఎక్కడుంటుందో అది పరమేశ్వరలోకం. కామక్రోధాది అరిషడ్వర్గం, పునర్జన్మ ఎక్కడుండదో అది ఈశ్వర లోకం. సర్వత్రా వ్యాపించి నిరుపమానమైన తేజస్సు ఎక్కడ ఉంటుందో, అజ్ఞానాంధకారం ఎక్కడ ఉండదో అది శివుని లోకం. మహాయోగులు, గురువులవల్ల అఖండజ్ఞానంపొంది యోగాభ్యాసం చేసి మళ్ళీ వెనక్కితిరిగిరాని పరమపదవిని పొందుతారో అది ఈశ్వర లోకం. సర్వవేదశాస్త్రాలకు నిలయమూ, అన్నిటికన్నా శ్రేష్టమూ ఏదో అది శివలోకం. ప్రత్యాహారం, ఆసనం, ధ్యానం, ప్రాణ సంయమనం ఇత్యాది అష్టాంగయోగ మార్గాలద్వారా యోగు

లందరూ ఏ పదవిని పొందడానికి ప్రయత్నిస్తున్నారో అది శివలోకం. సదానందస్వరూపం స్వచ్ఛమైన జ్ఞానస్వరూపంతో పార్వతిని గూడి ఎక్కడ శంకరుడు క్రీడిస్తాడో అది శివలోకం. అనేక వేల పూర్వ జన్మల సుకృతంవల్ల స్త్రీ పురుషులు పరమపదవిని పొంది ఎక్కడ ఆనందిస్తారో, తేజోరాశికల్గి, తెలుసుకోలేని మనోహర లోకంలో రాత్రింబవళ్ళ అనే నియమం ఎక్కడఉండదో అది శివలోకం, శివ భక్తి కలవారికే శివలోకం లభ్యంకాని డాంబిక యోగాలచే లోకాన్ని మోసంచేసేవారికి లభించదు. సర్వభూతాలపట్ల దయగలిగి శాంత మూర్తులై శివరాత్రి జాగరణాది మహిమలుగల ఈ కథ విని ఎవరు ఆనందిస్తారో వారు సంసారసముద్రాన్ని దాటి అజ్ఞానం నశించి జ్ఞానులై శివసాయుజ్యాన్ని పొందుతారు.

కాబట్టి ఓ రాజా ! నీవు ఈశ్వరావాసమైన గోకర్ణ క్షేత్రాన్ని సందర్శించి నీ పాపసముదాయాన్ని పోగొట్టుకొని కృతార్థుడివి కమ్ము. ఆ క్షేత్రంలోని తీర్థాలలో స్నానంచేసి మహాబలేశ్వరుణ్ణి యథావిధిగా పూజించి శివరాత్రినాడు నిశ్చల మనస్సుతో ఉపవాస ముండి రాత్రి జాగరణచేసి మారేడుదళాలతో శంకరుణ్ణి పూజించి పాపదూరుడవై శివలోకాన్ని పొందు. నీకు చక్కని ఉపదేశం చేశాను. నేను జనకమహారాజు పట్టణానికి వెడుతున్నాను. నీకు శుభ మగుగాక !" అని చెప్పి గౌతముడు అక్కడనుండి వెళ్ళాడు. రాజు కూడా గోకర్ణ క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ తీర్థోదకంలో స్నానం చేసి పాపవిదూరుడై శంకర పదవిని పొందాడు.

పవిత్రమైన ఉత్తమమైన ఈ కథనెవరు వింటారో, భక్తితో ఇతరులకు వినిపిస్తారో వారు, ఇతరులకు దుర్లభమైన పరమపదవిని పొందుతారు. ఏ మానవుడు ఈ కథను భక్తిశ్రద్ధలతో వింటాడో అతడికి ఇరవై ఒక్క పురుషాంతరాలతో శివలోకాన్ని పొందుతాడు.

సకలశ్రేయస్సులకు మూలం ఇది. అనేక జన్మలలోని పాపాలను పోగొడుతుంది. అజ్ఞానాన్ని నశింపజేస్తుంది. దేవతలచే కీర్తింపబడుతున్నది. గౌతమునిచే చెప్పబడినదీ ఎప్పుడూ వినదగినదీ అయిన ఈ కథను వినిన మనుష్యుడు ఇహపరలోకాలలో సుఖంగా ఉంటాడు. సందేహంలేదు" అని సూతుడు చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండమనే గ్రంథంలో శివరాత్రిమహిమ వర్ణనం, చండాలస్త్రీకీ, కల్మాషపాదుడనే రాజుకూ శివలోకప్రాప్తిని గూర్చి చెప్పిన వర్ణనం ఉన్న మూడో అధ్యాయం.



## చతుర్థోధ్యాయం

సూతమహాముని మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు. "ఓ ఋషీశ్వరులారా! శ్రోతల పాపహారమూ, సంసారబాధ విముక్తిని కలిగించేదీ అయిన శివమహిమను చెపుతున్నాను వినండి.

'దుస్తరేదురితాంభోధౌ మజ్జతాం విషయాత్మనాం శివపూజాం వినాకశ్చిత్ ప్లవోనాస్తి నిరూపితః' తరింపరాని పాపసముద్రంలో మునుగుచున్న విషయవాంఛలుకల నరులను శివపూజతప్ప దరిచేర్చే నావ మరొకటిలేదు. బుద్ధిమంతుడైనవాడు ఈ లోకంలో ఎప్పుడూ శివపూజ చేయాలి. ఒకవేళ దానికి అశక్తుడైతే ఇతరులు చేసే పూజఅయినా చూడాలి. శివపూజ అశ్రద్ధతో చేసినా అతడు పరమపదవిని పొందుచున్నాడు. శివపూజకు సంబంధించి పూర్వగాథ ఒకటి ఉంది.

కిరాతదేశాలలో విమర్శనుడనే రాజొకడున్నాడు. అతడు శూరుడు. అరివీరభయంకరుడు. మృగయాసక్తుడు. సకలసేనాసమేతుడు, మహాబలవంతుడు, నిర్దయుడు అన్నివిధాల మాంసాలనూ తినేవాడు. అన్ని జాతుల స్త్రీలతో రమించేవాడు. అయినప్పటికీ నిత్యమూ శ్రద్ధాసక్తులతో శివపూజ చేసేవాడు. రెండు పక్షాలలోని చతుర్దశినాడు శివపూజ మహావైభవంగా చేసి ఆనందించేవాడు. శివుణ్ణి పూజించి నాట్యంచేస్తూ శివస్తోత్రాలను గానం చేస్తుండేవాడు. ఈ విధంగా చేస్తున్నప్పటికీ అన్నింటినీ భక్షిస్తూ దురాచారుడై ప్రవర్తిస్తుండేవాడు. కాని ఆతడి పట్టపురాణి కుముద్వతి సర్వసద్గుణోపేత, అనుకూలవతి, పతివ్రత. ఒకనాడామె ఏకాంతంగా భర్తను "రాజా! నీ చరిత్ర చాలా విచిత్రంగాఉంది. ఈ గొప్ప దురాచారమెక్కడ? పరమేశ్వరునిపట్ల భక్తి ఎక్కడ? ఎప్పుడూ అన్నింటినీ భుజిస్తున్నావు. అన్ని జాతుల స్త్రీలతో క్రీడిస్తున్నావు. అన్నింటినీ హింసించే క్రూరస్వభావుడవు. అట్లాంటి నీకు ఈశ్వరభక్తి ఎట్లా కుదిరింది'? అని అడిగింది.

చాలాసేపు ఆలోచించి త్రికాలవేది అయిన ఆ రాజు తన భార్యతో "ప్రేయసీ! నేను పూర్వజన్మలో ఒక కుక్కను. పంపా నగరాన్ని ఆశ్రయించి ఎప్పుడూ తిరుగుతూ అక్కడే కొంతకాలం గడిపాను. ఒకనాడు నేనొక శివాలయానికి వెళ్లాను. ఆ రోజు మహాశివరాత్రి శివపూజ జరుగుతున్నది. ఆలయసింహద్వారంకడ నిలబడి దూరంనుండి ఆ మహోత్సవాన్ని దర్శించాను. అప్పుడు చాలామంది కర్రలు పట్టుకొని కోపంతో నన్ను తరిమారు. ప్రాణాలు కాపాడుకుందుకు అక్కడనుండి మరలి ఆ శివాలయంచుట్టూ ప్రదక్షిణంచేసి మళ్ళీ సింహద్వారం దగ్గరకురాగా మళ్ళీ వాళ్ళు తరమడంవల్ల మరో ప్రదక్షిణం చేశాను. శివుడికి నివేదింపబడ్డ పదార్థం తినాలనే ఆశతో

తిరిగి గుమ్మంవద్దకు వెళ్ళాను. మరో ప్రదక్షిణచేసి సింహద్వారం దగ్గరకువచ్చి కూర్చున్న నన్ను కొందరు ధనుర్ధరులు బాణాలతో కొట్టారు. ఆ దెబ్బలకు నేనక్కడే ప్రాణాలు విడిచాను. ఆ శివ సాన్నిధ్య మహిమవల్ల రాజవంశంలో పుట్టుక లభించింది. చతుర్దశి రోజున ఆ పూజను, దీపమాలను చూసిన పుణ్యంవల్ల త్రికాలజ్ఞానం అలవడింది. జన్మాంతరవాసనా సంబంధంవల్ల నిర్దయుడనై సర్వ భక్షకుడనయాను. 'విదుషామపి దుర్లఘ్యా ప్రకృతి ర్వాసనా మయీ!' ఎట్టి పండితుడికైనా వాసనారూపమైన ప్రకృతి దాట శక్యం కాదుకదా! అందువల్లనే ప్రతి చతుర్దశినాడు నేను జగద్గురు డైన శివుణ్ని పూజిస్తున్నాను. నీవుకూడ పినాకపాణి అయిన శివుణ్ని శ్రద్ధగా పూజించు'మని చెప్పాడు.

అదివిని రాణి "ఓ రాజేంద్రా! శంకరుడి దయవల్ల త్రికాలజ్ఞ డవు కదా! నా పూర్వజన్మ వృత్తాంతాన్నికూడా చెప్పు"మని అడిగింది.

దానికి రాజు "ఓ రాణీ! వెనకటి జన్మలో నీవు ఆకాశంలో తిరిగే ఆడపావురానివి. ఒకనాడు నీకు దైవయోగంవల్ల కొంచెం మాంసపుముక్క దొరికింది. ఒక బలమైన గ్రద్ద నీ దగ్గరున్న మాంసపుముక్క చూసి ఆశపడి నీ కెదురుగా వచ్చింది. నీవు దాన్ని చూచి భయపడి పారిపోయావు. కాని ఆ గ్రద్ద నిన్ను వెంబడించి తరిమింది. దైవయోగంవల్ల శ్రీశైలపర్వతాన్ని చేరి అక్కడి శివా లయానికి ప్రదక్షిణం చేసి అలిసిపోయి ధ్వజస్తంభం చివర నిలబడ్డావు. ఆ గ్రద్ద తన వాడిఅయిన ముక్కుతో నిన్ను కొట్టి అక్కడ నుంచి పడవేసి మాంసాన్ని లాక్కొనిపోయింది. శివుడికి ప్రదక్షిణం చేయ డంవల్లనూ, ధ్వజస్తంభం చివర మరణించడంవల్లను, నీవీ జన్మలో రాజపుత్రికగా జన్మించావు" అని చెప్పాడు.

అది విని కుముద్వతి "నా పూర్వజన్మను గూర్చి విని నాకు చాలా ఆశ్చర్యం వేసింది. అంతేకాక నా మనస్సులో భక్తికూడా కలిగింది. మనమీజన్మల తరవాత ఏ ఏ జన్మల నెత్తుతామో చెప్ప వలసింది" అని అడిగింది.

దానికి రాజు "తరవాతి జన్మలో నేను సింధు రాజుగా జన్మి స్తాను. నీవు సృంజయ మహారాజు కూతురుగా పుట్టి నన్నే పెళ్ళి ఆడతావు. ఆ తరవాతి జన్మలో సౌరాష్ట్ర దేశాధీశుడిగా పుడతాను. నీవు కళింగరాజ కుమార్తెగా జన్మించి నాకు భార్యవవుతావు. నాల్గవ జన్మలో గాంధార దేశపు రాజునై జన్మిస్తాను. నీవు మగధదేశపు రాజకుమార్తెవై నాకు సతివవుతావు. అయిదవ జన్మలో అవంతి దేశాధీశుడనవుతాను. నీవు దాశార్హరాజ తనయవై నన్నే పెండ్లి ఆడతావు. ఆరవ జన్మలో ఆవర్తదేశపు రాజునై పుడతాను. నీవు యయాతి రాజపుత్రికవై నన్నే చేపడతావు. ఏడవ జన్మలో నేను పాండ్యరాజ కుమారుడనవుతాను. ఆ జన్మలో రూపంలో ఔదా ర్యంలో సద్గుణాలలో నాకు సమానుడుండడు. సకలశాస్త్రార్థాలు తెలిసి బలవంతుడినై మహాపరాక్రమవంతుడనై, సర్వలక్షణశోభితు డనై, సర్వలోకమనోహరుడనై సూర్యసమాన ప్రభతో పద్మవర్ణుడనే పేరుతో పాండ్యదేశాధిపతినై జన్మిస్తాను. నీవు విదేహ రాజకు మార్తెవై పుడతావు. ఆజన్మలో సుమతి అనే పేరుతో ప్రసిద్ధురాలవై సర్వావయవ సౌందర్యంతో సకలరాజలోక మనోనేత్రాలకు ఆనంద దాయవై స్వయంవరసమయంలో సర్వరాజమండలాన్నీవీడి దమ యంతి నలుణ్ని వరించినట్లుగా నన్నే వరునిగా వరిస్తావు. నేను సకల రాజులనూ జయించి సౌందర్యవతివైన నీతోకలిసి సౌరాష్ట్రంలో చాలాకాలం సకలభోగాలనూ అనుభవించి వాజపేయాది అనేక క్రతువులను ఆచరించి దేవఋషులనూ, పితృదేవతలనూ తృప్తిపరచి

దానధర్మాలచే బ్రాహ్మణులను సంతృప్తిపరచి దేవదేవుడూ, సకల లోక శుభంకరుడూ అయిన శంకరుణ్ణి పూజించి కుమారునియందు రాజ్యభారముంచి తపస్సు చేసుకుందుకు అరణ్యాలకు వెడతాను. ఆ వనంలో మునీశ్వరుడైన అగస్త్యుని దయవల్ల బ్రహ్మజ్ఞానాన్నిపొంది నీతోకూడ చివరకు శంకరపరమ పదవిని పొందుతాను. ప్రతి చతుర్దశి యందు ఈ విధంగా శంకరుణ్ణి ఆరాధించి ఈ జన్మమొదలు ఏడు జన్మల వరకూ మహారాజుగా ఉండగలను. ఆ శంకరుని పూజ చూచినమాత్రానికే ఇలాంటి పుణ్యం నాకు లభించింది. ఎక్కడి కుక్కజన్మ! ఎక్కడి దురాచారప్రవర్తనం! ఎక్కడ ఉత్తమమైన ఈ పదవి! శంకరుని మహిమ అమోఘం." అని చెప్పాడు.

అదివిని సంతోషంతో కుముద్వతి ఆశ్చర్యపడి తన భర్తను పూజించింది. ఆ రాజుకూడా తన భార్యతో సకలభోగాలనూ యథేచ్ఛగా అనుభవించి ఏడు జన్మల తరవాత భార్యతోకూడ శివసాయుజ్యాన్ని పొందాడు.

ఆశ్చర్యకరమైన ఈ శివపూజా మాహాత్మ్యాన్ని ఎవరు పఠించినా, ఇతరులకు చదివి వినిపించినా తప్పక శివలోకాన్ని పొందుతారు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో శంకరపూజా సందర్శన మహిమావర్ణనంగల నాలుగో అధ్యాయం.

— / —

## పంచమోధ్యాయం

సూతమునీంద్రుడు ఇట్లు చెప్పడం ఆరంభించాడు. 'శివో గురుశ్శివో దేవ శ్శివో బంధుశ్శరీరిణాం శివ ఆత్మా శివోజీవశ్శివా దన్యన్న కించన.' శరీరధారులకు శివుడే గురువు, శివుడే దైవము, శివుడే

బంధువు, శివుడే ఆత్మ, శివుడే జీవుడు, శివుడికన్నా వేరేవమీ లేదు. శివుడిని ఉద్దేశించి సమర్పించబడ్డ, జపించబడ్డ లేక చేయబడ్డ హోమ మొనర్చబడ్డ ఏ స్వల్పమాత్రమైనా అనంతఫలదాయకమని సర్వశాస్త్రాలలో నిశ్చయించబడింది. 'భక్త్యా నివేదితం శంభోః పుష్పం పత్రం ఫలం జలం అల్పాదల్పతరం వాపి తదనంతాయ కల్పతే' శివుడికి భక్తితో సమర్పించిన పుష్పంగానీ, పత్రంగానీ, ఫలంగానీ ఉదకంగానీ ఎంత అల్పమైనా అది అనంతఫలదాయక మవుతుంది. సకలశాస్త్రాలలో చెప్పబడ్డ ధర్మాలన్నింటినీ విడిచి ఒక శివుణ్ని సేవిస్తేచాలు వాడికి సర్వబంధాలనుండి విముక్తి లభిస్తుంది. తన కొడుకూ, భార్యా, ధనం– వీటిపట్ల ఎలాంటి ప్రీతి ఉంటుందో అలాంటి ప్రేమ శివపూజపట్ల ఉన్నట్లయితే వాడు శివ పదవిని పొందడంలో ఆశ్చర్యంలేదు.

కాబట్టి కొందరు మహాత్ములు సకలవిషయ వాంఛలతోబాటు విడవడానికి శక్యంగాని తమ శరీరాన్ని కూడా శివభక్తి నిమిత్తం విడిచి పెడుతున్నారు. శివుని నుతించేదే నాలుక. శివుని ధ్యానించేదే మనస్సు. శివకథలు వినడానికి ఉత్సుకతచూపేవే చెవులు. శివుని పూజించేవే చేతులు. శివుని దర్శించేవే నేత్రాలు. శివుణ్ని నమస్కరించేదే శిరస్సు. భక్తితో శివక్షేత్రాలను గూర్చి తిరిగేవే పాదాలు. ఎవరి సర్వేంద్రియాలూ శివకర్మలపట్ల ప్రవర్తిస్తాయో అలాంటివారు సంసారసముద్రాన్ని తరిస్తూ భక్తినీ ముక్తినీ పొందుతారు. శివునిపట్ల భక్తిగలవాడు చండాలుడైనా కిరాతుడైనా స్త్రీ అయినా పురుషుడైనా నపుంసకుడైనా సంసారాన్ని విడిచి ముక్తిని పొందుతున్నాడు. శివభక్తి ఉన్న నరుడికి కులాచారాలతోగానీ, శీలంతోగానీ,

సద్గుణాలతోగానీ ఎంతమాత్రం పనిలేదు. అలాంటివాడు అందరిలో ఉత్తముడవుతాడు.

ఈ శివభక్తి నుద్దేశించి ఒక పాతకథఉంది. ఉజ్జయినీ పట్టణంలో చంద్రసేనుడనే పేరుగలరాజు ఒకడుండేవాడు. అతడు మనుష్యరూపం ఎత్తిన రెండవ ఇంద్రుడిలా మహాకాళేశ్వరుని పూజించేవాడు. అతడికి శివభక్తుడైన మాణిభద్రుడనే పేరుగల ఒక మిత్రుడున్నాడు. అతడు మహాభాగ్యవంతుడు, శుభుడు, సర్వులచే నమస్కరింపబడేవాడు. అతడొక దివ్యమైన చింతామణి అను గొప్ప మాణిక్యాన్ని రాజునకిచ్చాడు. అది సూర్యకాంతితో ప్రకాశిస్తూ కౌస్తుభంలా భాసించింది. చూచిన దానినీ, విన్న దానినీ, తలచిన దానినీ, సర్వశుభాలను మానవులకు ఆ మణి ఇచ్చేది. దానిచే స్పృశించబడ్డ రాగిగానీ, కంచుగానీ, ఇనుముగానీ, తగరంకానీ ఏ ఇతరమైన రాయిగానీ బంగారంగా మారేది. దానిని కంఠమందు ధరించి ఆ రాజు సింహాసనంమీద కూర్చున్నప్పుడు రెండవ సూర్యుడిలా ప్రకాశించేవాడు.

ఈ సంగతివిని ఇతర రాజులు క్రౌర్యంతో అసహనాన్ని పొందారు. కొంతమంది ఆ మణిని తమకిమ్మని అడిగారు. మరికొందరు దుర్మదంతో బెదిరించారు. అది దైవలబ్ధమని తెలుసుకోలేకపోయారు. వారెంతగా అడిగినా రాజు మణి నెవ్వరికీ ఇవ్వలేదు. సౌరాష్ట్ర, కేకయ, సాల్వ, కురు, గాంధార, వంగ, పాంచాల, అవంతి, సౌవీర, మాగధ, మాత్స్య, సృంజయ దేశాధిపతులునూ, ఇతర రాజులునూ కలిసి ఏనుగులూ, రథాలూ, గుర్రాలూ సేనతో అతడిమీదకు దండెత్తారు. ఆ రాజులు భూమిని క్రక్కదలిస్తూ తమ పరాక్రమంతో అతణ్ని జయించదలచారు. ఆ రాజులు తమ సేనా వాహినితో ఉజ్జయినీ పట్టణపు నాల్గుద్వారాలనూ ముట్టడించారు.

కాని చంద్రసేన మహారాజు నిర్భయుడై నిరాతంకుడై దృఢ నిశ్చయుడై మహాకాళేశ్వరుని శరణుకోరాడు. ఆ సర్వేశ్వరుడే పాలించగలడనే విశ్వాసంతో నిశ్చలమనస్కుడై రాత్రిం బవళ్లు ఆ శంకరుని పూజిస్తూ గడపసాగాడు. ఆ సమయంలో పట్టణంలో ఒక గొల్లది తిరుగుతూ మహాకాళనాథుని సమీపించింది. విధవరాలైన ఆమె అయిదేళ్ళ కొడుకును ఎత్తుకొనివచ్చి రాజుచేసే శివపూజను దర్శించింది. తరవాత నమస్కరించి తన ఇంటికి వెళ్ళింది. ఆమె కొడుకు ఇదంతా చూచి సంతోషంతో మోహాన్నిచ్చే శివపూజను చేశాడు. తన ఇంటి సమీపంలోఉన్న ఒక రాయిని తీసుకొనివచ్చి దానిని కాళీప్రదేశంలో శివలింగంగా స్థాపించాడు. తనకు దొరికిన పూలను తెచ్చి ఆ శివలింగానికి స్నానం చేయించి పూలతో భక్తితో పూజించాడు. గంధం, అలంకారం, వస్త్రం, ధూపం, దీపం, అక్షతలు మొదలైనవి, నైవేద్యం కృత్రిమంగా కల్పించి సమర్పించాడు. మనోహరమైన పత్రపుష్పాలతో మళ్ళీ మళ్ళీ శివుని పూజించి అనేక విధాలుగా నాట్యంచేసి తిరిగి తిరిగి నమస్కరించాడు.

ఈ విధంగా అనన్యచిత్తుడై శివపూజచేస్తున్న కుమారుణ్ని ఆ గోపికాస్త్రీ ప్రేమతో భోజనానికి రమ్మని పిలిచింది. తల్లి ఎన్ని మార్లు పిలిచినా ఆరాధనయందే లగ్నమైన అతడి మనస్సు భోజనం కూడా కోరలేదు. అప్పుడాతడి తల్లి స్వయంగా అక్కడికి వచ్చింది. శివుడి ఎదుట కళ్ళుమూసుకొని మౌనంగా కూర్చున్న కొడుకును చూచింది. అతడి చేయిపట్టుకొని ఈడ్చి కోపంతో కొట్టింది. కాని అతడు కదలలేదు. దాంతో ఆమె అతడి పూజను పాడుచేసి శివలింగాన్ని దూరంగా పారవేసింది. "అయ్యో" అంటూ ఏడుస్తున్న కొడుకును విడిచి ఆమె రోషంతో ఇంటికి వెళ్ళిపోయింది.

తల్లిచే పాడయిపోయిన పూజను చూచి అతడు "దేవాదేవా" అంటూ క్రిందబడి దొర్లుతూ ఏడ్వడం మొదలు పెట్టాడు. చైతన్య రహితుడై ఆ విధంగా కొంతసేపు కన్నీరుమున్నీరుగా ఏడ్చి తెలివి దెచ్చుకొని ఒక క్షణంలో కళ్ళుతుడుచుకొని చూచాడు. మణి స్తంభాలతో ప్రకాశిస్తూ, బంగారు ద్వారాలూ, తలుపులూ, తోరణాలతో అలంకరించబడి ఇంద్రనీలాలూ, వజ్రమణులతో రచించబడ్డ అరుగుతో ఆ పూజాప్రదేశమంతా ఒక శివాలయంగా మారిపోయింది. బంగారు కలశాలతో స్థాపించబడి ప్రకాశిస్తున్న స్ఫటిక మణులతో నిర్మితమైన మిద్దెలతో మనోహరమైనదీ, శ్రేష్ఠమైనదీ అయిన పీఠంపై రత్నాలతో కూర్చబడిన శివలింగాన్నీ శివాలయాన్నీ ఆ పిల్లవాడు చూచాడు. అతడు తటాలున లేచి భయమూ విస్మయమూ పొందిన మనస్సుతో సంతోషాన్ని పట్టలేక ఆనంద సముద్రంలో మునిగితేలాడు. కొంతసేపటికి ఆ పిల్లవాడు అనంతా శివపూజామహిమగా తెలుసుకొని తన తల్లిచేసిన అపరాధశాంతి కోసం శివుడిముందు సాష్టాంగ నమస్కారం చేసి "ఓ శంకరా! నిన్ను తెలుసుకోలేక మూఢురాలైన మా తల్లి చేసిన తప్పులను మన్నించి ప్రసన్నుడవు కమ్ము. నీపట్ల భక్తితో చేసిన పుణ్యం కొంచెమున్నా దానితో మా తల్లిని అనుగ్రహించు" అని ప్రార్థించాడు.

సూర్యాస్తమయం అయిన తరవాత అతడింటికి బయలు దేరాడు. గొప్ప ఐశ్వర్యంతో దేవేంద్రనగరంతో సమానంగా బంగారు మలామాచేసినట్లున్న తన యింటిని చూచాడు. గొప్ప రత్నాలతో, బంగాగు రాసులతో నిండిఉన్న లోపలి ఇంటిభాగాన్ని చూచి అపరిమితానందాన్ని పొందాడు. రత్నస్తంభాలతో కూర్చ బడిన హంసతూలికాతల్పంమీద రత్నాలంకారాలతో దివ్యాభరాలతో దివ్యలక్షణ సంపన్నంగా ప్రకాశిస్తూ నిశ్చింతగా నిద్రిస్తున్న

తనతల్లిని చూచాడు. సంతోషంవల్ల వికసించిన నేత్రాలతో "అమ్మా! మేలుకో. నీకు మంగళం. ఈ గొప్ప ఆశ్చర్యాన్ని చూడు" అని లేపాడు. ఆమె నిద్రనుండి మేల్కొని ఆశ్చర్యంగా అదంతా చూచింది. తననూ, తనకొడుకునూ, ఇంటినీ చూచి అంతా కొత్తగా ఉండటంవల్ల ఆశ్చర్యపడింది. కొడుకు చెప్పగా ఆ విషయాలన్నీ తెలుసుకొన్నది. వెంటనే రాజు కాసంగతంతా విన్నవించుకొన్నది.

అప్పుడు చంద్రసేన మహారాజు రాత్రి పూజ అయినతరవాత స్వయంగా వచ్చి గోపి కాకుమారుడి ప్రభావాన్నీ శివానుగ్రహాన్నీ కళ్ళారా చూచాడు. బంగారు వికారంగల శివపీఠాన్నీ శుభంకరమైన మణిమయమైన లింగాన్నీ, రత్నాలతో బంగారంతో ప్రకాశిస్తున్న గోపిక ఇంటినీ దర్శించాడు. మంత్రి పురోహితులతో కూడి క్షణకాలంపాటు ఆశ్చర్యపడి రాజు అపరిమితానందదాన్ని పొందాడు. ఆనందబాష్పాలు విడుస్తూ రాజు ఆ పిల్లవాడిని కౌగిలించుకొన్నాడు. సంతోషంవల్ల ఆరాత్రి ఒకక్షణంలా గడిచింది.

తెల్లవారినతరవాత అందరూ లేచి ఇదేవిషయాన్ని గూర్చి గుంపులుగుంపులుగా చేరి చెప్పుకోసాగారు. ఇతరరాజు లావిషయాన్ని అంతా గూఢచారులవల్ల విని అంతక్రితం ఉన్న వైరాన్ని విడిచిపెట్టి ఆ రాజంటే భయపడసాగారు. ఆయుధాలను వదలి చంద్రసేనుడితో సంధిచేసుకొని ఆ నగరానికివచ్చి మహాకాళేశ్వరునికి నమస్కరించారు. చంద్రసేనమహారాజు వారి కెదురేగి పూజించి విలువైన ఆసనాలపై కూర్చుండచేశాడు. వారంతా ఆశ్చర్యపడ్డారు. గొల్లపిల్లవాడిపట్ల కలిగిన అనుగ్రహంవల్ల ప్రాదుర్భవించిన శివాలయాన్నీ, గోపికాగృహాన్నీ వారు దర్శించారు. ఆ గోపకుమారుణ్ణీ, శివలింగాన్నీ చూచి ఆ రాజులంతా శివుడిపట్ల అపరిమిత భక్తిశ్రద్ధలు కవాల

రయారు. తరవాత ఆ గొల్లపిల్లవాడికి వారంతా వస్త్రాలూ, బంగారం, రత్నాలూ, పశువులూ, ధనం, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, బంగారపు ఛత్రాలూ, పల్లకీలు, దాసదాసీజనం, పెక్కు గ్రామాలు కానుకలుగా ఇచ్చి ఆతడిని గొల్లలకందరికీ రాజుగా చేశారు. ఆ సమయంలో సర్వదేవతాపూజనీయుడూ, తేజోవంతుడూ, వానరశ్రేష్ఠుడూ అయిన హనుమంతుడు హఠాత్తుగా ప్రత్యక్షమయాడు. ఆ రాజులందరూ ఆతడికి ఎదురుగా వెళ్ళి భక్తిశ్రద్ధలతో నమస్కరించారు. వారిమధ్య కూర్చుండి పూజింపబడిన హనుమంతుడు గొల్లపిల్లవాడిని కౌగిలించుకొని "ఓ రాజశ్రేష్ఠులారా! జనులారా! మీ కందరకూ శుభమగుగాక! శరీరధారులకు శివపూజను విడిచి మరోతరుణోపాయం లేదు. ఈ గొల్లపిల్లవాడు శనివారం సాయంకాలం మంత్రరహితంగా శివుని పూజించి ఎంతటి మహాభాగ్యాలు పొందాడో చూడండి. సర్వప్రాణులకూ శనివారం సాయంత్రం అదీ కృష్ణపక్షంలో శనివారం ప్రదోషంలో శివపూజ ఎంతో పుణ్యాత్ములకుగాని లభించదు. పుణ్యాత్ముడైన ఈ గొల్లపిల్లవాడివల్ల గొల్లవారంతా మహాకీర్తిమంతు లయారు. ఈతడి వంశంలో పుట్టినవారంతా గొప్ప అదృష్టవంతులవుతారు. ఈతడి వంశంలో మహాకీర్తివంతుడైన నందుడనే పేరుతో ఎనిమిదవపురుషుడుగా జన్మిస్తాడు. సాక్షాత్తు నారాయణమూర్తియే కృష్ణుడుగా నందుడికి కలుగుతాడు. ఆ మహద్భాగ్యం నందుడికి ఏర్పడుతుంది. ఇదిమొదలు ఈ గొల్లపిల్లవాడే లోకంలో శ్రీకరుడనే పేరుతో గొప్ప కీర్తిమంతు డవుతాడు" అని చెప్పాడు.

సూతుడిట్లుచెపుతున్నాడు! అంజనాదేవి కొడుకైన హనుమంతుడు పిల్లవాడికోసం మంగళప్రదమైన శివాచారాన్ని ఉపదేశించి అక్కడే అంతర్ధానమయ్యాడు. ఆ రాజులందరూ ఆనందంతో చంద్ర

సేన మహారాజుతో పూజింపబడ్డవారై సెలవుతీసుకొని తిరిగి తమ తమ రాజ్యాలకు వెళ్ళిపోయారు. మహానుభావుడైన హనుమంతుడితో ఉపదేశించబడిన శ్రీకరుడనే గొల్లరాజు ధర్మజ్ఞులైన బ్రాహ్మణులతోకూడి శంకరుణ్ని యథావిధిగా పూజించాడు. కొంతకాలం తరవాత శ్రీకరుడనే ఆ గొల్లరాజూ, చంద్రసేన మహారాజూ అపార భక్తితో శివునర్చించి చివరకు శివసాయుజ్యం పొందారు.

మహాపవిత్రమైనదీ అతిరహస్యమైనదీ కీర్తికరమైనదీ మంగళకరమైనదీ విచిత్రమైనదీ సకలపాపహరమైనదీ ఈశ్వరపాదారవింద భక్తిని పెంపొందించే ఈ కథావృత్తాంతం నాచే మీకు చెప్పబడింది. మీరందరూ శంకరు నారాధించి ఆ దేవదేవుని అనుగ్రహం పొందండి.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో అయిదవ అధ్యాయం.

— / —

# షష్ఠాధ్యాయం

"ఓ సూతమునీంద్రా! సకల దుఃఖహరమైన చాలా ఉత్తమమైన శంకరుని మాహాత్మ్యాన్ని ప్రకటించేకథ నీవు చెప్పావు. దానినే సావధానంగా మళ్ళీ వినడానికి కోరుతున్నాం. ప్రదోష సమయంలో పూజింపబడిన శివుడు ఏ సిద్ధినిస్తాడో మాకు చెప్పు. ఒకసారి విన్నప్పటికీ మళ్ళీ వినాలనే తృష్ణ అధికమవుతోంది" అని ఋషులు అడిగారు.

అప్పుడు సూతుడు చెప్పడం మొదలుపెట్టాడు "మహాబుద్ధిమంతులైన లోకప్రసిద్ధులైన మీరు అడిగారుకాబట్టి శంకరపూజా

విధానం గూర్చి మీకు చెపుతాను. త్రియోదశివాటి సాయంకాలం ప్రదోషమని చెప్పబడింది. ఫలాన్ని అపేక్షించేవారు ఇతరదేవతలను విడిచి అప్పుడే శంకరుణ్ని పూజించాలి. దేవతలందరూ శివుని పూజిస్తూ సాయంకాలం కూర్చుంటారు. అలాంటి సాయంకాలపు పూజామాహాత్మ్యాన్ని ఎవరు వర్ణించగలరు ? ప్రదోషకాలంలో కైలాసంలో వెండికొండపై దేవతాసంఘమంతా ఆనందంతో దర్శిస్తుండగా శంకరుడు నాట్యమాడతాడు. కాబట్టి ఈశ్వరపూజ, జపం, హోమం, ఆయనకథలూ, గుణస్తుతి అనేవి నాలుగు పురుషార్థాలు కోరేవారందరూ తప్పక చేయాలి. 'దారిద్ర్యతిమిరాంధానా మిదం హి పరమాంజనం ఋణసాగరమగ్నానాం ప్లవోయం పారదర్శనః' దారిద్ర్యమనే గాఢాంధకారంలో కొట్టుమిట్టాడేవారికిది పరమాంజనం (మంచికాటుక) లాంటిది. ఋణసముద్రంలో మునిగినవారికి దరిచేర్చే ఒక తెప్పలాంటిది. దుఃఖశోకభయంవల్ల పీడింపబడేవారి కష్టాలను తొలగించడానికి కారణమైంది. సాయంకాలమందు ఈశ్వరపూజ మంగళకరమైంది. దుష్టబుద్ధి అయినా నీచుడైనా నిర్భాగ్యుడైనా ప్రదోషకాలాన శివుని పూజించి ఆపదలనుండి విముక్తుడవుతున్నాడు. శత్రువులచే కొట్టబడినవాడైనా, పాములచే కరవబడినవాడైనా బాణాలచే ఆక్రమింపబడ్డవాడైనా, మహాసముద్రంలో పడినవాడైనా, యమదండంతో కొట్టబడ్డవాడైనా, అనేక రోగాలచే పీడింపబడ్డవాడైనా, ప్రదోషకాల శంకరపూజవల్ల ఎప్పటికీ నశించడు. మానవుడు శివుని పూజించడంవల్ల దారిద్ర్యాన్నీ, మరణాన్నీ, దుఃఖాన్నీ, కొండలాంటి ఋణభారాన్నీ వెంటనే పోగొట్టుకొని భాగ్యవంతుడవుతాడు. ఆ విషయంగూర్చి ప్రాచీనమైన మహాపుణ్యప్రదమైన ఒకకథ చెపుతున్నాను. ఈ కథనువిని మానవులు వెంటనే కృతార్థులవుతారు.

విదర్భదేశంలో సర్వధర్మాలలో ఆసక్తి గలవాడూ, ధైర్యవంతుడూ, సద్వృత్తి కలవాడూ, సత్యమైన యుద్ధం కలవాడూ అయిన సత్యరథుడనే మహారాజొకడుండేవాడు. ఆతడు ధర్మబద్ధంగా మునిపుంగవునివలె రాజ్యపాలన చేస్తూ సుఖంగా కాలం గడిపేవాడు. తరవాత ఆ రాజుకు దుర్మర్షణుడూ మొదలైన సాళ్వదేశపురాజులు పెద్దసేనలతో కూడి విరోధులయ్యారు. ఒకానొక సమయంలో పెద్ద సైన్యబలంతో సాళ్వదేశపురాజులు యుద్ధసన్నద్ధులై జయాకాంక్షతో విదర్భనగరాన్ని ముట్టడించారు. అదిచూచి విదర్భరాజు పెద్దసేనతో ఎదుర్కొన్నాడు. అధికబలంతో గర్వోన్మత్తులైన ఆ సాల్వరాజులతో విదర్భరాజునకు పెద్దయుద్ధం జరిగింది. పాతాళంలో మదపుటేనుగులతో పన్నగేంద్రునికి జరిగిన యుద్ధాన్ని తలపించింది అది. విదర్భరాజు మహాభయంకరంగా యుద్ధంచేసి చివరకు సాళ్వరాజుల చేతిలో మరణించాడు. మహారథికుడూ వీరుడూ అయిన రాజు మంత్రిసమేతంగా మరణించడంతో చావగా మిగిలిన సేనలు పారిపోయాయి. యుద్ధంఅయిన తరవాత సాల్వదేశపురాజులు విదర్భపట్టణాన్ని ప్రవేశించారు.

ఆ కోలాహలంలో సత్యరథుని సతీమణి దుఃఖాక్రాంతురాలై అంతఃపురం నుండి బయలుదేరింది. అర్ధరాత్రి సమయంలో గర్భవతి అయిన ఆ రాజకులాంగన మహాదుఃఖంతో అతికష్టంమీద పడమటి దిక్కుగా పయనించింది. తెల్లవారేసరికి మార్గాన మెల్లగా నడుస్తున్న ఆ సతీమణికి చాలాదూరాన స్వచ్ఛమైన ఒక సరస్సు కనిపించింది. చాలా దుఃఖంతో పరితపిస్తూ ఆమె ఆ నిర్జన ప్రదేశాన్ని చేరి ఒక చెట్టు నీడను ఆశ్రయించింది. అక్కడే ఒక మంచి ముహూర్తాన ఆమె కుమారుణ్ణి ప్రసవించింది. చాలా దాహంతో పీడింపబడినదై ఆమె మెల్లగా సరోవరాన్ని ప్రవేశించి ఒక మొసలిచే మింగివేయబడింది.

పుట్టిన వెంటనే తల్లిదండ్రులను కోల్పోయిన ఆ పిల్లడు సరస్సు ఒడ్డున దాహమూ ఆకలిచేత దిక్కులేక గట్టిగా ఏడ్వసాగాడు. అంతలో దైవయోగంవల్ల ఒక బ్రాహ్మణస్త్రీ అక్కడికి వచ్చింది. భర్త విహీనఅయిన ఆమె ఏదిక్కూలేక వత్సరప్రాయుడైన తన కొడుకును చంకనెత్తుకొని ఇంటింటికీతిర్గి యాచిస్తూ కాలం గడిపేది. ఉమ అనే పేరుగల ఆమె ఏడుస్తున్న ఆ బాలుణ్ని చూచింది. రెండో సూర్యుడిలా ప్రకాశిస్తున్న ఆ రాజకుమారుణ్నిగూర్చి చాలా విచారించింది. "ఎంత ఆశ్చర్యం! అయ్యయ్యో! ఈ పిల్లడికి బొడ్డయినా కోయలేదే! తల్లి ఎక్కడికి వెళ్ళిందో! తల్లిదండ్రులుగానీ బంధుజనంగానీ లేక రక్షించేదిక్కులేక ఈ పిల్లడు నేలమీదపడుకున్నాడే! వీడు చండాలజాతివాడా? లేక శూద్రపిల్లవాడా లేక బ్రాహ్మణ కుమారుడా లేక మహారాజ పుత్రుడా? ఎవరో తెలియజెప్పడానికి ఎవరూలేరే! ఈతడిని ఎత్తుకొని నా కన్నకొడుకులా పోషిస్తాను. కాని ఈ పిల్లడు ఉత్తమ వంశంలో పుట్టాడో లేదో! తెలియకుండా ముట్టుకోడానికి సందేహంగాఉంది" అని ఆ విప్రవనిత అనుమానపడుతుండగా సాక్షాత్తు శంకరుడిలా ఒక యతీశ్వరుడు అక్కడకు వచ్చాడు. "ఓ బ్రాహ్మణ చిన్నదానా! విచారించకు. మనస్సులో సందేహించక ఈ పిల్లడిని రక్షించు. త్వరలోనే వీడివల్ల పరమశ్రేయస్సును పొందుతావు" అనిచెప్పి వెళ్ళిపోయాడు.

తరవాత నిస్సంశయంగా ఆ పిల్లడిని ఎత్తుకొని ఆమె తన ఇంటికి వెళ్ళింది. భిక్షువు మాటలలో నమ్మకముంచి తన కుమారుడితో సమానంగా ఆ పిల్లడినికూడా పోషించింది. ఏకచక్రమనే పేరుగల ఆ అందమైన గ్రామంలో ఒక చిన్న గుడిసెలో ఆమె తన కొడుకునూ, రాజకుమారుణ్నీ పెంచసాగింది. బ్రాహ్మణులచే చేయబడ్డ జాతకర్మాది సంస్కారాలవల్ల ఆ పిల్లలు ఇద్దరూ చక్కగా పూజింప

బడినవారై వృద్ధిపొందారు. తగిన వయసులో ఉపనీతులైన ఆ బాలురు నియమంగా తల్లితోపాటు ఇంటింటికిపోయి బిచ్చమెత్తుకొనేవారు. ఆ విప్రాంగన అలాబిచ్చమెత్తుకుంటూ ఒకసారి దైవవశాత్తు పిల్లలతోబాటు ఒక దేవాలయాన్ని ప్రవేశించింది. వృద్ధులైన మునులతో నిండిన ఆ ఆలయంలో పిల్లలనుచూచి శాండిల్యముని "దైవబలమెంతవిచిత్రం! కర్మనతిక్రమించ శక్యంకాదు. ఈ పిల్లవాడు మరో తల్లితో బిచ్చమెత్తుకొని బ్రతుకుతున్నాడు. బ్రాహ్మణ కుమారుడితోపాటు విప్రధర్మాన్ని ఆశ్రయించి ఈ బ్రాహ్మణవనితనే ఉత్తమమైన తల్లిగా పొందాడు" అని అన్నాడు.

ఆ మాటలువిన్న బ్రాహ్మణస్త్రీ సభామధ్యలోఉన్న ఆ మునికి నమస్కరించి ఆశ్చర్యంతో "ఓ మహాత్మా! ఈ చిన్నవాడు భిక్షుకుని మాటలవల్ల ఇంటికి తీసుకురాబడినవాడు. ఇప్పటికీ కులగోత్రాలు తెలియనివాడు. నా సొంతకొడుకులా పోషింపబడుతున్నాడు. ఈత డేవంశాన జన్మించాడో తల్లిదండ్రు లెవరో నీవల్ల తెలుసుకోదలచాను." అని అడిగింది. అప్పుడు శాండిల్యముని దివ్యదృష్టితో చూచి ఆ పిల్లడు విదర్భాధిపతి కొడుకనీ, అతడి తండ్రి యుద్ధంలో మరణించాడనీ, తల్లిని మొసలి మింగిందనీ చెప్పాడు. అదివిని ఆమె 'ఓ మహామునీ! ఆ రాజు సకలభోగాలను కోల్పోయి ఎందుకు అల్పాయుష్కుడయాడు? ఈ పిల్లడికి దారిద్ర్యమెట్లు వచ్చింది? మళ్ళీ ఎప్పుడు రాజ్యాన్ని పొందుతాడు? ఈ పిల్లడికీ నా కుమారుడికీ దారిద్ర్యంపోయే ఉపాయమేదైనా ఉపదేశించడానికి నీవే తగుతావు." అని అన్నది.

అప్పుడు శాండిల్యుడు "ఈ పిల్లవాడి తండ్రిఅయిన విదర్భ మహారాజు పూర్వజన్మలో పాండ్యదేశాధిపతి. సమస్త ధర్మాలనూ తెలిసిన ఆ మహారాజు సమస్త భూమండలాన్ని పాలిసూ ఒకానొక

ప్రదోషకాలంలో శంకరుణ్ని పూజించాడు. ఆ సమయంలో పట్టణాన ఒక భయంకరమైన పెద్దధ్వని బయలుదేరింది. ఆ ధ్వనివిన్న రాజు శివపూజను విడిచి రాజగృహంనుండి అది పట్టణక్షోభగా సందేహించి బయటకు వచ్చాడు. ఆ సమయంలోనే మహాబలవంతుడైన మంత్రి వర్యుడు ఒక సామంతరాజును పట్టితెచ్చి ముందుంచాడు. మహారాజు కోపంతో ఆ శత్రురాజు శిరచ్ఛేదం చేయించాడు. శివపూజను విడిచి నియమం పూర్తి కాకుండానే రాజు రాత్రి భోజనం చేశాడు. అతని కుమారుడును అలాగే ప్రదోషకాలంలో శివుని పూజించకుండా మూఢుడై దుష్టబుద్ధి కలవాడై భుజించి సుఖంగా నిద్రించాడు. ఆ రాజు రెండో జన్మలో విదర్భాధిపతి అయాడు. శివపూజా విఘ్నం వల్ల చాలా సుఖపడుతున్న సమయంలో శత్రువులచే కొట్టబడ్డాడు. పూర్వజన్మలో అతడికి కొడుకైన ఈ పిల్లవాడీజన్మలో కూడా అతడికి కొడుకై శివపూజను మానినకారణంవల్ల దారిద్ర్యాన్ని పొందాడు. ఈతడి తల్లి పూర్వజన్మలో సవతిని మాయోపాయంతో చంపింది. ఆ పాపంవల్ల ఈ జన్మలో మొసలిచే మ్రింగబడింది. ఇది వీరి ప్రవర్తన. శివపూజ చేయని మానవులు దారిద్ర్యాన్ని పొందుతారు. సత్యమైనదీ, సమస్త మానవులకు హితమైనదీ, ఉపనిషత్తులలోని రహస్యాన్నీ చెపుతున్నాను. నిస్సారమైన సంసారాన్ని పొందిన ప్రతి జంతువునకూ శంకరపాదారవిందసేవయే తరణోపాయం. పూజ్యమైన ప్రదోషకాలంలో ఎవరు ఈశ్వరుని పూజించరో, పూజించబడ్డ శివుడికి ఎవరు నమస్కరించరో, తమ చెవులతో శివ కథను చక్కగా ఎవరు వినరో వారు జన్మజన్మలలో మూఢులై దరిద్రులవుతారు. ఏ మానవులు ప్రదోషకాలంలో నిశ్చలమైన చిత్తంతో ఈశ్వర పాదపూజను చేస్తారో వారు ఈలోకంలోనే దిన దిన ప్రవర్ధమానమైన ధనధాన్య పుత్రమిత్రకళత్రాది సంపత్తులతో

సమస్త సుఖాలనూ పొందుతాగు. కైలాసపర్వతశిఖరంమీద బంగారంతో ఒప్పుతున్న రత్నమయపీఠంమీద త్రిజగన్మాత అయిన పార్వతిని కూర్చుండబెట్టి నాట్యం చేయడానికి ఈశ్వరుడు కోరుతుండగా ఆ ప్రదోషకాలంలో సమస్త దేవతలూ ఆయనను సేవిస్తారు. సరస్వతి కచ్ఛపి అనే వీణను ధరించి, ఇంద్రుడుకూడా వీణనుధరించి, బ్రహ్మ రెండుచేతులతో తాళం వేస్తుండగా, లక్ష్మీదేవి శివగీతాన్ని పాడుతుండగా, విష్ణువు మృదంగం వాయిస్తుండగా దేవతలందరూ ప్రదోషకాలంలో శంకరుణ్ని సేవిస్తూంటారు. గంధర్వులు, యక్షులు, పతగులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, అమరశ్రేష్ఠులు, అప్సరస్సంఘాలు ఇతరమైన భూతపిశాచాదిగణాలతో కూడి ముల్లోకవాసులంతా ప్రదోషకాలంలో శివుని సేవానిమిత్తం కలుస్తారు.

'అతః ప్రదోషే శివ ఏకఏవపూజ్యో థనాన్యే హరిపద్మజాద్యాః తస్మిన్మహేశే విధినేజ్యమానే సర్వే ప్రసీదంతి సురాధినాథాః' అందువల్ల ప్రదోషకాలంలో ఒక్కశివుడే పూజింపదగినవాడు. బ్రహ్మ విష్ణువు మొదలైన ఇతర దేవతలను పూజించనక్కరలేదు. ఈశ్వరుని యథావిధిగా పూజిస్తే సమస్త దేవతలు నారాధింపబడినట్లే ప్రసన్నులవుతున్నారు. ఈ నీ కొడుకు పూర్వజన్మలో ఉత్తముడైన బ్రాహ్మణుడిగాపుట్టి ఎప్పుడూ దానం పుచ్చుకుంటూ కాలం గడిపాడు. దానాదిహితమైన కర్మలనెప్పుడూ చేయలేదు. అందుకే నీ కొడుకు నిరంతర ప్రతిగ్రహదోషంవల్ల దరిద్రుడయాడు. అది నశించడానికి శంకరుని శరణుకోరుము! అని శాండిల్యముని చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో త్రయోదశీ పూజావర్ణనలో శివపూజను మానివేసినందువల్ల కలిగిన దోషాన్ని చెప్పిన ఆఱవ అధ్యాయం.

# సప్తమోధ్యాయం

అప్పుడు ఆ విప్రవనిత శాండిల్యమునికి నమస్కరించి "సర్వ ధర్మాలనూ తెలిసిన ఋషీశ్వరా ! త్రయోదశీ ప్రదోషకాలమందు చేయదగిన శివపూజా విధానాన్ని గూర్చి నాపట్ల దయఉంచి చెప్ప వలసింది." అని అడిగింది. దాని కామునివర్యుడు "ఓ విప్రవనితా ! ఈశ్వరపూజా విధానాన్ని గూర్చి క్రమంగా చెపుతున్నాను. విను. శుక్ల కృష్ణపక్షాల త్రయోదశులలో పగటిపూట ఉపవాసండుండాలి. సూర్యాస్తమయానికి మూడు ఘడియల ముందుగా స్నానంచేసి తెల్లటి వస్త్రాలు కట్టుకొని మౌనవ్రతాన్ని పూనాలి. స్నానానం తరం సంధ్యాజపాదులనుచేసి దేవుడి ఎదట సావకాశంగా కూర్చుండి ఉదకంతో శివపూజను ఆరంభించాలి. విద్వాంసుడు సుందరమైన మంటపాన్ని ఏర్పరచి తెల్లటివస్త్రాలచే మంటపమధ్యభాగాన్ని అలం కరించి ఫలపుష్పాలతో చిగుళ్ళతో అలంకరించి పంచరంగులతో కూడిన పద్మాలను లిఖించి ఆ మంటపాన శంకరుని ప్రవేశపెట్టి కావ లసిన పూజాసంభారాలను దగ్గరఉంచుకొని పరిశుద్ధుడై శాస్త్రోక్తంగా పీఠాన్ని అభిమంత్రించాలి. తరవాత ఆత్మశుద్ధిని చేసుకొని భూత శుద్ధినిచేసి బిందువులతోకూడిన బీజాక్షరాలతో ప్రాణాయామాన్ని చేయాలి. యథాశాస్త్రంగా మాతృదేశంనుంచి సరస్వతీదేవిని ధ్యానించి మాతృకాన్యాసానంతరం శివుని ధ్యానించాలి. ఎడమ భాగంలో గురువును నమస్కరించి, కుడిభాగంలో గణపతిని పూజిం చాలి. భుజమూపురమూ తొడల ద్వంద్వమందు ధర్మదేవత మొద లైనవారినుంచి ప్రక్కలయందు పాదాలయందు అధర్మం మొదలైన వానిని, అనంతుడు మొదలగువారినీ మూలప్రకృతి మొదలుకొని పరమాత్మవరకూగల దేవతలను హృదయమందూ, పీఠానికి తగి

నట్లుగా ఉంచాలి. బాగా భావనచేసిన హృత్పద్మంలో నవశక్తి రూపమైన పార్వతీపతినినిల్పి ఈ విధంగా ధ్యానించాలి-

'చంద్రకోటి ప్రతీకాశం । త్రినేత్రం చంద్రభూషణం
ఆపింగళ జటాజూటం । రత్నమౌళి విరాజితం
నీలగ్రీవముదారాంగం । తారాహారోపశోభితం
వరదాభయహస్తంచ । హరిణంచ పరశ్వధం
దధానం నాగవలయం । కేయూరాంగద ముద్రికం
వ్యాఘ్రచర్మపరీధానం । రత్నసింహాసనస్థితిం'

కోటిచంద్రుల కాంతికలిగినట్టి, చంద్రుని శిరస్సునదాల్చినట్టి అంతటా పచ్చనైన జటాజూటం కలిగినట్టి రత్నమయమైన కిరీటంతో ప్రకాశించునట్టి నల్లని కంఠం కలిగినట్టి గొప్ప శరీరం కలిగినట్టి స్వచ్ఛమైన ముత్యాలహారంచే ప్రకాశించునట్టి వరదహస్తాన్ని లేడినీ గొడ్డలిని ధరించినట్టి నాగాభరణం కలిగినట్టి కేయూరాంగదముద్రలు కలిగినట్టి పులిచర్మాన్ని ధరించినట్టి రత్నసింహాసనమందున్న శివుని ధ్యానించాలి.

తరవాత శంకరుని ఎడమభాగంలో మంకెన పువ్వుతో సమానమైన కాంతికలదీ, ఉదయించే సూర్యకాంతితో సమానమైన కాంతి కలదీఅయిన పార్వతిని క్రిందివిధంగా ధ్యానించాలి.

'విద్యుత్పుంజనిభాం తన్వీం మనోనయననందినీం
బాలేందుశేఖరాం స్నిగ్ధాం నీలకుంతలకుండలాం
భృంగసంఘాతరుచిర నీలాలక విరాజితాం
విలసన్మణి విద్యోతముఖమండల విభ్రమాం
నవకుంకుమ పంకాంక కపోల తలదర్పణాం
మధురస్మిత విభ్రాజవరుణాధరపల్లవాం

కంబుకంఠీం శివా ముద్యోత్కుచ పంకజకుట్మలాం
పాశాంకుశాభయవరై ర్విలసంతీం చతుర్భుజాం
అనేకరత్న విలసత్కంకణాంగద ముద్రికాం
త్రివలీవలయాం హృద్యాం హేమకాంచీగుణాన్వితాం
దివ్యమాల్యాంబరధరాం దివ్యచందనచర్చితాం
దిక్పాలవనితా మౌళిసన్నతాంఘ్రి సరోరుహాం
రత్నసింహాసనారూఢాం సర్వరాజపరిచ్ఛదాం
ఏవం ధ్యాత్వా మహాదేవం దేవీంచ గిరికన్యకాం ॥

మెరుపుసంఘంతో సమానమైన కాంతికలదీ, కృశించిన శరీరం కలదీ, మనోనేత్రాల నానందింపజేయునదీ, లేతచంద్రుణ్ణి శిరస్సున దాల్చినదీ, తుమ్మెదలగుంపులా సుందరమైన ముంగురులచే ప్రకాశించునదీ, అధికకాంతిగల మణులచే భాసిల్లుచున్న ముఖవికాసం కలదీ, మనోహరమైన చిరునవ్వుచే ఒప్పుచున్న ఎర్రటి అధరోష్ఠం కలదీ, శంఖంలాంటి కంఠంకలదీ, తామరమొగ్గలలాంటి కుచాలు కలదీ, పాశంచేత, అంకుశంచేత అభయంఇచ్చి వరాలిచ్చేటటువంటిదీ, నాల్గుభుజాలుకలదీ, అనేక రత్నాలచే ప్రకాశిస్తూన్న బంగారపువడ్డాణాన్ని ధరించిందీ, దివ్యవస్త్రాలను ధరించి దేవతా చందనాన్ని ధరించిందీ, దేవతాస్త్రీల శిరోమణులచే భాసిల్లే పాదపద్మాలుకలదీ, రత్నసింహాసనాన్ని అధిష్ఠించి సర్వశ్రేష్ఠాన్ని నడికట్టుగా చేసికొన్నదీ అయిన ఈశ్వరుని వామభాగమందున్న పార్వతినీ శంకరునీ ధ్యానించాలి.

ఆ పీఠమందు ఉంచిన క్రమంలో గంధపుష్పాక్షతలతో శంకరుణ్ణి పూజించి ఈ చెప్పబడ్డ స్థానాలలోగానీ, హృదయంలోగానీ అయిదు గురు బ్రహ్మలతోగూడ పూజనుచేయాలి. హృదయంలో శంకరుణ్ని

నిలిపి మూలమంత్రంతో వేరువేరుగా పుష్పాంజలిని ఇవ్వాలి. తరవాత బాహ్యాసీఠంమీద ఆ దేవుణ్ని స్థాపించి తన సంకల్పాన్ని పఠిస్తూ పూజను ప్రారంభించి యథావిధిగా పూజించాలి. రెండు చేతులనూ జోడించి మనస్సులో శంకరుణ్ని ధ్యానిస్తూ త్రయోదశి రోజున పగటిపూట ఉపవాసం చేయాలి. "ఓ శంకరా! నేనీ రోజున ఉపవాసం. రాత్రి భోజనం చేస్తాను. నాపట్ల దయఉంచి నన్ను అనుగ్రహించు." అని సంకల్పించి నియమంతో ఈశ్వరుణ్ని ప్రార్థించాలి. "ఋణత్రయాన్నీ, మహాపాతకాలనూ దారిద్ర్యం పోవడానికి సమస్త దుఃఖనాశంకోసమూ ఓ శంకరా! నన్ననుగ్రహించు. ఓ వృషవాహనా! దుఃఖశోకాగ్ని చే దహించే సంసారభయపీడితుడనై అనేక రోగాలచే బాధపడుతున్న దీనుడను. నన్ను రక్షించు. దేవతా సార్వభౌముడవైనట్టి అభయప్రదాతవైన ఓ శంకరా! రమ్ము. నాచే చేయబడిన పూజను పార్వతీ సమేతుడవై స్వీకరించు" అని ప్రార్థించి శాస్త్రోక్తంగా బాహ్యపూజను ఆరంభించాలి. కుడిఎడమ భాగాలలో గురువునూ, గణపతినీఉంచి పూజించాలి. ఈశ్వరుని స్థాపించిన పీఠానికి ఈశాన్యభాగంలో క్షేత్రపాలకుణ్నీ, ఆగ్నేయాన పార్వతిని స్థాపించాలి. ధర్మం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం అనే నాలుగింటినీ వరుసగా ఈశాన్యం, ఆగ్నేయం, నైఋతం, వాయవ్యంలోనూ, కోణదిక్కులలో నమశ్శబ్దాన్ని చివరనూ, అచ్చును మొదటనూ ఉంచి (అం ధర్మాయనమః) అలాగే విసర్గలతోకూడిన అచ్చులచే (అః అధర్మాయనమః) అధర్మము మొదలగువాటిని స్థాపించాలి. ఈశ్వర స్వరూపాలైన సత్వరజస్తమోగుణాలను వరుసగా దక్షిణం, పడమర, ఉత్తర దిక్కులలో స్థాపించాలి. తూర్పున శివలింగం ఉంటుంది కాబట్టి మధ్యలో అనంతుణ్ని తారకమంత్రంచే స్థాపించి

పూజించాలి. దీనితో పీఠంలో మొదటివరుసలోని ఎనిమిది కోణాలు పూర్తి అవుతాయి.

పీఠంలోని రెండవ కోణదిక్కులలో మాయనూ, విద్యనూ, లక్ష్మినీ, శివుణ్ణీ స్థాపించి పూజించాలి. దిక్కులలో వామను, జ్యేష్ఠనూ, గౌరినీ, భర్గుడినీ ఉంచాలి. వీరిలో వామనుణ్ని అ, ఇ, ఉ, ఋ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ అనే తొమ్మిది అచ్చులచేత స్థాపించాలి. ఈ కోణదిక్కులమధ్య నక్షత్రనామకాక్షరాలచే స్థూలసూక్ష్మకారణ శరీరాలను పూజించాలి. దిక్కులలో మధ్యన పీఠమంత్రం చేతనూ, పంచాక్షరీబీజాలచేతనూ దిక్కులలో చెప్పబడ్డవారినే పూజించాలి.

మొత్తంమీద శివునికిచుట్టూ శివుని పంచమూర్తులున్నూ (పంచాయతనములు), పార్వతీ శక్తులున్నూ, అనంతుడు, మాతృకలు, నిధులు, వృషభుడు, ఇంద్రాది అష్టదిక్పాలురున్నూ, శివుని ఆయుధాలైన శూలాదులునూ, చండీశ్వరుడు, క్షేత్రపాలకుడు, దుర్గ, కుమారస్వామి, నందికేశ్వరుడు, గణేశ్వరుడు, అణిమమహిమ గరిమ లఘిమ ఈశత్వ వశిత్వప్రాప్తి ప్రాకామ్యాలనే అష్టైశ్వర్యాలున్నూ, పంచబ్రహ్మలు, అంగదేవతలతో ఉపాంగదేవతలతో కూడుకొనిఉన్న పూర్వం చెప్పబడ్డ ఇంద్రాది దేవతలున్నూ స్థాపించబడాలి. ఈ స్థాపించవలసినవారిలో కొందరికి ఇంతకుముందు స్థానాలు చెప్పబడ్డాయి. ఆయా స్థానాలలో ఆయా దేవతల్ని స్థాపించాలి. మిగిలిన వారిని పీఠంలో ఎక్కడ స్థాపించినా స్థాపించవచ్చు. ఈ విధంగా ఆవరణదేవతలతో కూడుకొన్న పార్వతీ సమేతుడైన శివునికి ఈ క్రింది విధంగా ఉపచారాలు చేయాలి.

ఆవరణదేవతల స్థాపించి తర్వాత మంత్రాలచే పవిత్రం చేయబడ్డ శంఖోదకంచేతా, పంచామృతాలచేతా శివునికి అభిషేకం చేయాలి. ఆ విధంగా చేసేటప్పుడు రుద్రానువాకాల (నమకం)ను

చెప్పాలి. తరవాత మంత్రాలచే పవిత్రం చేయబడినదీ బంగారంచే చేయబడినదీ అయిన సింహాసనాన్ని సమర్పించి భక్తితో నమస్కారాలు చేస్తున్నవాడై శుద్ధోదకంచేత అర్ఘ్యాన్నీ, పాద్యాన్నీ, ఆచమనాన్నీ, మధుపర్కాన్నీ సమర్పించాలి. తిరిగి ఆచమనాన్ని చేసి మంత్రాలచేత మళ్ళీ స్నానంచేయించి యజ్ఞోపవీతాన్నీ, వస్త్రాలనూ, అలంకారాలనూ గంధాన్నీ సమర్పించి పూజించాలి. తరవాత మారేడు దళాలతో పద్మాలు-కలువలు-కర్ణికారం-మల్లెలు-దర్భలు-ఉత్తరేణి-తులసి-గురివెంద-పొగడ మొదలైన పరిమళ పుష్పాలతో పూజించాలి. దండలుకట్టి వేయాలి. ఆ తరవాత పరిమళధూపాన్నీ, నిర్మలమైన దీపాన్నీ సమర్పించి నేతితో కలిపిన పరమాన్నం, అప్పాలు, ఉండ్రాళ్ళు, పంచదార, తేనె, పెరుగు, చల్లనినీరూగల భోజనపదార్థాలను నివేదించాలి. తరవాత మంత్రంచే పవిత్రం చేయబడ్డ అగ్నిహోత్రంలో మూలమంత్రాలచే హోమంచేయాలి. శాస్త్రంలో చెప్పబడ్డ విధంగానూ, గురూపదేశానుసారంగానూ పూర్వం చెప్పబడ్డట్లుగాచేసి తరవాత తాంబూలాన్నీ నీరాజనం, ఛత్రం, అద్దం మొదలైన రాజదేవచిహ్నాలను సమర్పించాలి. పూజ చేయడానికి శక్తిలేనివాడైతే శక్తిలోపంలేకుండా పూజించాలి. 'భక్త్యాదత్తేన గౌరీశః పుష్పమాత్రేణ తుష్యతి' భక్తితో సమర్పించిన పుష్పమైనా స్వీకరించి శంకరుడానందిస్తాడు. ఆ తరవాత పరివారాలైన విఘ్నేశ్వరాదులందరినీ పూజించి పెక్కురకాలుగా స్తోత్రాదులుచేసి బుధుడైనవాడు సాష్టాంగప్రణామాన్ని చేయాలి. తరవాత వృషభమూ, చండీశ్వరుడూ మొదలైనవారికి ప్రదక్షిణాలు చేసి యథోక్తంగా పూజించి శంకరుని క్రింది విధంగా ప్రార్థించాలి.

'జయదేవ జగన్నాథ । జయశాశ్వత శంకర
జయ సర్వగణాధ్యక్ష । జయ సర్వసురార్చిత

జయ సర్వగుణాతీత । జయ సర్వవరప్రద
జయ నిత్యనిరాధార । జయ విశ్వంభరావ్యయ
జయ విశ్వైకవంద్యేశ । జయ నాగేంద్రభూషణ
జయ గౌరీపతే శంభో । జయ చంద్రార్ధ శేఖర
జయ కోట్యర్కసంకాశ । జయానంత గుణాలయ
జయ రుద్రవిరూపాక్ష । జయాచింత్య నిరంజన
జయనాథ కృపాసింధో । జయ భక్తార్తిభంజన
జయ దుస్తరసంసార । సాగరోత్తారక ప్రభో ॥'

ఈ శ్లోకాలను పఠిస్తూ శంకరుని ఈ విధంగా ప్రార్థించాలి.

'ప్రసీదమే మహాదేవ । సంసారార్తస్య ఖిద్యతః
సర్వపాపక్షయంకృత్వా । రక్షమాం పరమేశ్వర !

"ఓ మహాదేవా ! నన్ను అనుగ్రహించు. సంసారసముద్రంలో మునిగి దుఃఖిస్తున్న నా పాపాన్ని నశింపజేసి నన్ను రక్షించు."

'మహాదారిద్ర్య మగ్నస్య । మహాపాపహతౌజసః
మహాశోక నివిష్టస్య । మహారోగాతురస్యచ
ఋణభారపరీతస్య । దహ్యమానస్య కర్మభిః
గ్రహైః ప్రపీడ్యమానస్య । ప్రసీద మమ శంకర ॥'

"ఓ శంకరా ! మహాదారిద్ర్యంలో మునిగి, గొప్ప పాపసము దాయించే అసమర్థుడనై, మహాశోకంలో మునిగి మహారోగాలచే బాధపడుచున్నట్టి, ఋణభారంవల్ల బాధపడుతూ పాపకర్మలచే దహింపబడుచున్నట్టి, క్రూరగ్రహాలచే పీడింపబడుతున్న నన్ను అనుగ్రహించు అంటూ దరిద్రుడైన పురుషుడు పూజాంతమందు పార్వతీపతిని ప్రార్థించాలి. ధనవంతుడైనా రాజైనాసరే ఈశ్వరుణ్ణి ప్రార్థించాలిసిందే !

'దీర్ఘమాయుస్సదారోగ్యం । కోశవృద్ధిబలోన్నతిః
మమాస్తునిత్యమానందః । ప్రసాదాత్తవ శంకర
శత్రవస్సంక్షయం యాంతు । ప్రసీదంతు మమగ్రహాః
నశ్యంతు దశ్యవో రాష్ట్రే । జనాస్సంతు నిరాపదం
దుర్భిక్షమరి సంతాపాశ్శమం యాంతుమహీతలే
సర్వధాన్య సమృద్ధిశ్చ । భూయాత్సుఖ మహర్నిశం
ఏవమారాధయేద్దేవం ప్రదోషే గిరిజాపతిం ।'

"ఓ శంకరా ! నీ అనుగ్రహంవల్ల ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి అధికబలం నిత్యానందం నాకగుగాక ! శత్రువులు నశింతురుగాక ! గ్రహాలు నన్ను అనుగ్రహించుగాక ! దొంగలు నశింతురుగాక ! రాష్ట్రంలో జనులాపత్తులు లేనివారగుదురుగాక ! భూమియందు కరువువలనగానీ, శత్రువులవలనగానీ తాపాలులేకుండుగాక ! సమస్త ధాన్యసమృద్ధి, రాత్రింబగళ్ళయందు సుఖముండుగాక" అని ప్రదోష సమయంలో శంకరుని పూజించి ప్రార్థించాలి. పూజ, ప్రార్థన పూర్తిఅయిన తరవాత బ్రాహ్మణులకు తృప్తికరమైన భోజనాలుపెట్టి, దక్షిణలిచ్చి సంతోషపెట్టాలి. సాయంకాలం చేసిన శివపూజ సమస్త పాపాలనూ హరిస్తుంది. దారిద్ర్యం లేకుండా చేస్తుంది. సర్వాభీష్టాలనూ తీరుస్తుంది. శివద్రవ్యాపహరణంవల్ల సర్వ పుణ్యాలూ నశిస్తాయి, మహాపాపాలూ, ఉపపాపాలూ కలుగుతాయి. దేవద్రవ్యం, బ్రాహ్మణధనం, దరిద్రునిధనం, అనాథద్రవ్యం హరిస్తే శ్రుతిస్మృతి పురాణాలలో ప్రాయశ్చిత్తం చెప్పబడింది కాని శివద్రవ్యాపహారులకు ఎలాంటి ప్రాయశ్చిత్తమూ లేదు. ఇన్ని మాటలెందుకు ? శివపూజ ఎన్నివందల బ్రహ్మహత్యలైనా నశింపచేస్తుంది (బ్రహ్మహత్యాశతం వాపి శివపూజా వినాశయేత్)

సర్వప్రాణులకూ రహస్యమైందీ, తరింపజేసేదీ శివపూజయే! ఈ విషయంలో ఎలాంటి సందేహం లేదు. ఈ విధంగా నీ ఇద్దరి పిల్లలతో కూడా శివపూజ చేయించు. ఒక్క సంవత్సరంలో సిద్ధిపొందుతారు." అని శాండిల్యముని ఆ అనాథస్త్రీతో చెప్పాడు.

అప్పుడామె పిల్లలతో కూడా ముని పాదాలకు నమస్కరించి రెండు చేతులూ జోడించి "నేను నీ దర్శనంవల్ల ఇప్పుడు కృతార్థురాలనయాను. పూజ్యుడవైన ఓ మునీంద్రా! ఈ పిల్లలు నిన్నే శరణు పొందారు. శుచివ్రతుడనే పేరుగల నా కుమారుడూ, ధర్మగుప్తుడనబడే ఈ రాజకుమారుడూ నేనూ నీ పాదసేవకులం. అతిభయంకరమైన దారిద్ర్యసాగరంలో పడిపోయిన మమ్మల్ని ఉద్ధరించు" అని వేడుకొని శరణుపొందింది.

దానికి సంతోషించి శాండిల్యముని ఆ బ్రాహ్మణ వనితను అమృతోపమానమైన వాక్కులతో ఓదార్చి, ఆ పిల్లలకు శివారాధన మంత్రవిద్య నుపదేశించాడు. తరవాత వారంతా మునికి నమస్కరించి సెలవుతీసుకొని ఇళ్ళకు వెళ్లారు.

అదిమొదలు ఆ పిల్లలిద్దరూ ముని ఉపదేశంవల్ల ప్రదోషకాలంలో ఈశ్వరపూజను శ్రద్ధగా చేయడం మొదలుపెట్టారు. నాలుగునెలలు గడిచాయి. ఒకరోజు బ్రాహ్మణ కుమారుడు రాజకుమారుణ్ణి విడిచి ఒంటరిగా స్నానం చేయడానికి వెళ్ళి నదీతీరాన విలాసంగా తిరిగాడు. ఆ నదీప్రవాహం ధాటికి ఎగిరిపోయి ఒడ్డునపడి ప్రకాశిస్తున్న ఒక పెద్ద నిధానకలశను ఆతడు చూచాడు. ఆనందోత్సాహాలతో భ్రాంతిపొంది దానిదగ్గరకు పోయిచూచి అది దేవతానుగ్రహంవల్ల లభ్యమైందని తలచి దానిని శిరస్సున ధరించాడు. ఇంటికి తీసుకొనిపోయి నట్టింట్లో ఉంచి తల్లినిపిలిచి "ఓ అమ్మా!

శంకరుడు మనల్ని అనుగ్రహించి కలశరూపంగా ప్రసాదించిన ఈ పెన్నిధిని చూడు” అన్నాడు.

ఆమె ఆశ్చర్యపడి రాజకుమారుణ్ని పిలిచి శివపూజ గొప్పతనాన్ని తలచుకొంటూ “ఓ పిల్లలారా! నా మాటలు వినండి. ఈ నిధానకలశను సమానంగా విభజించి నాపట్ల గౌరవభావంఉంచి మీరిద్దరూ పంచుకోండి” అని చెప్పింది. అదివిని విప్రకుమారుడు చాలా సంతోషించాడు. కాని రాజకుమారుడు శివపూజపట్ల చాలా విశ్వాసంతో “అమ్మా! నీ కొడుకు పుణ్యవశాన లభ్యమైన ఈ ధనాన్ని నేను గ్రహించడానికి ఒప్పుకోను. అతడి పుణ్యంవల్ల లభించింది అతడే అనుభవించాలి. ఎప్పటికైనా శంకరుడు నన్నుకూడా అనుగ్రహించకపోడు.” అనిచెప్పి పూర్వంలాగానే శంకరునికి పూజ చేశాడు. ఒక సంవత్సరం గడిచింది.

వసంతం వచ్చింది. ఒకరోజు వారిద్దరూ అడవిలో విహరిస్తూ చాలాదూరం వెళ్లారు. అక్కడ మనోహరంగా క్రీడిస్తున్న వందలకొద్దీ సౌందర్యవతులైన గంధర్వస్త్రీలు కనబడ్డారు. అప్పుడు బ్రాహ్మణ కుమారుడు “ఇక్కడనుండి మనం ముందుకు పోకూడదు. అక్కడ స్త్రీలు విహరిస్తున్నారు. పవిత్రాశయంకల బుద్ధిమంతులు స్త్రీల సాహిచర్యాన్ని విడిచిపెట్టాలి (‘స్త్రీ సన్నికర్షం హి బుధా స్త్యజంతి విమలాశయాః’) నవయౌవనదుర్మదంవల్ల వీరు అనేక మాయలను చేస్తారు. పురుషునిచూచి వాక్చాతుర్యంతో మోహపరుస్తారు. కాబట్టి స్త్రీ సాన్నిధ్యాన్నీ, స్త్రీలతో ప్రసంగించడాన్నీ విడిచిపెట్టు. ధర్మమార్గంలో ఆసక్తిగలవాణ్ని, విద్వాంసుణ్ని, అందులో బ్రహ్మచారిని. నేను స్త్రీల విహారస్థలాన్ని చేరడానికి ఇష్టపడను.” అనిచెప్పి వెనక్కివెళ్ళి దూరంగా నిలుచున్నాడు. కాని రాజకుమారుడు ఆనందంతో ఒంటరిగానే ఆ స్త్రీలు విహరించే ప్రదేశానికి వెళ్ళాడు.

అప్పుడు ఆ గంధర్వ స్త్రీలలో ఒక చిన్నది ఆతడి శరీరకాంతిని చూచి మోహపరవశయై "గాంభీర్యంగల సర్వావయవ సౌందర్య వంతుడైన ఈతడెవ్వరోకదా!" అని ఆలోచించింది. "ఈతడు మదపు టేనుగునడక కలవాడు, లావణ్యం కలవాడు, విలాసమైన విశాల మైన కళ్ళుకలవాడు, మందస్మిత వదనారవిందుడు, మన్మథునితో సమానమైన దేహకాంతి కలవాడు. సుకుమారమైన అవయవాలు కలవాడు అయిన ఈ చిన్నవాడెవరోకదా!" అని ఆశ్చర్యపడింది. తరవాత తన చెలికత్తెలతో "ఓ చెలికత్తెలారా! ఇక్కడకు చాలా దూరంగా సంపెంగ-అశోక-పున్నాగ వకుళ మొదలైన వృక్షాలతో కూడిన ఒక మంచివనముంది. మీరంతా అక్కడికువెళ్ళి మంచి మంచి పూలను కోసుకొనిరండి. అంతవరకూ నేనిక్కడే ఉంటాను" అని చెప్పింది. వాళ్ళంతా వెళ్ళిపోయారు.

ఆ గంధర్వస్త్రీ రాజపుత్రుని తదేకదృష్టితో చూస్తూ ఉండి పోయింది. నవయౌవనవతీ, దేహకాంతిలో తిలోత్తమను తిరస్కరిం చేదీ, తన్వంగీ అయిన ఆమెను చూచిన సంతోషంతో రాజకుమా రుడి మనస్సు చలించింది. దైవయోగంవల్ల మన్మథబాధనొందాడు. అది గమనించిన ఆమె తటాలున లేచి ఆతడికొక పల్లవాసనం ఏర్పాటు చేసింది. సర్వోపచారాలూ చేసింది. తరవాత దగ్గరగావచ్చి "ఓ కమలపత్రాక్షా! నీవెవ్వడవు? ఎక్కడనుండి ఇక్కడకు వచ్చావు? ఎవరి కుమారుడవు?" అని అడిగింది. దానికాతడు తన తల్లిదండ్రులు చనిపోయారనీ, రాజ్యం శత్రువుల వశమయిందనీ, పరరాష్ట్రాన్ని పట్టిన తాను విదర్భ రాజకుమారుడననీ తననుగూర్చి తెలియజేశాడు. మళ్ళీ "నీ వెవ్వతెవు? ఇక్కడేంపని? నీ దేదేశం? ఎవని కూతురవు? మనసులో ఏదో ధ్యానిస్తూ ఏమి చెప్పడానికి కోరుతున్నావు?" అని ప్రశ్నించాడు ఆతడు.

అప్పుడామె "ఓ రాజకుమారా! నేను గంధర్వవంశ శ్రేష్ఠుడైన ద్రమిళుడనేవాని కుమార్తెను. నా పేరు అంశుమతి. సకల సంగీతవిద్యలలో నాకన్నా గొప్పవారెవరూ లేరు. నీ రాకచూచి నీతో మాటాడేకోరికతో నా సఖీజనాన్ని విడిచిపెట్టి ఒంటరిగా ఉన్నాను. దేవతాస్త్రీలందరూ నా సంగీతాన్నివిని సంతోషిస్తారు. నేను సర్వవిద్యలలో ప్రవేశంకలదానిని. అందరి మనోభిప్రాయాలనూ తెలిసినదానిని. నాకు నీ కోరిక తెలుసు. నీ మనస్సు నాయందు లగ్నమైంది. అలాగే నా మనస్సు నీయందు లగ్నమైంది. దైవయోగం వల్ల ఈ విధంగా మనిద్దరికీ స్నేహం కలిగింది. మన స్నేహం నశించకూడదు." అనిచెప్పి ప్రేమతో తన కంఠాలంకారమైన ఒక ముత్యాల హారాన్ని ఆతడికిచ్చింది. ఆతడు దానిని స్వీకరించి ఆమెపట్లగల ప్రేమవల్ల వ్యాకుల మానసుడయాడు. కాని ధీరోదాత్తుడవడంవల్ల కల్గిన ఆనందాన్ని బయటపడనీయకుండా మనోనిగ్రహంతో" నీవు చెప్పింది నిజమే! నేను రాజ్యభ్రష్టుడను. దరిద్రుణ్ణి. నీవు నాకెలా ప్రియురాలివి కాగల్గుతావు? నీవు తల్లిదండ్రులు కలదానివి. బాలికవు, కాబట్టి నీ తల్లిదండ్రుల ఆజ్ఞనుమీరి మూఢురాలిలా ఏ విధంగా స్వేచ్ఛగా సంచరించగలవు?" అని ప్రశ్నించాడు.

ధర్మబద్ధమైన ఆ మాటలువిని ఆమె చిరునవ్వుతో "అట్లే అగుగాక. నీ ఇష్టప్రకారమే చేస్తాను. నీవు ఇంటికివెళ్లు. ఎల్లుండి ఉదయం ఇక్కడకురా. పనిఉంది. ఇందులో అబద్ధమేమీలేదు." అనిచెప్పి తన సఖీజనంతో కలిసివెళ్ళిపోయింది. రాజకుమారుడు కూడా తిరిగివెళ్ళి బ్రాహ్మణ కుమారునితో సంతోషంగా జరిగినదంతా చెప్పాడు. తరవాత ఇద్దరూకలిసి ఇంటికి వెళ్ళిపోయారు. ఆ విషయమంతాచెప్పి బ్రాహ్మణస్త్రీని సంతోషపెట్టారు.

యథాప్రకారం మూడోరోజున రాజకుమారుడు బ్రాహ్మణ కుమారునితో కలిసి అడవికి వెళ్లాడు. అక్కడ కుమార్తెతో కలిసిఉన్న గంధర్వరాజును చూచాడు. తరవాత ఆతడా పిల్లలను ఆనందపఱచి ఉచితాసనాలమీద కూర్చుండబెట్టి "ఓ రాజకుమారా! మొన్న నేను కైలాసానికి వెళ్ళాను. పార్వతీ సమేతుడైన శివుణ్ని దర్శించాను. అప్పుడు శంకరుడు దయతో నన్ను చేరబిలిచి "భూలోకంలో ధర్మగుప్తుడనే రాజకుమారుడున్నాడు. ఆతడు రాజ్యభ్రష్టుడై, బంధు విహీనుడై, శత్రుపీడితుడై, దరిద్రుడై పెద్దల మాటలలో విశ్వాసం ఉంచి నన్ను పూజించాడు. ఆ ప్రభావంవల్ల ఇప్పుడాతని పితృదేవత లందరూ నా సాయుజ్యాన్ని పొందారు. కాబట్టి ఆతడు శత్రువులను జయించి తిరిగి రాజ్యాన్నిపొందేటట్లు సహాయపడు'' అని చెప్పాడు. ఇంటికివెళ్ళి ఈ వృత్తాంతాన్ని తెలుసుకొని శివుని ఆజ్ఞచే నా కూతురును వెంటబెట్టుకొని ఇక్కడకు వచ్చాను. కాబట్టి అంశుమతి అనే ఈ నా కుమార్తెను నీ కిస్తాను. శివాజ్ఞచే నీ శత్రువులను సంహరించి తిరిగి నీ రాజ్యాన్ని నీకు కూరుస్తాను. నా కూతురితో కలిసి ఇష్టభోగాలను అనుభవించి పదివేల సంవత్సరాల తరవాత కైలాస పదవిని పొందగలవు. ఈ నా కుమార్తెకూడా దివ్యమైన శరీరంతో నీతోకూడ శివసన్నిధియందు ఉండగలదు.'' అని చెప్పాడు.

సూతుడీ విధంగా అన్నాడు! తరవాత ఆ వనమందే గంధర్వ రాజు తన కూతురిని రాజకుమారుడికిచ్చి వివాహం చేశాడు. బాగా ప్రకాశించే రత్నహారాలూ, చంద్రుడితో సమానమైన శిరోమాణిక్యం, ప్రకాశించే ముత్యాలహారం ఆ రాజకుమారుడికి కట్నంగా ఇచ్చాడు. దివ్యమైన అలంకారాలు, వస్త్రాలు, బంగారపు వల్లెవాట్లు, అసంఖ్యాకాలైన ఏనుగులూ, గుర్రాలు, వేలకొలదీ రథాలు, అనేక విధాలైన ఆయుధాలు ఇచ్చాడు. అంతేకాక దివ్య

మైన ఒక రథాన్నీ, వజ్రాయుధంతో సమానమైన ఒక ధనస్సునూ, వేలకొలదీ మంత్రయుతమైన ఆయుధాలు, అక్షయాలైన అమ్ముల పొదులు, బాణాలు, దుర్భేద్యమైన కవచం, శత్రువులను ఖండించ గల ఖడ్గం, శత్రుగజాలను సంహరించే ఏనుగులు, శత్రుసంహారమైన శక్తినీ ఇచ్చి తన కుమార్తె సేవకోసం అనేక వేల కన్యకలనూ ధనాన్నీ అర్పించి సంతోషపెట్టాడు. ఈ విధంగా ధర్మగుప్తుడు గంధర్వరాజ కుమార్తెనూ, సర్వసంపదలనూపొంది ఆనందించాడు. తరవాత గంధర్వరాజు విమానాన్ని ఎక్కి స్వర్గానికి వెళ్ళాడు. గంధర్వాంగ నను పెండ్లియాడిన ధర్మగుప్తుడు గంధర్వసేనతో కలిసి తన పట్టణా నికివెళ్ళి శత్రువులపై దండెత్తాడు. గంధర్వరాజుచే ఇవ్వబడిన శక్తిచే దుష్టశత్రుసంహారంచేసి తన నగరాన్ని ప్రవేశించాడు.

తరవాత మంత్రులచేత, మహనీయులైన బ్రాహ్మణులచేత పట్టాభిషిక్తుడై రత్నసింహాసనాన్ని అధిష్ఠించి శత్రురహితమైన రాజ్యాన్ని చాలాకాలం పాలించాడు. తనను పెంచిన బ్రాహ్మణ స్త్రీనే తల్లిగా, ఆమె కుమారుణ్ని సోదరుడిగా గౌరవించాడు. ధర్మగుప్తుడు శంకరుని సేవించి ఆ సేవాభాగ్యంవల్ల గంధర్వరాజ కుమార్తెను వివాహమాడి విదర్భదేశాధిపతియై నిష్కంటకంగా రాజ్యమేలాడు.

ఈ విధంగా అనేకులు ప్రదోషకాలాన శివుణ్ని పూజించి ఇష్టార్థసిద్ధినొంది దేహాంతంలో శివసాయుజ్యాన్ని పొందారు. 'ఏత న్మహావ్రతం పుణ్యం ప్రదోషే శంకరార్చనం ధర్మార్థ కామమోక్షా ణాం తదేతత్సాధనం పరం' ప్రదోషకాలంలో శివపూజయే పుణ్య ప్రదమైన మహావ్రతం. ఇదియే ధర్మార్థకామమోక్షాలకు ముఖ్య సాధనం. ఎవరు చాలా ఆశ్చర్యకరమైన పవిత్రమైన ఈ కథను సాయంకాలం శివపూజానంతరం వింటారో ఎవరు చదువుతారో

వారికెన్ని జన్మలందైనా దారిద్ర్యంలేని జ్ఞానైశ్వర్యాలుకల్గి దేహాంతమందు కైలాసాన్ని పొందుతారు. ఎవరు దుర్లభమైన మానవ శరీరాన్ని పొంది ఈశ్వరపూజ చేస్తారో వారు ధన్యులు. వారి పుణ్యంచే లోకాలను జయిస్తున్నారు. వారి పాదధూళి లోకాన్ని పవిత్రం చేస్తున్నది.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో శివపూజామహిమను వర్ణించే ఏడవ అధ్యాయం.

—/—

## అష్టమోధ్యాయం

శౌనకాదులతో సూతుడు చెప్పడం మొదలు పెట్టాడు.

'నిత్యానందమయం శాంతం నిర్వికల్ప మనోమయం
శివతత్త్వ మనాద్యంచ యే విదుస్తే పలాంగతాః'

శాశ్వతానందమయమూ, శాంతియుతమూ, నిర్వికల్ప మనోమయమూ, అనాద్యమూ అయిన శివుని తత్త్వంగూర్చి ఎవరు తెలుసుకుంటారో వారు పరమపూజ్యస్థానాన్ని అలంకరిస్తారు. కామభోగాలలో ఎవరు విరక్తులై కారణంలేకుండానే పరమశివునిపట్ల భక్తికల్గిఉంటారో వారు తప్పక తరిస్తారు. విషయసుఖాసక్తులై ఎవరు పరమశివుని కొలుస్తారో వారుకూడా విషయాలకు లోనుగాక స్రక్చందనాదుల ఫలాన్ని పొందుతారు. పురుషుడు పరమశివునిపట్ల భక్తిగల్గి ఏ ఉద్దేశంతో పూజించినా కొంతకాలానికి పరమపూజ్యస్థానాన్ని పొందగల్గుతాడు. ఏ నరుడు పూజ్యస్థానేచ్ఛతో స్రక్చందనాదులను త్యజించడానికి ఇచ్ఛగించడో అతడు ఎల్లప్పుడూ శివునారాధించి దేహత్యాగానంతరం శివసాయుజ్యాన్ని పొందుతాడు.

విషయవాసనలను విడవడానికి నరు డశక్తుడు కాబట్టి దేహధారులకు కర్మయుక్తమైన శివపూజయే కామధేనువులా సర్వాభీష్టాలనూ ప్రసాదిస్తుంది. మాయామయ సంసారంలో సుఖంగా చాలాకాలం గడిపి దేహాంతకాలంలో మోక్షాన్ని ఎవరు పొందకోరతారో వారికి శివారాధనమే కర్తవ్యం. స్వర్గమోక్షాలను వాంఛిస్తున్న మానవుడు నిత్యం శివారాధనమే చేయాలి. ప్రదోషకాలంలోగానీ, సోమవారంనాడుకానీ చేసిన శివపూజ అధికఫలాన్ని ఇస్తుంది. ఎవరు సోమవారంనాడు శివు నారాధిస్తారో ఇహపరలోకాలలో వారు పొందని ఫలంలేదు. ఉపవాసండుండి ఇంద్రియాలను జయించి, సోమవారం నాడు శుచిగా వేదోక్తమంత్రాలతో పౌరాణిక విధులతో శివుని పూజించాలి. బ్రహ్మచారి, గృహస్థుడు, కన్య, భర్తకలది, వితంతువు-ఎవరైనాసరే శివునారాధిస్తే ఈప్సితఫలసిద్ధి అవుతుంది. దీనికి సంబంధించి శ్రోతృగణాకర్షకమైన ఒక కథ చెపుతాను. పరమేశ్వరుడిపట్ల నిశ్చలబుద్ధికలవారు భగవత్కథాశ్రవణంచేసి శివునిపట్ల నిశ్చలమైన భక్తితో ఉంటారు.

ఆర్యావర్తదేశంలో చిత్రవర్మడనే రాజున్నాడు. అతడు పరమ ధార్మికుడు. దురాత్ములకు భయంకరుడు. ధర్మకార్యాల నుద్ధరిస్తూ, దుష్టులను శిక్షిస్తూ సకలయజ్ఞాలను నిర్వర్తిస్తూ, శరణన్నవారిని రక్షిస్తూ సర్వపుణ్యకార్యాలనుచేస్తూ, అర్థులకు సకలసంపదలను దానంచేస్తూ, శత్రుసమూహాన్ని జయిస్తూ, శివకేశవులపట్ల భక్తుడై ఉండేవాడు. అనుకూలవతులైన సతులందు పరాక్రమోపేతులైన కుమారులనూ, అతిలోక సౌందర్యవతి అయిన ఒక కుమార్తెను కన్నాడు. పార్వతినిగన్న హిమవంతుడిలా కన్నకూతురును చూచి తనను దేవునితో సమానుడిగా భావించుకొని అతడు పూర్ణమనోరథుడయాడు.

కొంతకాలానికి జ్యోతిశ్శాస్త్రవేత్తలను రావించి సంతోషంగా తన కుమార్తె జాతకాన్నిగూర్చి ప్రశ్నించాడు. ఒక విప్రవరుడు "ఓ రాజా! నీ కుమార్తె సీమంతిని అనే పేరుతో వెంపొందుతుంది. ఆమె పార్వతీదేవిలా నిత్యమంగళయై, దమయంతిలా రూపవంతురాలై సరస్వతిలా సకల విద్యావంతురాలై, లక్ష్మిలా మహా గుణాలతో ఒప్పుతుంది. విలసత్సంతానవతియై, జానకీదేవిలా దృఢ వ్రతదీక్షకలదై, సూర్యతేజస్సులాంటి సత్కీర్తితో, వెన్నెలలా మనోహరమై ఈమె పదివేల వత్సరాలు భర్తతోకూడి సుఖంగా ఉంటుంది. మంచి పుత్రులనుగాంచి సుఖాన్ని పొందుతుంది." అని చెప్పగా రాజాతడికి ధనమిచ్చి సత్కరించాడు. తరవాత మరో విప్రుడు చాలా ధైర్యంగా సందేహించక "నీ కుమార్తెకు పదునాల్గవఏట వైధవ్యం కలుగుతుందని" చెప్పాడు. వజ్రాఘాతనిష్ఠురమైన ఆ మాటను విని రాజు క్షణకాలంపాటు చింతాకులచిత్తుడయాడు. బ్రాహ్మణభక్తి గలవాడవడంవల్ల ఆతడు అంతా దైవయోగమని తలచి నిశ్చింతగా ఉన్నాడు.

బాల్యం గడిచిన సీమంతిని చెలికత్తెలవల్ల తనకు కలగబోయే వైధవ్యాన్నిగూర్చి విన్నది. చాలా విచారించి యాజ్ఞవల్క్యమహర్షి సతీమణి అయిన మైత్రేయిని చిరునవ్వుతో "ఓ తల్లీ! చాలా భయపడి నీ పాదపద్మాలచెంతకు చేరాను. దయతో సౌభాగ్యవృద్ధికరమైన కర్మను నాకు బోధింపవేడుకుంటున్నాను." అని అడిగింది. అప్పుడామె ప్రసన్నురాలై "శివునితో కూడిన పార్వతిని శరణువేడు. సోమవారంనాడు ఉపవాసముండి శుచిగాస్నానంచేసి నిర్మలమైన మనస్సుతో పరిశుభ్రమైన వస్త్రం ధరించి పార్వతీ పరమేశ్వరులను పూజించు. వాఙ్నియమంతో, నిశ్చలమైన మనస్సుతో తగిన విధంగా పూజించి బ్రాహ్మణులకు భోజనంపెట్టి శివుని అనుగ్రహం పొందాలి.

ఈశ్వరాభిషేకం సమస్త పాపాలనూ నశింపజేస్తుంది. ఆ పీఠాన్ని పూజించడంవల్ల సామ్రాజ్యం లభిస్తుంది. గంధమాల్యాక్షతలను సమర్పించడంవల్ల సాటిలేని సౌఖ్యసంపదలు కల్గుతాయి. ధూపమివ్వడంవల్ల సౌగంధ్యం, దీపదానంవల్ల కాంతి, నైవేద్యంవల్ల మహాభోగాలు, తాంబూలంవల్ల సకలైశ్వర్యాలు కల్గుతాయి. నమస్కారంవల్ల చతుర్విధ పురుషార్థాలూ, జపంవల్ల అష్టైశ్వర్యాలూ లభిస్తాయి. హోమంవల్ల సర్వార్థసిద్ధి, బ్రాహ్మణభోజనంవల్ల సర్వదేవతాతృప్తి కల్గుతాయి. ఈ విధంగా సోమవారంనాడు పార్వతీ పరమేశ్వరులను ఆరాధించు. ఘోరాతిఘోరమైన ఆపదవచ్చినా భయంకరమైన కష్టాలుకల్గినా శివపూజా ప్రభావంవల్ల అవన్నీ అదృశ్యం అవుతాయి." అని సీమంతినికి బోధించి వెళ్ళినతరవాత ఆమె అదేవిధంగా చేసింది.

నలుడికి దమయంతియందు ఇంద్రసేనుడనే కొడుకు పుట్టాడు. ఆతడికి చంద్రసమానుడైన చంద్రాంగదుడు కలిగాడు. అతడిని రావించి చిత్రవర్మ్మదు పెద్దల అనుమతితో తన కుమార్తె అయిన సీమంతినినిఇచ్చి వివాహం చేశాడు. మహావైభవంగా జరిగిన ఆ పెళ్ళికి సకలరాజేంద్రులూ వచ్చారు. చంద్రాంగదుడు కొంతకాలం పాటు అత్తవారింటిలో సుఖంగా గడిపాడు. ఒకనాడా రాజకుమారుడు యమునానదిని దాటడానికి కొందరు సఖులతో కలిసి విలాసంగా ఒక నావపై కెక్కాడు. ఆ నదిని దాటుతుండగా విధివైపరీత్యం వల్ల నావ గాలిచేకొట్టబడి నీటిలో మునిగిపోయింది. నదీతీరమందున్న సైనికులు చూస్తుండగానే వారి ఆర్తధ్వానాలు భూమ్యాకాశాలు దద్దరిల్లాయి. కొందరు నదిలో మునిగిపోయి ప్రాణాలు కోల్పోయారు. మరికొందరు మొసళ్ళచే మ్రింగబడ్డారు. కొందరు నీటిలో మునిగి కనుమరుగయ్యారు.

చిత్రవర్మ మహారాజావార్తవిని చాలాదుఃఖంతో యమునా నదీతీరాన్ని చేరి నిశ్చేష్టుడయాడు. రాణులంతా అదివిని ప్రాన్పడి పోయారు. రాకుమార్తె సీమంతిని ఆ వార్తవిని భూమిపై పడి మూర్ఛిల్లింది. మంత్రి పుత్రులు, పురోహితులతో కూడిన రాజులందరూ విహ్వలచిత్తులై జుట్టుముడులు వీడిపడేటట్లు దుఃఖించారు. చంద్రాంగదుని తండ్రిఅయిన ఇంద్రసేన మహారాజా మరణవార్తవిని భార్యలతోసహా భూమిపైపడి చైతన్యరహితుడయాడు. మంత్రులూ, పాలితజనులు, బాలురు, పెద్దలు, స్త్రీలు శోకవిహ్వాలు లయారు. కొందరు గుండెలు బాదుకున్నారు. కొందరు నెత్తీనోరూ కొట్టుకున్నారు. "ఓ రాకుమారా! ఓ పుత్రుడా! ఎక్కడికి వెళ్లావు?" అని విలపించారు. ఇంద్రసేన మహారాజుపట్టణంకూడా మహాశోకంలో మునిగి చిత్రవర్మపట్టణంతో సమానమయింది.

తరవాత చిత్రవర్మడు పెద్దలచే ఊరడింపబడి నెమ్మదిగా తన పట్టణానికిచేరి కుమార్తె నోదార్చాడు. బంధువులతో కలిసి యథావిధిగ అల్లుడికి కర్మకాండ జరిపించాడు. సీమంతిని సహగమనం చేయడానికి ఉద్యుక్తురాలైంది. కాని తండ్రిమాటవల్ల మానుకొని వైధవ్యాన్ని పొందింది. అయితే ఆమె మాత్రం సోమవారవ్రతం మానలేదు. పదునాల్గవయేటనే సంభవించిన వైధవ్యదుఃఖంతో శివపాదారవిందాలను ధ్యానిస్తూ ఆమె మూడేళ్ళు గడిపింది. పుత్రశోకంతో కాలం వెళ్ళబుచ్చుతున్న ఇంద్రసేన మహారాజు శత్రువులు దండెత్తడంతో రాజ్యభ్రష్టుడయాడు. భార్యతో, ప్రజలతో సహా కారాగార బద్ధుడయాడు.

అక్కడ యమునానదిలో మునిగిన చంద్రాంగదుడు క్రమంగా నాగలోకాన్ని చేరి నాగకన్యలను చూచాడు. జలక్రీడాసక్తులైనవారా తని చూచి ఆశ్చర్యపడి తమ లోకానికి కొనిపోయారు. తక్షకుని

నగరానికి చేర్చారు. అక్కడ రాజగృహం ఇంద్రగృహంతో సమానంగా ఉంది. వజ్రాలతో పగడాలతో వైడూర్యమాణిక్యాలతో కట్టబడిన అనేక మేడలున్నాయి. మాణిక్యాలతో కూడిన గోపురాలున్నాయి, మిద్దెలున్నాయి. చంద్రకాంత మణిఖచితమైన ప్రదేశాలున్నాయి. సువర్ణ వికారమైన ద్వారాలూ, తలుపులూ ధగధగలాడుతున్నాయి. నానావిధాలైన మణిదీపాలు ప్రకాశిస్తున్నాయి. ఆ రాజగృహాన్ని రాకుమారుడు చూచాడు. అక్కడ సభలో రత్న సింహాసనాధిష్ఠితుడైన అనంతుడు కనిపించాడు. ఆతడు అనేకమైన పడగలతో ప్రకాశిస్తున్నాడు. పన్నగాధీశసముంచిత వస్త్రాలను ధరించాడు. రత్నకుండలాలచే ప్రకాశిస్తున్నాడు. వివిధ మణిగణఖచిత కిరీటకాంతులతో ఒప్పుతున్నాడు. పడగలపై ఉన్న మణులతో దేదీప్యమానంగా ఉన్నాడు. పెక్కు సర్పాలతో కూడినవాడుగా ఉండి, రూపయౌవన విశేషవిలాసాలతో ప్రకాశిస్తున్న పెక్కుమంది నాగకన్యలచే పరివేష్టింపబడ్డాడు. శ్రేష్ఠమైన అలంకారాలుధరించాడు. శ్రేష్ఠమైన మంచిగంధం పూసుకున్నాడు. ప్రళయకాలాగ్నిలా సహింపశక్యంకాక, సూర్యతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు.

రాజపుత్రుడాతనికి నమస్కరించాడు. ఆతణ్ణిచూచి నాగరాజు ఆశ్చర్యపడి "ఇతడెక్కడనుండి ఇచ్చటకు వచ్చాడ"ని నాగకన్యకల నడిగాడు. యమునా జలాలలో ఆతణ్ణి చూచి తెచ్చినామని వారు చెప్పారు. అప్పుడు తక్షకుడు "రాజకుమారా! నీ వెవరి కుమారుడవు? నీ వెవరవు? నీ నివాసస్థానమేది? చెప్పు" అని ప్రశ్నించాడు. దానికి రాజకుమారుడు "భూమండలంలో నిషధ అనే దేశముంది. దాన్ని గొప్ప కీర్తిమంతుడగు నలమహారాజు ఏలుతున్నాడు. ఆతడు పుణ్యాత్ముడు, సకలరాజ లక్షణశోభితుడు, సత్యవాది, జితేంద్రి

యుడు, మహారధుడు, సర్వలక్షణలక్షితుడు, పూజ్యుడు, వేదవేత్త, బుద్ధిశాలి, సకలశాస్త్ర పారంగతుడు. ఆతడిపేరు ఉచ్చరిస్తేనే లోకంలో కలిభయం ఉండదు. ఇంక ఆతడి రాజ్యంలోకి కలిఎలా ప్రవేశిస్తాడు? నలమహారాజు భార్య దమయంతి. ఆమె భీమరాజ కుమార్తె. సత్కులసంజాత, రూపవతి, గుణవతి. వారిద్దరికీ చంద్ర సేనుడనే కుమారుడు కలిగాడు. రూపంచేత, ఔదార్యంచేత, శీలం చేత తండ్రి కాతడు ఇష్టుడయాడు. ఆ చంద్రసేనుని పెద్దకొడుకును నేను. నా పేరు చంద్రాంగదుడు. నేను వివాహమైన తరవాత మామగారింటిలో నివసిస్తూ ఒకనాడు యమునా జలంలో విహరి స్తున్న సమయంలో దైవయోగంవల్ల మునిగిపోయి ఈ పన్నగాంగన లచే మీసమక్షానికి తీసుకురాబడ్డాను. పూర్వజన్మ సుకృతంవల్ల నీ పాదారవిందాలను దర్శించగలిగాను. నేను అదృష్టవంతుడనయాను. మీ దర్శనం అయింది. మీరు దయతో మాటాడారు" అని విన యంగా చెప్పాడు.

అదివిని తక్షకుడు సంతోషంతో "ఓ రాజేంద్రా! నీవు నాకు చాలా సన్నిహితుడవు. ఏమీ భయపడకు. ధైర్యంగాఉండు. సకల దేవతలలో మీ రే దేవుని ఎప్పుడూ పూజిస్తారు? దేవతలలో ఎవరు మహాదేవుడని ప్రసిద్ధికెక్కాడు?" అని ప్రశ్నించాడు.

అప్పుడు రాజకుమారుడు "ఏ పరమేశ్వరుని తేజస్సువల్ల అనం తుడు ప్రభువయాడో ఆ విశ్వాత్ముడైన పార్వతీపతి మాచే ఎప్పుడూ పూజింపబడుతున్నాడు. పరమేశ్వరుని సాత్వికమైన దివ్యాంశను భరించి విష్ణువు సనాతనుడయాడు. ఆ పరమేశ్వరుడే వేరొక రూపంతో ఈ లోకాన్ని సృజించాడు. పరమేశ్వరుని తామసాంశ వల్ల కాలాగ్ని సంజ్ఞగల రుద్రుడుదయించాడు. ఆ విశ్వాత్మకు డైన పరమేశ్వరుడే విశ్వాన్నంతా భరిస్తూ మాచే పూజింపబడు

తున్నాడు. పరమేశ్వరుడు బ్రహ్మమై కారణానికి కారణమై ఒప్పు తున్నాడు. ఆయనే ఈ సృష్టినంతా అంతంలో దహిస్తాడు. శివుడు మాయలో బద్ధ మనస్సుగలవారికి దగ్గరగా ఉన్నా దూరంగా ఉంటాడు. ఆయన తేజస్సులకు తేజస్సు. పరమేశ్వరుడు అగ్నిలో, భూమిలో, నీటిలో, గాలిలో నిండిఉన్నాడు. అపరిచ్ఛేద్యమైన మాయగలవాడు. ఆ పరమశివుడే మాకు ఆధారభూతుడు. ఆయన సమస్త జీవరాసుల ఆత్మలందుండి ప్రకాశిస్తున్నాడు. ఆ విశ్వాత్ముడగు పరమేశ్వరుడే మాకు నిరంతరమూ పూజ్యుడు. పరమశివుడికి లోకమంతా ఇచ్ఛాధీనమైఉంది. ఆ పరమేశ్వరుడు మాకు ఎల్లప్పుడూ పూజ్యుడు. పరమేశ్వరుని అద్వితీయుడిగా, ఆద్యుడిగా, పురుషవరేణ్యుడిగా, అంత్యమందు నిలుచువానిగా, కూటస్థుడిగా, వేరైనవానినిగా, గుణవికారంచే క్షేత్రజ్ఞునిగా చెపుతారు. ఆ పరమేశ్వరుడే మాకు దిక్కు. అవాఙ్మానసగోచరమైన మహిమతో ఊహింపశక్యంకాని స్వరూపంతో, అపరిచ్ఛేద్యమైన తేజస్సుతో సర్వత్రా నిండిఉన్న పరమేశ్వరుని జనులు తెలుసుకోలేక పోతున్నారు. ఆ పరమశివుడు మాకు నిరంతరమూ పూజ్యుడు, పరమశివుని అనుగ్రహంవల్ల సజ్జనులు బ్రహ్మేంద్రాదుల పదాలను వాంఛిస్తారు. తమ కర్మార్జితపుణ్యం వల్ల భీతులై ఈ కాలచక్రాన్ని దాటతారు. ఆ పరమశివుడే మాకు ఆధారభూతుడు. సకలపాపాలకూ, రోగాలకూ పరమశివుని స్మరణం విరోధి. అన్ని నీచజన్మలకు మహాపకారకం. పరమశివుని నిజస్వరూపాన్ని నాల్గువేదాలు చెప్పజాలవు. ఆ పరమశివుని మనఃపూర్వకంగా పూజిస్తున్నాను. ఆకాశగంగ పరమేశ్వరుని శిరస్సున నివాసముంది. జగన్మాత పార్వతి శివుని శరీరాన్ని స్థానంగా చేసుకుంది. వాసుకి తక్షకులు శివుడికి కుండలాలుగా అయారు. ఆ అర్ధశశాంకమౌళి మాకు పూజ్యుడు. శివుడు వేదోపనిషత్తులలో నివసిస్తున్నాడు.

ఈశ్వరుని పాదపద్మాలు ఎల్లప్పుడూ పూజ్యం. శంకరుని కీర్తి యోగులతో కీర్తింపబడుతున్నది. పరమేశ్వరుని మూర్తి సమస్తమైన తత్త్వాలలో వసించిఉంది. ఆయన గుణాలను జయించినవాడు. ఆయన మాకు పూజ్యుడు" అని చెప్పాడు.

ఆ మాటలకు తక్షకుడు చాలా సంతోషించాడు. శివునిపట్ల గల భక్తితో "రాజేంద్ర కుమారా! నేను చాలా సంతోషించాను. నీకు శుభమగుగాక! బాలుడివైనా నీవు శైవతత్త్వాన్ని గూర్చి బాగా తెలుసుకొన్నావు. ఈ లోకం రత్నమయమైంది. ఈ స్త్రీలు చారులోచనలు. ఇవి కల్పవృక్షాలు. ఈ దిగుడు బావులు అమృత తుల్యమైన జలంకలవి. ఇక్కడ మృత్యుభయంగానీ, జరారోగపీడ నంకానీలేదు. ఇక్కడ స్వేచ్ఛగా విహరించు. ఇష్టమైన భోగాల ననుభవించు" అని చెప్పాడు.

అప్పుడు రాజకుమారుడు "నేను ఉత్తమకాలంలో వివాహ మాడాను. నా సతికూడా సువ్రత. నిత్యశివపూజాపరాయణ. నా తల్లిదండ్రులకు ఏకైక పుత్రుడను. ఇప్పుడు నేను చనిపోయానని వారు తలచి చాలా బాధపడి ప్రాణాలు విడిచారో లేక బ్రతికి ఉన్నారో తెలియదు. ఇందువల్ల ఇక్కడ చాలాకాలం ఉండటానికి నాకు ఇష్టంలేదు. దయచేసి నన్ను వారుండే చోటికి పంపించండి" అని పల్కిన రాజకుమారుడికి కల్పవృక్షంవల్ల లభ్యమైన శ్రేష్ఠమైన పదార్థాలనూ, మంచిగంధం, వస్త్రాలు, పూలదండలు మొదలైన లోకోత్తరాలైన ఆభరణాలను ఇచ్చి సర్పరాజు తృప్తిపరచాడు. అంతేకాక "నీవు నన్ను ఎప్పుడు స్మరిస్తే అప్పుడు నీ ఎదుట ప్రత్యక్షమవుతాను" అని చెప్పి అనేక ద్వీపాలలో, సముద్రాలలో, లోకాలలో అడ్డులేకుండా స్వేచ్ఛగా సంచరించగల ఒక గుర్రాన్ని ఇచ్చాడు. తానిచ్చిన రత్నహారాలు, లోకోత్తరమైన ఆభరణాలు,

వస్త్రాలు మోయడానికి ఒక రాక్షసుణ్ని తక్షకుడు ఆజ్ఞాపించాడు. రాజకుమారుడికి సహాయం చేయడానికి తన కొడుకును నియోగించాడు.

ఈ విధంగా చంద్రాంగదుడు నానావిధాలైన ధనంతో స్వేచ్ఛగా సంచరించే అశ్వంఎక్కి వారిరువురితో కలిసి బయలు దేరాడు. క్షణకాలంలో అతడు నదీజలాలనుండి బైటికి తేలాడు. దివ్యాశ్వాన్ని అధిరోహించి తీరమందు అతడు విహరిస్తున్న సమయంలో అతని సతియగు సీమంతిని తన చెలికత్తెలతో స్నానార్థమై అక్కడికి వచ్చింది. రాక్షసుడితో, మానవరూపంలోఉన్న అనంత పుత్రుడితో నదీతీరానఉన్న రాజకుమారుడిని సీమంతిని చూచింది. దివ్యమైన అలంకారాలతో, దివ్యమాల్యాది భూషణాలతో పది యోజనాలవరకూ వ్యాపించిన దివ్యగంధంతో ఒప్పుచున్నవాడూ, దివ్యాశ్వాన్ని అధిరోహించినవాడూ అయిన రాజకుమారునిచూచి బుద్ధిజాడ్యంవల్ల, భయంవల్ల ఆమె సరిగా గుర్తించలేదు. ఆ రాజకుమారుడికి మాత్రం ఆమె ఇదివరకు చూచినదానిలా అనిపించింది. ఆమెకు కర్ణాభరణాలు లేవు. కంఠసూత్రం లేదు. కొప్పుపెట్టుకోలేదు. అంగరాగం లేదు. కాటుకపెట్టనికళ్లు కృశించిన అవయవాలుకలది. ఆమె దుఃఖంతోఉంది. అలాంటి ఆమెను చూచి రాజకుమారుడు గుఱ్ఱందిగి నదిఒడ్డున కూర్చుండి ఆమెను చేరబిలిచి కూర్చుండబెట్టి "ఓ కమల పత్రాక్షీ! నీ వెవతెవు? ఎక్కడనుండి వస్తున్నావు? నీ వెవరి భార్యవు? నీ వెవరి కుమార్తెవు? నీకు బాల్యంలోనే సహింపరాని ఈ దుఃఖమెలా కలిగింది?" అని ప్రశ్నించాడు.

కన్నీరు కారుస్తూ ఆమె తన సంగతి వివరించడానికి సిగ్గుపడింది. ఆమె చెలికత్తె "ఈ చిన్నది సీమంతిని అనే పేరు కలది. నలమహారాజు కోడలు. చంద్రాంగదుని భార్య. చిత్రవర్మ కుమార్తె. ఈమె

భర్త దైవదుర్వియోగంవల్ల ఈ నదీజలంలో మునిగిపోగా వైధవ్యం కల్గి దుఃఖంతో బాధపడుతున్నది. శోకిస్తూ మూడువేళ్ళు గడిపింది. నేడు సోమవారం. కాబట్టి స్నానంకోసం ఇక్కడకు వచ్చింది. ఈమె మామగారు శత్రువులచే రాజ్యం కోల్పోయి భార్యతోసహా కారాగారబద్ధుడయ్యాడు. అయినా ఈమె శుభకరమైన ఆచారంతో సోమవారంనాడు పార్వతీ సమేతుడైన శివుని భక్తితో పూజిస్తున్నది." అని చెప్పింది.

సూతుడు చెపుతున్నాడు. ఈ విధంగా చెలికత్తె వివరించగా సీమంతిని స్వయంగా రాజకుమారునితో "మన్మథునితో సమానమైన నీ వెవ్వరు? నీ ప్రక్కనున్న ఈ ఇద్దరూ ఎవరు? నీవు దేవుడవో-నరుడవో-సిద్ధుడవో, గంధర్వుడవో, కిన్నరుడవో కావలయును. స్నేహంతో నా వృత్తాంతాన్ని అడుగుతున్నావు. ఇదివరకు నన్ను ఎరుగుదువా? లేక చూచావా? ఎందుకడుగుతున్నావు? స్వప్నంలో కనబడ్డవాడిలా నా కనిపిస్తున్నది. విషయాన్ని చెప్పు. సజ్జనులు నిజమే చెపుతారుకదా!" అని అన్నది.

సూతుడు పలుకుతున్నాడు.

ఈ విధంగా రాజపుత్రునితో పలికి గద్గద కంఠంతో చాలా సేపు విలపించి ఆమె భూమిమీద పడింది. చెలికత్తెలు ఆమెను లేవదీసినా ఏమాత్రం మాటాడలేకపోయింది. చంద్రాంగదుడు తన ప్రియురాలి శోకహేతువును విని క్షణకాలంపాటు తానుకూడా దుఃఖించి తరవాత వాక్చాతుర్యంతో ఆమె నోదార్చి "మనము సిద్ధులమా? దేవతలమా? స్వేచ్ఛాసంచారులమా!" అంటూ బలాత్కారంగా ఆమె చేతిని గ్రహించాడు. సందేహంతో పులకాంకిత సర్వాంగ అయిన ఆమె చెవిలో "ఓ వరాననా? నీ భర్తను ప్రపంచంలో ఎక్కడైనా చూచావా? నీవు నిత్యం అనుష్ఠించే వ్రతాల

వల్ల సంతసించి వెంటనే తప్పక వస్తాడు. రెండు మూడు రోజులలో కలిగిన నీ దుఃఖాన్ని పోగొడతాడు. నీ భర్తను మిత్రుడగు నేను ఈ వృత్తాంతాన్ని నీతో చెప్పడానికి ఇక్కడకు వచ్చాను. ఇందులో సందేహంలేదు. పుణ్యంతో ఒట్టుపెట్టుకుంటున్నాను. అంతవరకూ నీ మనస్సులో ఉంచుకో. ఎవరికీ చెప్పకు." ఈ విధంగా అమృత ధారలకన్నా మిన్నయైన అతడి మాటలువిని తొట్రుపాటుతో, చంచలనేత్రయైన ఆ చిన్నది అతడినే తదేకదృష్టితో చూస్తున్నది. ఎంతో ప్రేమతో అమృతోపమానమైన అతని మాటలువిని విలాసంగా ఔదార్యంగా ఒప్పుకొంటూ క్రీగంటచూస్తూ తన చేతిని స్పృశించడంవల్ల పులకాంకిత దేహుడైన ఆ రాజకుమారుణ్ని చూచింది. అవయవాలు కంఠస్వరం మొదలైనవాటి గుర్తులవల్ల అతని వయస్సూ, ఆకారం పరీక్షగాచూచి "ఈతడే నా భర్త. వేరొకడు కాదు. నా హృదయం ప్రేమతో ఈతనియందే లగ్నమైంది. స్వరూపం ధరించి పరలోకంనుండి ఏ విధంగా ఈనాడిచ్చటికి వచ్చాడు? దురదృష్టవంతురాలనైన నేను ఇప్పుడు గతించిన నా భర్తను చూడగల్గుదును. ఇది స్వప్నమా? కాదు. భ్రాంతియా? కాదు. ఈతడు ధూర్తుడా లేక యక్షుడా లేక గంధర్వుడా." అని ఊహించింది. "ఎలాంటి ఆపదలోఉన్నా ఈ వ్రతం ఆచరించవలసిందని ముని భార్య అయిన మైత్రేయి చెప్పిన మాటలు నేడు సఫలమయాయి. జ్యోతిష్కుడైన విప్రుడు నాకు పదివేల సంవత్సరాలు సౌభాగ్యం ఉంటుందని చెప్పిన మాటలు నేడు నిజమయాయి. ఈశ్వరుడు కాక ఇంకెవరికీ విషయం తెలుస్తుంది? శుభావహమైన సుశకునాలు రోజూ కనబడుతున్నాయి. శివుని అనుగ్రహముంటే దేహధారులకు అసాధ్యమేముంది? ('ప్రసన్నే పార్వతీనాథే కిమసాధ్యం శరీరిణాం!') అని అనేక రీతులుగా తలచి సంశయం విడిచి, లజ్జచే ముఖం

వంచుకొన్న ఆమె చెవిలో "మిక్కిలి దుఃఖిస్తున్న నీ తల్లిదండ్రులకు ఈ వృత్తాంతం అంతా విన్నవించడానికి వెళుతున్నాను. నీకు మంగళమగుగాక! వెంటనే నీవు భర్తను పొందుతావు" అని రాజకుమారుడుచెప్పి గుర్రమెక్కి వెంటనే శత్రువుచే ఆక్రమించబడ్డ రాజ్యం చేరి పట్టణం వెలుపలనున్న ఉద్యానవనంలో విడిసి అనంతపుత్రుడితో తన జ్ఞాతులకు సందేశం పంపించాడు. ఆతడువెళ్ళి "ఇంద్రసేనుడిని విడిచిపెట్టండి. ఆతని కొడుకు చంద్రాంగదుడు అనంతుని గృహం నుండి నేడిక్కడకు వచ్చాడు. ఆలోచించకుండా మీరు వెంటనే రాజసింహాసనాన్ని విడిచిపెట్టండి. లేకపోతే ఆతని బాణాలు మీ ప్రాణాలను హరిస్తాయి'' అని చెప్పాడు.

ఆ వృత్తాంతంవిని శత్రువులంతా బాగుబాగని చాలా సంతోషించారు. వెంటనేవారు ఇంద్రసేనుడికి ఆ విషయంచెప్పి సింహాసన మధిష్ఠింపచేసి భయంలేనివారయారు. తరవాత పురజనులంతా పట్టణోద్యానవనంలో రాజకుమారుణ్ని చూచి రాజుకు విన్నవించారు. వారికి రాజు ధనం బహూకరించి సంతోషపెట్టి తన కొడుకు వచ్చినందుకు ఆనందసుధలో మునిగి ఈలోకాన్నే మరచిపోయాడు. తరవాత మంత్రులూ, పురోహితులు మొదలైన పెద్దలు ఆతని కెదురేగి కౌగిలించుకొని రాజువద్దకు తీసుకువచ్చారు. చాలా వైభవంగా కోటను ప్రవేశించి రాజకుమారుడు బాష్పలోచనుడై తలిదండ్రులకు నమస్కరించాడు. రాజు తన పాదాలమీదపడ్డ కుమారుని క్షణకాలం గుర్తించక ఆతని తల్లులు చెప్పగావిని కుమారుణ్ని లేవనెత్తి కౌగిలించుకున్నాడు. రాజకుమారుడు క్రమంగా తల్లులకు నమస్కరించి ఆశీర్వాదమొంది పురజనులను ఆలింగనం చేసుకొని వారినందరను ఆనందింపచేశాడు. తరవాత తనకూ తక్షకునకూ కల్గిన మైత్రినిగూర్చి తండ్రికి విన్నవించాడు. అనంతుడు రాక్షసుడితో పంపిన రత్నాలను

చూచి జరిగిందంతావిని చాలా ఆశ్చర్యపడి కోడలి సౌభాగ్యం పరమేశ్వరారాధనంవల్ల లభ్యమైందిగా తెలిసికొన్నాడు. చంద్రసేన మహారాజు ఈ వార్తను వెంటనే చారులతో చిత్రవర్మ మహారాజుకు పంపించాడు. ఆ రాజదివిని ఆనందంతో చారులకు ద్రవ్యమిచ్చి సంతోషపెట్టి పరవశంతో నృత్యం చేశాడు. కుమార్తెను పిలిచి కౌగిలించుకొని ఆనందబాష్పాలతో వైధవ్యలక్షణాలను తొలగించి అనేక అలంకారాలతో అలంకరించాడు. తరవాత ఆ రాష్ట్రంలోని గ్రామాలలో నగరాలలో పెద్దపెద్ద ఉత్సవాలు జరిగాయి. సీమంతినీ సౌభాగ్యాన్ని గూర్చి ప్రజలు వేనోళ్ళ కొనియాడారు. తరవాత చిత్రవర్మ మహారాజు చంద్రాంగదుని పిలిపించి శాస్త్రోక్తంగా మళ్ళీ తన కుమార్తెనిచ్చి వివాహం చేయదలచినట్లు చెప్పాడు. చంద్రాంగదుడు తక్షకగృహం నుండి తెచ్చిన మానవ దుర్లభమైన అలంకారాలను తన భార్యకు అలంకరించాడు. పుటముపెట్టిన బంగారంలా ప్రకాశించేదీ, పదియోజనాల దూరంవరకూ పరిమళించేదీ అయిన సౌగంధ్యంతో ఆ సీమంతిని ప్రకాశించింది. కల్పవృక్షంవల్ల పుట్టిందీ, పద్మసంబంధమైన పుష్పాడిలా ప్రకాశించేదీ అయిన పూలదండతో ఆ పతివ్రతామతల్లి అలంకరించబడి బాగా ప్రకాశించింది. చంద్రాంగదుడు తగినసమయంలో మంగళప్రదఅయిన భార్యతో కలిసి మామగారి అజ్ఞనుపొంది తన పట్టణానికి తిరిగివెళ్లాడు. ఇంద్రసేనమహారాజుకూడా తన కుమారుని రాజ్యపట్టాభిషిక్తుని చేసి గొప్పతపస్సుచే శివునారాధించి మహాయోగుల మార్గాన్ని అనుసరించాడు. చంద్రాంగద మహారాజు సీమంతినితో కలిసి పదివేల సంవత్సరాలు రాజ్యం పాలించి సకలభోగాల ననుభవించాడు. ఆమె తన భర్తతోకూడా పరమేశ్వరునారాధించి ఈశ్వరుని అనుగ్రహం వల్ల ఎనిమిదిమంది కొడుకులను ఒక కుమార్తెను కన్నది.

మిక్కిలి ఆశ్చర్యకరమైన ఈ చరిత్ర నాచే వర్ణింపబడింది తిరిగి సోమవారవ్రత మాహాత్మ్యం చెపుతాను అని సూతుడు చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండమనే గ్రంథంలో సోమావారవ్రత మహిమాను వర్ణనమనే ఎనిమిదవ అధ్యాయం.



# నవమోధ్యాయం

"మహాప్రాజ్ఞుడవైన సూతమహర్షీ ! నీ విప్పుడు లోకోత్తర మైన వృత్తాంతాన్ని చెప్పావు. మళ్ళీ విచిత్రమైన వృత్తాంతాన్ని చెప్పు." అని ఋషులు అడిగారు.

సూతుడు చెప్పడం మొదలు పెట్టాడు. "పూర్వకాలంలో విదర్భదేశంలో వేదశాస్త్రాల నెరిగినవాడూ, బుద్ధిమంతుడూ అయిన వేదమిత్రుడనే ఒక బ్రాహ్మణోత్తముడున్నాడు. అతడికి సారస్వతు డనే పేరుగల ఒక బ్రాహ్మణ మిత్రుడున్నాడు. వారిద్దరూ చాలా స్నేహంగా ఒకేదేశంలో నివసిస్తున్నారు. వేదమిత్రుడికి సువ్రతు డైన సుమేధుడనే కొడుకూ, సారస్వతుడికి జగత్ప్రసిద్ధి నొందిన సామవంతుడనే కొడుకూ ఉన్నారు. ఆ ఇద్దరూ ఒకే వయస్సు కల వారు, సమాన వేషధారులు, అన్నింటిలో సమానమైనవారు. ఒకే ముహూర్తాన విద్యాసంస్కారాన్ని పొంది సమాన విద్యాసంపత్తి కలవారైనారు. నాలుగు వేదాలనూ, తర్కవ్యాకరణాదిషడంగా లనూ, ఇతిహాసత్రయాన్నీ, అష్టాదశపురాణాలనూ ధర్మశాస్త్రాలను సంపూర్ణంగా అభ్యసించారు. చతుర్దశ విద్యలలో పరిపూర్ణులై

సభల్లో చక్కగా మాటాడగలిగి సకలసద్గుణాలతో ఒప్పుతూ తల్లి దండ్రులకు సంతోషం కలిగించారు. పదహారేళ్లు నిండిన వారిద్దరనూ వారి తండ్రులు పిలిచి "ఓ పుత్రులారా! లోకోత్తర సౌందర్యం కలిగి, సకలవిద్యాపారంగతులై బాల్యమందే ప్రకాశిస్తున్నారు. మీకిద్దరకూ వివాహమాడే యుక్తవయస్సు వచ్చింది. మీ విద్యతో మెప్పించి విదర్భదేశాధీశుని అనుగ్రహంపొంది, చాలా ధనం సంపాదించి మీ వివాహాలు చేసుకొనండి." అని చెప్పారు.

అదివిని ఆ బ్రాహ్మణపుత్రులిద్దరూ విదర్భాధీశుని కడకేగి తమవివాహానికి వలసిన ధనంకోసం యాచించారు. వారి అభిప్రాయం తెలుసుకొని లౌకికవ్యవహారంగా ఆ రాజు చిరునవ్వునవ్వి" ఇచ్చట నిషధదేశాధీశుడైన చంద్రాంగదుని భార్య సీమంతినీసతి సోమవారంనాడు పార్వతీ పరమేశ్వరులను పూజిస్తున్నది. ఆ రోజున భార్యాసమేతులూ, వేదవేత్తలలో శ్రేష్ఠులైన బ్రాహ్మణోత్తములను చాలా భక్తితో పూజించి ఆమె విశేషంగా ధనమిస్తున్నది. కావున మీ ఇద్దరిలో ఒకరు స్త్రీ వేషం వేసుకొని మరొకరు భర్తగా ఉండి బ్రాహ్మణ దంపతులుకండి. తరవాత సీమంతినీ గృహానికి వెళ్ళి విశేషధనంపొంది మళ్ళీ నా దగ్గరకురండి" అన్నాడు.

అదివిని వారు "మీరు చెప్పినట్లు చేయడానికి మాకు భయమేస్తున్నది." అన్నారు. 'దేవతా సుగురౌపిత్రో స్తథా రాజకులేషుచ, కౌటిల్య మాచరన్మోహాత్సద్యో నశ్యతి సాన్వయః' దేవతలకు, గురువులకు, తల్లిదండ్రులకు అట్లే రాజునకు తప్పుచేసినవాడు వెంటనే వంశంతోసహా నశిస్తాడు. అదీకాక రాజాంతఃపురాలను పురుషుడు మాయవేషంతో ప్రవేశించడంఎలా? మాయ ఎంతదాచినా బయటపడకపోదు. సజ్జనులు తమ ప్రాణాలమీదికి వచ్చినా మాయచేయరు. ఇదివరకు పెద్దల ఆశీర్వాదంవల్ల శీలంచేత, ఆచారంచేత, విద్యచేత

ఏ గుణాలు సంపాదించబడినాయో అవన్నీ కుటిలవృత్తిచే నశిస్తాయి. కపటవృత్తిచే సంచరించే మానవులకు పాపం, నింద, భయం, ద్వేషం అనే నాలుగు ఎప్పుడూ కల్గుతాయి. అందువల్ల మేమిద్దరం మంచి గుణవంతుల వంశంలో పుట్టి మంచి ఆచారవంతులమై దుర్మార్గులు కీర్తించే ఈ పనిని మేమెప్పుడూ చేయమని చెప్పారు.

అప్పుడా రాజు "దేవతలూ, గురువులూ, తల్లిదండ్రులు, పరిపాలకుడు-వీరి శాసనాన్ని అతిక్రమించకూడదు. కాన మారాడతగదు. వీరందరూ మంచిగానీ చెడుగానీ ఏది ఆజ్ఞాపించినాసరే దానిని భయపడనివారు, అప్రమత్తులు, వర్ధమానులు తప్పకుండా చేయాలి. మేము ప్రభువులం. మాచే శాసించబడు ప్రజలు మీరు. రాజాజ్ఞ మీరనివారికి శుభమవుతుంది, లేకపోతే భయం కల్గుతుంది. కాబట్టి మీరు వెంటనే మా ఆజ్ఞను అనుసరించవలసింది" అని చెప్పాడు. ఆ విప్రకుమారులిద్దరూ రాజ భయంవల్ల "తమ చిత్త"మని ఒప్పుకున్నారు.

అప్పుడా రాజు సారస్వత పుత్రుడగు సామవంతుడికి వస్త్రం, కాటుక మొదలైన స్త్రీ జనోచితాలంకారాలను చేయించాడు. కృత్రిమ వేషంవేసినా బ్రాహ్మణబాలుడు వక్షోజాలు, జడ, కర్ణాభరణాలు, అంగరాగం అలంకరించుకొని స్నిగ్ధమైన ముఖమూ కళ్లూ కలిగి అచ్ఛమైన స్త్రీరత్నంలా ప్రకాశించాడు. రాజశాసనాన్ని అనుసరించి విప్రకుమారులిద్దరూ దంపతులుగామారి తాము తలచింది అవుతుందని నిషధదేశానికి వెళ్ళారు.

సోమవారంనాడు రాజగృహానికివెళ్లి సతీసమేతులైన బ్రాహ్మణులతోకూడ ఆతిథ్యం స్వీకరించి పాదాలను కడిగించుకున్నారు. రాజపత్నియగు సీమంతిని సపత్నులై ఆసనాసీనులైన మహాతేజశ్శాలులైన బ్రాహ్మణులను విడివిడిగా పూజించింది. బ్రాహ్మణ

కుమారులు కృత్రిమదంపతులుగా మారినట్లు గ్రహించి ఆమె చిరు నవ్వునవ్వి వారలను సాక్షాత్తు పార్వతీపరమేశ్వరులుగా తలపోసింది. ఆ ఉత్తమ బ్రాహ్మణులయందు దేవదేవుడగు సదాశివుణ్ని బ్రాహ్మణ భార్యలందు జగన్మాతయగు పార్వతినీ ఆవాహనం చేసింది. గంధంచేత, పూలదండలచేత, ధూపంచేత నీరాజనాదుల చేత, బ్రాహ్మణులనెల్ల పూజించి నిశ్చలమనస్సుతో నమస్కరించింది. బంగారుపాత్రలలో నేతితోకూడిన పాయసం, పంచదార, తేనె, మంచికూరలు, గంధమాలలు, రుచికరమైన అన్నం, మనోహరమైన లడ్లు, బూరెలు మొదలైనవి, చక్కిలాలు, గోధుమ పూరీలు, పులగాలు, బాగాపక్వమైన గారెలు, లెక్కలేనన్ని భక్ష్యాలు, రసవంతాలైన పదార్థాలూ, రుచికల్గిన సూపాలు, చల్లని పానీయాలు, వీటితోకూడిన భోజనాన్ని బ్రాహ్మణులందరికీ భక్తితో వడ్డనచేసి పార్వతీ పరమేశ్వరులకు నివేదనచేసి సమర్పించింది. వారంతా తృప్తిగా భుజించి ఉత్తరాపోశనం చేసిన తరవాత రాజపత్ని వారికి నమస్కరించి దక్షిణను, తాంబూలాన్ని తగిన విధంగా ఇచ్చింది. మంచి ఆవులు, బంగారం, వస్త్రాలు, రత్నాలు, మాలలు, అలంకారాలు వారికిచ్చి నమస్కరించి బ్రాహ్మణులందరినీ పంపించింది. అదేవిధంగా కృత్రిమ దంపతులైన బ్రాహ్మణ కుమారులనుకూడ పూజించి పంపించింది. సీమంతిని సామవంతునియందు పార్వతిని ఆవాహనచేసి పూజించడంవల్ల నిజంగానే అతడు ఉత్తమ స్త్రీగా మారిపోయాడు.

అందువల్ల పురుషధర్మాన్ని మఱచి బ్రాహ్మణ పుత్రునిపట్ల అనురాగంతో మదోద్రేకంవల్ల కందర్పవశుడై "ఓ విశాలాక్షా! సర్వావయవ సుందరుడవగు నాథా! ఎక్కడికి వెడుతున్నావు? నీకు ప్రియురాలనగు నన్ను చూడవేమి? ముందున్న వనం చాలా

మనోహరంగా పుష్పించిన తీగలతో, వృక్షాలతో ఒప్పుతున్నది. నీతో కలిసి సుఖంగా చాలా కాలం అక్కడ విహరిద్దామనిఉంది" అన్నాడు. ఆ మాటలువిని బ్రాహ్మణ కుమారుడు ముందు నడుస్తూ అది పరిహాసోక్తిగా తలచి మామూలుగా ఉన్నాడు. కాని మళ్ళీ ఆ బాలికగా మారిన బ్రాహ్మణ కుమారుడు మన్మథావేశానికి తట్టు కోలేక "నన్ను వీడి ఎక్కడికి పోతున్నావు? అక్కడే ఆగు ఆగు; నన్ను కౌగిలించుకో. నా అధరాన్ని గ్రోలు. మన్మథబాణ పీడితు రాలనై నేను నడవలేకపోతున్నాను" అన్నది. ఇంతక్రితం ఎప్పుడూ వినని మాటలువిని సందేహంతో ఆతడు వెనకవస్తున్న చిన్నదాన్ని చూచి చాలా ఆశ్చర్యపడినాడు. పద్మదళాలవంటి నేత్రాలు, ఉన్నత మైన పయోధరాలు, కృశించిన ఉదరం, ఎత్తైన పిరుదులు, కొత్త చిగురుటాకులా మృదువుగాఉన్న ఈమె ఎవరు? నా సఖుడు సర్వాంగ సుందరమైన స్త్రీగా మారిపోయాడా ఏమిటి? ఇతడినే దీని గూర్చి అడుగుతాను" అని ఆలోచించి "ఓ స్నేహితుడా! రూప గుణాదులచేత నీవు కొత్తగా కనబడుతున్నావు. మదోన్మతవగు స్త్రీలా కొత్తగా మాటాడుతున్నావు. నీవు బ్రహ్మచారివి. ఇంద్రి యాలు జయించినవాడవు. వేదవేదాంగవేత్తవు శాంతుడవు. సారస్వ తుని కుమారుడవు. ఇట్లెందుకు మాటాడుతున్నావు?" అని అడిగాడు. అప్పుడామె మళ్ళీ "ఓ నాథా! నేను పురుషుడనుకాను. నీకు సౌఖ్యా న్నిచ్చే సామవతి అనే పేరుగల చిన్నదాన్ని. నీకు సందేహం ఉంటే నా అవయవాలనుచూడు" అన్నది. ఆతడు మార్గమందే రహస్యంగా ఆమెను పరీక్షించాడు. సహజమైన కొప్పు, పిఱుదులు, స్తనాలతో ప్రకాశిస్తూ సౌందర్యవతిగా ఒప్పుతున్న ఆమెనుచూచి కామవాంఛా సక్తుడై కొంచెం వికలమనస్కుడయాడు. విద్వాంసుడైన ఆతడు క్షణకాలం ఆశ్చర్యంతో మౌనం వహించాడు. అప్పుడు సామవతి

అగు ఆ యువతి బుద్ధిశాలి అయిన బ్రాహ్మణకుమారునితో "నీ అనుమానం తీరిందికదా ! ఇకవచ్చి నాతో క్రీడించు. ఉత్తమ స్త్రీకి సంభోగార్హమైన రహస్యమైన రమ్యమైన ఒక ప్రదేశాన్ని చూడు. మోహాన్ని పుట్టించే నా అవయవాలు చూడు" అంటూ సర్వావయవాలను ప్రకటిస్తూ తన బాహువల్లరులచే ఆతడిని బిగియార కౌగిలించుకొన్నది. అప్పుడా బ్రాహ్మణకుమారుడు "నా తల్లిదండ్రుల వంశాలనుబట్టి చేయకూడనిపని నేనెలా చేయగలను ? దూరబంధువులున్న నాకిదంతా విపరీతంగా ఉంది. అనురాగాన్ని పుట్టించే వస్తువును చూడకముందుండే మనస్సు అది చూచిన తరవాతఉండదు. చూచినప్పుడుండే మనస్సు సంభాషణవల్ల మారుతుంది. సంభాషించేటప్పుడుండే మనస్సు నవ్వులాటలచే వేరవుతుంది. నవ్వుమాటలప్పుడుండే చిత్తం స్పృశించడంచే మారుతుంది. స్పృశించేటప్పుడుండే మనస్సు గుహ్యస్థానదర్శనంవల్ల వేరవుతుంది. గుహ్యస్థానదర్శనమప్పుడుండే మనస్సు స్పర్శనమందట్లుండదు. స్త్రీల బాహుమూలాలు, స్తనద్వయం, గుహ్యప్రదేశాలను దర్శించడంవల్ల ఎలాంటి మనిషికైనా మనస్సుకలిగి స్త్రీలోలుడవుతాడు." అని ఆలోచించి ధైర్యం వహించి స్థిరచిత్తంతో ఈ విధంగా పలికాడు: "హద్దుమీరి ఇట్లు మాటాడకు. పిచ్చివాడిలా నన్ను బాధించకు. పూర్వం నీవు సమస్త వేదశాస్త్రాలు అభ్యసించి ఆ సారాన్ని గ్రహించినవాడవు. ఎందుకిట్లు మాటాడుతున్నావు ? నీవు చదివిన శాస్త్రాలు ఏమయాయి ? నీ తెలివి ఏమైంది ? ఇది నీకు తగునా ? లోకంలో జారిణి అయిన స్త్రీ మార్గం నీవు అనుసరించడం ధర్మమేనా ? నీవు నిజంగా స్త్రీవికావు. మామూలు పురుషుడవుకావు. మహావిద్వాంసుడవు. బాగా ఆలోచించుకో. మన ఈ దుర్వ్యాపారం స్వయంకృతాపరాధమే ! మన తల్లిదండ్రులకు తెలియనీక దుష్టప్రభువు మాటలా

లించి మన వంశానికికూడా తగని ఈ పనికి పూనుకున్నాం. దాని ఫలితం ఇప్పుడు అనుభవిస్తున్నాం. 'సర్వథానుచితం కర్మ నృణాం శ్రేయోవినాశనం'. ఉచితంకాని పనిచేసేవారి కెప్పుడూ ఆపదలే కలుగుతాయి. బ్రాహ్మణ పుత్రుడివి. విద్వాంసుడివి. అయినా ఏ కారణంవల్ల నీవు కపట స్త్రీ వేషం ధరించవలసి వచ్చిందో ఆకారణాన నీచమైన స్త్రీ వేషంతో ఉండవలసివచ్చింది. 'మార్గం త్యక్త్వాగతో రణ్యం నకోవిఘ్నైతకంటకైః' మార్గాన్ని విడిచి అరణ్యంలో సంచరించేవాడు ముళ్ళచే బాధపడకుండా ఉంటాడా! అదీకాక త్రోవను విడిచినవాడు బలాత్కారంగా క్రూరమృగాలచే హింసింపబడి మరణిస్తాడు. కాబట్టి బాగా ఆలోచించి మారుచెప్పక ఇంటికిరా. దేవ బ్రాహ్మణానుగ్రహంవల్ల నీ కేర్పడిన స్త్రీత్వం పోతుంది. అలాకాక దైవయోగంవల్ల స్త్రీత్వమే ఉంటే నీ తండ్రిచేత సమర్పింపబడిన దానవై నాతో సుఖంగా ఉందువుగాని. ఏమి ఆశ్చర్యం! ఎంత దుఃఖం! గొప్పదైన మాయాబలం ఎంత? శివపూజా విశేషంవల్ల ఈ రాజు భార్య ప్రభావం ఎంతగొప్ప ఆశ్చర్యంగా ఉంది?"

ఈ విధంగా చెప్పినప్పటికీ ఆ చిన్నది మన్మథపీడితురాలై అతని బలవంతంగా కౌగిలించుకొని అధరాన్ని చుంబించింది. ఆ విధంగా కవ్వించినా వికారమొందక ధైర్యంతో సుమేధుడు అతిప్రయత్నం మీద ఇంటికిచేరి జరిగిన వృత్తాంతమంతా వివరించాడు. అప్పుడా బ్రాహ్మణులు దుఃఖంతో దానిని విని చాలా కోపగించి కుమారులతోకూడా విదర్భరాజు దగ్గరకు వెళ్లారు. సారస్వతుడు రాజును చూచి "ఓ రాజా! నీ శాసనబద్ధుడైన నా కొడుకును చూడు. నీ ఆజ్ఞవల్ల నింద్యమైన స్త్రీ రూపాన్నిపొంది కర్మఫలాన్ని అనుభవిస్తున్నాడు. ఇప్పుడు నా సంతానం నష్టమైంది. నా పితృదేవతలు ఆశ లేనివారయ్యారు. పుత్రసంతానం లేనివాడికి పిండప్రదానం లేదు.

కాబట్టి పరలోకంలేదు. నా కొడుకు శిఖ, జన్నిదం, కృష్ణాజినం, ముంజిత్రాడు, దండకమండలాలు కల్గిన బ్రహ్మచర్యాన్ని విడిచి ఈ దురవస్థను పొందాడు. ఓ రాజా! యజ్ఞోపవీతాన్నీ, సావిత్రీ దేవినీ, స్నానాన్నీ, సంధ్యనూ, జపాన్నీ వీడి స్త్రీరూపాన్ని పొందిన వీనికి ముందేగతో చెప్పు. నీ వల్ల నా సంతానం నష్టమైంది. నా వేద మార్గాలన్నీ నష్టమయాయి. ఏకైక సుతుడుగల నాకు ముందేగతి కలదో చెప్పు."

ఈ విధంగా పలికిన సారస్వతుని మాటలువిని రాజు సీమంతిని ప్రభావానికి చాలా ఆశ్చర్యపడ్డాడు. తరవాత గొప్ప మహర్షులను పిలిపించి వారల అనుగ్రహంపొంది ఆ బ్రాహ్మణబాలికను పురుషునిగా చేయవేడుకున్నాడు. అప్పుడా మునిశ్రేష్ఠులు "పార్వతీ పరమేశ్వరుల, వారి భక్తుల సంకల్పాన్ని వేరే విధంగా మార్చడానికి ఎంత జితేంద్రియుడికైనా సాధ్యం కాద"ని చెప్పాడు. తరవాత రాజు మునిశ్రేష్ఠుడైన భరద్వాజుని పిలిచి ఆ బ్రాహ్మణోత్తములు తమ కుమారులిద్దరితో కూడి ఆ ముని ఉపదేశప్రకారం అంబికా భవనానికివెళ్ళి రాత్రంతా చాలా నియమంతో పార్వతీదేవిని ఉపాసించారు. ఆ విధంగా మూడురోజులు ఉపవాసంఉండి, జపం, పూజ, హోమం చేస్తున్న ఆ రాజు అనేక విధాలైన ప్రణామస్తోత్రాలచే, ఆపన్నార్తిహరఅయిన పార్వతిని సంతసింపచేశాడు. అప్పుడు ప్రసన్నురాలైన పార్వతి కోటిచంద్రులతో సమానమైన కాంతులతో నిజస్వరూపాన సాక్షాత్కరించింది. "నీకోరిక ఏమని'' రాజును ప్రశ్నించింది. "ఈ చిన్నదానికి పుంస్త్వం అనుగ్రహించు"మని కోరాడు. రాజు అప్పుడామె నా భక్తులు ఒనర్చిన పనిని వేరుగా చేయడానికి వేలసంవత్సరాలైనా ఎవరికీ సాధ్యంకాదు.'' అన్నది. దానికి రాజు

"పూర్వకర్మచేత నష్టసంతానంగల ఈ బ్రాహ్మణుడికి ఒకేఒక కొడుకు. ఆ ఒక్క పుత్రునీ కోల్పోయినప్పుడు ఇతనికి సుఖం ఎక్కడిది" అని ప్రశ్నించాడు. "ఈ బ్రాహ్మణునకు నా అనుగ్రహంవల్ల వేరొక కొడుకు పుడతాడు. ఆ కొడుకు విద్య, వినయం, దీర్ఘాయుస్సు, మంచి ఆశయం కలవాడై వర్ధిల్లుతాడు" అని పార్వతి వరమిచ్చింది. "సామమతి అనే పేరున్న ఈ బ్రాహ్మణకన్య సుమేధసునికి భార్యయై సమస్త భోగాలను అనుభవిస్తుంది." అని చెప్పింది.

సూతుడు పలుకుతున్నాడు: ఈ విధంగా పలికి ఆదేవి అంతర్ధానమయింది. ఆ మహారాజు, బ్రాహ్మణులు తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ సారస్వతుడనే విప్రుడికి పార్వతి దయవల్ల పూర్వపు కుమారుని వంటి ఒక కొడుకు కలిగి సంతోషపెట్టాడు. సారస్వత బ్రాహ్మణుడు సామవతి అనే కన్యకను సుమేధసునకిచ్చి వివాహం చేశాడు. వారిద్దరూ దంపతులై సకలసుఖాలను యథేచ్ఛగా అనుభవించారు. శివభక్తురాలైన రాజు భార్యఅగు సీమంతిని యొక్క, పరమశివుని యొక్క ప్రభావాన్ని మాహాత్మ్యాన్ని వర్ణించి చెప్పాను.

చాలా ఆశ్చర్యం కలిగించే శివభక్తుల మహిమను తిరిగి వినదలిచినవారికి పాపం నశించేటట్లు సంగ్రహంగా వర్ణిస్తాను. అని సూతుడు మహర్షులతో చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో సోమవారవ్రత మహిమాను వర్ణనమనే తొమ్మిదవ అధ్యాయం.

— / —

# దశమోధ్యాయం

సూతుడు చెప్పుతున్నాడు:

'విచిత్రం విశ్వనిర్మాణం । విచిత్రం శివచేష్టితం
విచిత్రం శివమాహాత్మ్యం । విచిత్రం శివభాషితం.'

"ఓ ఋషులారా! ప్రపంచసృష్టి విచిత్రమైంది. పరమేశ్వర వ్యాపారం చాలా విచిత్రమైంది. శివమాహాత్మ్యం ఇంకా విచిత్ర మైంది. పరమేశ్వరుడి వాక్యం చాలా విచిత్రమైంది. నేనిప్పుడు మీకు స్వర్గమోక్షాలకు సాధనమైందీ. భక్తుల పాపాన్ని పోగొట్టేదీ విచిత్ర మైందీ అయిన పరమేశ్వర చరిత్రను చెపుతాను.

అవంతిదేశంలో విషయవాంఛాసక్తుడూ, స్త్రీలోలుడూ, విశే షంగా ధనమార్జించినవాడూ అయిన మందరుడనే ఒక బ్రాహ్మణు డున్నాడు. అతడు స్నానసంధ్యలను విడిచి నీచస్త్రీలతో భోగిస్తూ దుష్టమార్గంలో సంచరిస్తూ గంధమాల్యాంబరప్రియుడై పూర్వం జామీలునిలా ప్రవర్తించేవాడు. పింగళ అనే పేరుగల వేశ్యాంగ నతో రాత్రింబవళ్లు క్రీడిస్తూ ఇంద్రియలోలుడై ఆమె ఇంట్లోనే అతడు నివసించేవాడు. ఒకనాడు అతడా వేశ్య ఇంట్లోఉండగా ధర్మా త్ముడైన ఋషభుడనే పేరుగల ఒక శివయోగి అక్కడికి వచ్చాడు. తను పూర్వపుణ్యమే ఆకారం ధరించివచ్చిన ఆ శివయోగినిచూచి వేశ్యాంగన, బ్రాహ్మణుడు అతడిని పూజించాడు. కంబళిపరచి పీఠంగా ఏర్పాటుచేసి దానిమీద శివయోగిని కూర్చుండబెట్టి పాదాలుకడిగి పాదోదకాన్ని భక్తితో శిరస్సులపై చల్లుకొన్నారు. స్వాగతం, అర్ఘ్యనమస్కారం, గంధపుష్పాక్షతాది షోడశోపచారాలు చేసి అతడికి సంతోషంతో భోజనం పెట్టారు. తరవాత భోజనంచేసి విశ్రాంతి తీసుకుంటున్న శివయోగిని మంచంమీద చక్కగా కూర్చుండబెట్టి వారిద్దరూ సంతోషంగా అతడికి తాంబూలమిచ్చారు.

దైవప్రేరితులై వారిద్దరూ ఆతడి పాదాలుబట్టి శుశ్రూషచేసి సంతోషపెట్టారు. శివయోగి మహాశయుడు ఆ రాత్రి అక్కడేగడిపి ఉదయాన్నే తనదారిన తాను వెళ్ళిపోయాడు.

కొంతకాలం తరవాత ఆ బ్రాహ్మణుడు చనిపోయాడు. ఆ వేశ్యకూడా మరణించి కర్మసంచితమైన గతిని పొందింది. ఆ బ్రాహ్మణుడు దశార్ణ దేశపు రాజయిన వజ్రబాహుని భార్య సుమతి గర్భంలో ప్రవేశించాడు. పెద్దభార్య అయిన ఆ సుమతి గర్భవతి కావడంవల్ల మిగిలిన సవతులామెకు మోసంతో విషంపెట్టారు. అయినా దైవయోగంవల్ల ఆమె మరణించక మృత్యువుకు మించినబాధ ననుభవించింది. 'వనే రణే శత్రు జలాగ్ని మధ్యే మహార్ణవే పర్వతమస్తకేవా సుప్తం ప్రమత్తం విషమస్థితంవా రక్షంతి పుణ్యాని పురాకృతాని' అడవిలో, యుద్ధంలో, శత్రువుల మధ్యంలో, నీటిలో, అగ్నిలో, సముద్రంలో, పర్వతశిఖరాన ప్రమత్తుడై నిద్రిస్తూఉన్నా విషమస్థితిలోఉన్నా పూర్వపుణ్యాలు తప్పక రక్షిస్తాయి.

కాబట్టి కొంతకాలానికి ఆ రాణి ఎక్కువైన ప్రసవవేదన అనుభవించి ఒక కొడుకును కన్నది. గర్భంలో ఉండగా జరిగిన విష ప్రయోగంవల్ల పుట్టినప్పటినుండి ఆ శిశువు రాత్రింబవళ్ళు చాలా బాధపడ్డది. తల్లీబిడ్డలకు శరీరమంతా వ్రణాలు కలిగి చాలా వ్యథ కలిగించాయి. రాజు ఎందరు వైద్యులను రప్పించి మందులు ఇప్పించినా ఫలితం లేకపోయింది. పుత్రుడివల్ల కలిగిన దుఃఖంవల్ల రాణి రోజురోజుకూ కృశించి రాత్రిళ్ళు నిద్రకూడా పోయేదికాదు. ఆ విధంగా కొన్నిమాసాలు గడిచిన తరవాత రాజు మృతప్రాయులుగా తయారైన ఆ తల్లీబిడ్డలను గూర్చి ఆలోచిస్తూ "ఈ నా భార్యాపుత్రులు నరకలోకంనుండి వచ్చినవారిలా రోగంతో బాధపడుతూ ఏడుస్తూ ఎవ్వరికీ నిద్రలేకుండా చేస్తున్నారు. బ్రతకడానికిగానీ, చని

పోవడానికిగానీ సమర్థులుకాక నీళ్ళు కాలం గడుపుతున్నారు. కాబట్టి పాపాత్ములైన వీరిద్దరి విషయంలో మంచి ఉపాయమేదైనా యోచించాలి." అని నిశ్చయించి ఇతర భార్యాసక్తుడై రోగపీడితురాలైన ఆ భార్యనూ పుత్రుణ్నీ రథంమీద దూరంగా తీసుకొనిపోయి విడిచిరమ్మని సారథిని ఆజ్ఞాపించాడు. ఆ సారథి జనసంచారంలేని ఒక అడవిలో విడిచిపెట్టగా వారిద్దరూ భయభ్రాంతులై ఆకలిదప్పికలచే చాలాబాధపడ్డారు. రాణికొడుకు నెత్తుకొని పడుతూలేస్తూ నిట్టూరుస్తూ భయభ్రాంతురాలై తనను నిందించుకొంటూ ముళ్లుగుచ్చుకొని బాధపడుతూ వీడిపోయిన కొప్పుతో నడవసాగింది. ఒకచోట క్రూరమైన పెద్దపులుల అరపులు, మరొకచోట త్రాచుపాముల బుసలు, వేరొకచోట పిశాచాలు-భేతాళాలు - బ్రహ్మరాక్షసులు. వీటివల్ల కలిగిన భయంవల్ల ఆమె వేగంగా పరుగులెత్తింది. కత్తులలాంటి రాళ్ళతో బీటలుతీసిన పాదాలతో మహాభయంకరమైన అరణ్యంలో ఆమె సంచరించి చివరకు దైవయోగంవల్ల గోవులూ, గుర్రాలూ, మనుషులు తిరిగే ఒక వైశ్యులవీధికి చేరింది. చాలా మంచిస్త్రీలున్న ఒక ప్రదేశానికి ఆమె వెళ్ళింది. ఆ పట్టణాన్ని పద్మాకరుడనే ఒక వైశ్యు డేలుతున్నాడు. అతడు ధనంలో రెండవ కుబేరుడులా ప్రకాశించాడు. ఆ వైశ్యుడి ఇంట్లో పనిచేస్తున్న ఒకదాసి దూరంనుండి వస్తున్న ఆ రాజభార్యనుచూచి దగ్గరగా వెళ్ళింది. పుత్రుడితో కలిసి చాలా బాధపడుతున్న ఆమె వృత్తాంతాన్ని అడిగి తెలుసుకొని ఆమె తన యజమానివద్దకు తీసుకొనిపోయింది. ఆమె వృత్తాంతాన్ని విని అతడు చాలా బాధపడ్డాడు. తన ఇంటికి దగ్గరలోఉన్న మరోఇంట్లో ఆమెను కొడుకుతో పాటు ఉంచటానికి ఏర్పాటుచేసి అన్నపాన వస్త్రాదుల నిప్పించి అతడు ఆమెను తల్లిగా భావించి పూజించాడు. అక్కడ సుఖంగా ఉన్నప్పటికీ ఆమె కొడుకుకు పెద్ద

కురుపులులేచి క్షయ మొదలైన రోగాలకు ఉపశాంతి కల్గక ఎన్ని మందులిచ్చినా లాభంలేక చివరకు విధివశాత్తు మరణించాడు. దాంతో ఆమె చాలా దుఃఖించి మూర్ఛిల్లి ఏనుగుచే త్రుంచబడ్డ తీగలా భూమిపై పడిపోయింది. కొంతకాలానికి దైవయోగంవల్ల తెలివినిపొంది కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వైశ్యాంగనలు ఓదార్చినా ఊరటచెందక "ఓ నా తండ్రీ! కొడుకా! నా ప్రాణరక్షకా! రాజవంశాంబుధిసోమా! ఆనందవర్ధనా! దిక్కులేనిదీనురాలూ, నీకోసం బంధవులందరినీ విడిచిపెట్టినదీ అయిన నీ తల్లి నివీడి ఎక్కడకు పోయావురా" అంటూ విలపించింది.

సూతుడు చెపుతున్నాడు! ఈ విధంగా చాలా దుఃఖిస్తున్న ఆ దీనురాలిని ఎవరూ ఓదార్చలేకపోయారు. ఆ సమయంలో ఋషభుడనే పూర్వ శివయోగి అక్కడకు వచ్చాడు. ఆతడు వైశ్యప్రభువుచే సత్కరింపబడి దుఃఖిస్తున్న ఆ రాజభార్యకడకువచ్చి "ఓ చిన్న దానా! తెలివితక్కువగా ఎందుకు విచారిస్తున్నావు? ముందుగా ఎవడు జన్మించాడు? ఎవడు మరణించాడు. చెప్పు. ఈ శరీరం మొదలైనవి మేఘాలతో సమానమైనవి. ఒకప్పుడు ప్రకాశిస్తాయి. మరొకప్పుడు నశిస్తాయి. ఒకప్పుడు మళ్ళీ ఉద్భవిస్తాయి. అందుకే ఈ శరీరం మరణిస్తే విచారించడానికి అవసరంలేదు. కాబట్టి విద్వాంసులు మోహపడరు. భూతాలు సత్త్వాది గుణాలచేతనే చూడబడుతున్నాయి. తమతమ కర్మలచేత సంచరిస్తున్నాయి. కాలపురుషుడిచేత ఆకర్షింపబడుతున్నాయి. సంస్కారంలో లీనమవుతున్నాయి. సత్త్వాదిగుణత్రయం మాయవల్ల పుడుతున్నది. ఆ గుణాలచేతనే సత్త్వాదిగుణాల చిహ్నాలుగల ప్రాణుల దేహాలు జన్మిస్తున్నాయి. సత్త్వగుణంవల్ల దేవతారూపం, రజోగుణంవల్ల మానవరూపం, తమోగుణంవల్ల పశుపక్ష్యాదిదేహాలు కల్గుతు

న్నాయి. కాని సర్వప్రాణులూ జన్మాంతర సంస్కారానికి వశులై ప్రవర్తిస్తున్నారు. ఈ సంసారచక్రంలో తిరుగుతున్న జంతువు పూర్వజన్మార్జిత కర్మవశంవల్ల ఆలోచింప శక్యంగాని, సుఖదుఃఖ రూపగతిని పొందుతున్నది. కల్పంవరకూ ఆయుర్దాయంకల దేవత లకే ఆపదలు కల్గుతుండగా కర్మబద్ధులైన శరీరధారులను గూర్చి చెప్పేదేముంది ? కొందరు దేహానికి కాలమే కారణమని అంటారు. మరికొందరు కర్మకే ప్రాధాన్యమిస్తున్నారు. వేరొకకొందరు గుణా లనే కారణంగా చెపుతున్నారు. ఈ దేహం సామాన్యమైంది. కాల కర్మగుణాధీనమైంది, పాంచభౌతికమైంది. కాబట్టి పండితులు శరీరో త్పత్తినిచూచి ఆనందించరు. మృతిచెందినపుడు దుఃఖించరు. ఈ దేహం అవ్యక్తంవల్లపుట్టి దానియందే లీనమవుతున్నది. ఆ మధ్యకాలంలో నీటిబుడగలా స్పష్టమైనదానిలా ప్రకాశిస్తున్నది. ఎప్పుడు జీవి గర్భంలో ప్రవేశిస్తుందో అప్పుడే దానికి వినాశం కల్పించబడింది. దైవసంబంధంవల్ల జీవిస్తే వెంటనే మరణం చెందుతుంది. కొందరు గర్భంలోనే నశిస్తారు. కొందరు పుట్టినవెంటనే నశిస్తారు. కొందరు యుక్తవయస్సు వచ్చినతరవాత నశిస్తారు. కొందరు వార్ధక్యంలో మరణిస్తారు. 'యాదృశం ప్రాక్తనం కర్మతాదృశం విందతేవపుః భుక్తే తదనురూపాణి సుఖదుఃఖాని దేహ్యసౌ,' దేహధారి తానుచేసిన పూర్వకర్మ ననుసరించి దేహాన్నిపొంది దానికనురూపమైన సుఖ దుఃఖాలను పొందుతున్నాడు. తల్లిదండ్రుల మాయాసామర్థ్యంవల్ల సంభోగాన్ని అనుసరించి స్త్రీ పున్నపుంస రూపమైన ఒకానొక దేహం పుడుతున్నది. ఆయుస్సు, సుఖం, దుఃఖం, పుణ్యం, పాపం, విద్య, ధనం—వీటినన్నింటినీ బ్రహ్మదేవుడు లలాటాన వ్రాసినట్లుగ జంతువు పుడుతుంది. కర్మలు దాటశక్యంకావు. కాలం బ్రహ్మస్వరూపం. భావాలు నిత్యంకావు.

కాబట్టి నీవు శోకించవద్దు. స్వప్నంలో స్థిరత్వం, గారడీ విద్యలో యథార్థం, శరత్కాల మేఘంలో నిత్యత్వం, శరీరంలో శాశ్వతత్వం ఎక్కడున్నాయి? నీకు నూరుకోట్ల జన్మలు గడిచాయి. పరతత్త్వస్వరూపం తెలియక నీకు ఈ చిత్రవిభ్రమం కలిగింది. ఎవనికి నీవు కూతురవు? ఎవనికి తల్లివి? ఎవనికి భార్యవు? ఎవరికి వశవర్తినివి? చెప్పు. పంచభూతాత్మకమైన ఈ శరీరం చర్మం, రక్తం, మాంసం ముద్దలతో కూడింది. మేధ మజ్జ అనే మాంసం, ఎముకలతో మూత్రపురీషాలతో శ్లేష్మాలతో కూడిఉంది. తాను చేసిన కర్మవల్ల లభించినదానినిగా ఈ శరీరాన్ని తలచి నీ కుమారునిగూర్చి ఏ మాత్రం విచారించకు. లోకంలో ఏ మనుష్యుడైనా ప్రయత్నంవల్ల మృత్యువును జయించగలిగితే పూర్వమున్న విద్వాంసులు ఆపదలను ఎందుకు పొందుతారు? తపస్సు, విద్య, బుద్ధి, మంత్రాలు, ఔషధం, రసాయనాలు సేవించి ఏ పండితుడూ మరణాన్ని అతిక్రమించలేడు. నేడో రేపో ఎల్లుండో ఈ జీవికి మరణం స్థిరం. కాబట్టి అశాశ్వతమైన ఈ దేహం గూర్చి దుఃఖించడం ఎంతమాత్రం తగదు. నిత్యమూ మరణం స్థిరమైఉండగా ప్రాణులకింక సుఖమెక్కడఉంది? పెద్దపులి ఎదురుగా ఉండగా పశువులకు ఆహారం ఇష్టమవుతుందా? చెప్పు. అందువల్ల జరామరణాలను జయించదలిస్తే నీవు మృత్యుంజయుడూ, ఉమాపతి అయిన సర్వేశ్వరుని శరణువేడు. పరమేశ్వర పాదారవిందాలను శరణుకోరినవారికి జరామరణాలవల్లగాని, ఇతరత్రాగాని భయండుండదు. అతిభయంకరమైన ఈ సంసారంలో దుఃఖాలను అనుభవించి మనస్సు ఎప్పుడు విరక్తి పొందుతుందో అప్పుడే మహేశ్వరుని ధ్యానించాలి. మనస్సులో శివధ్యాన రసామృతపానం చేసేవారికి విషయసుఖాస్పదమైన సంసారంమీద మళ్ళీ కోరిక పుట్టదు. సకలభోగాలను విడిచి మనో

వైరాగ్యం కలిగిన మానవుడి మనస్సుకు శివపాదారవింద భక్తి కలిగితే ఆ నరుడికి పునర్జన్మలేదు. శివపాదారవిందధ్యానపైక సాధన మైన నీ మనస్సును శోకమోహాలలో పడద్రోయకు. పరమేశ్వరుని సేవించు" అని చెప్పాడు.

ఈ విధంగా శివయోగిచే జ్ఞానోపదేశం పొందిన ఆ వనితా రత్నం విరక్తినిపొంది పరమేశ్వర పాదారవిందాలకు నమస్కరించి "ఓ మునీంద్రా! మృతుడైన పుత్రుడు కలదానిని బంధువులచే విడువబడినదానిని, మహారోగ పీడితురాలను. ఇప్పుడు మరణించడం కన్నా నాకు వేరేగతి ఏముంది? ఈ పిల్లవాడితోపాటు ఇప్పుడు నేనుకూడా మరణించాలనిఉంది. అటువంటి సమయంలో మీ దర్శనం కలిగి ధన్యనయాను." అని చెప్పింది.

సూతుడు చెపుతున్నాడు:

ఆ మాటలువిన్న దయానిధిఅగు ఆ యోగీశ్వరుడు తనకు ఆమె పూర్వం ఒనర్చిన భక్తిపూర్వక పూజాదులను గుర్తుతెచ్చు కొని మృతుడైన ఆ పిల్లడిదగ్గరకు వెళ్లాడు. మంత్రించిన విభూతిని కళావిహీనమైన ఆ పిల్లడి ముఖంమీదచల్లి వాడిని పునర్జీవితుణ్ణి చేశాడు. ఆ పిల్లడికి ప్రాణంవచ్చి నెమ్మదిగా కళ్లువిప్పి సర్వేంద్రియ జ్ఞానంకల్గి తల్లిపాలకు ఏడ్చాడు. చనిపోయినవాడు మళ్ళీ బ్రతికి ఏడ్వడంచూచి రాజు మొదలైనవారందరూ ఆశ్చర్యపడ్డారు. సంతో షించారు. తరవాత ఆ రాజు భార్య చాలా సంతసించి పరవశించి ఆనందబాష్పధారా లోచనయై ఆతడిని ఎత్తుకుంది. కొడుకును చంక నెత్తుకొని మార్గాయాసంవల్ల నిద్రించినదానిలా తననుగానీ, ఇతరు లనుగానీ ఎరుగుని స్థితిని పొందింది. ఋషభుడనే ఆ శివయోగి ఆ తల్లీబిడ్డలకుఉన్న కుష్ఠవ్రణాలమీద విభూతిచల్లి చేతితో స్పృశిం

చాడు. అప్పుడు వారిద్దరూ దివ్యశరీరాలుపొంది చాలా ప్రకాశించే దేవస్వరూపాలను పొందారు. పుణ్యాత్ములుపొందే దేవేంద్రుడి ఐశ్వర్యసుఖంకన్నా నూరురెట్లధికమైన సుఖాన్ని వారు పొందారు. తన పాదాలమీదబడిన ఆ చిన్నదానిని దయాంతరంగుడై ఋషి లేవనెత్తి ఓదార్చాడు. "ఓ మహారాణీ! చిరకాలం జీవించు. ఈ లోకంలో ఎంతకాలం జీవిస్తావో అంతకాలం ముసలితనం పొందవు. ఓ సతీమణీ! ఈ నీ కుమారుడు భద్రాయువనే పేరుతో ప్రపంచ ఖ్యాతినిపొంది రాజ్యపాలన చేస్తాడు. నీ కొడుకు సకలవిద్యలలో ప్రావీణ్యతను పొందేవరకూ నీవు ఈ వైశ్యరాజు ఇంటిలోఉండు." అని చెప్పాడు.

సూతుడు చెపుతున్నాడు: ఈ విధంగా ఋషభయోగి రాజు భార్యనూ, కుమారుణ్ని తన మంత్రించిన విభూతి సామర్థ్యంవల్ల బ్రతికింపచేసి తిరిగి తన ఇష్టానుసారం వెళ్ళిపోయాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో సోమవారవ్రత మహిమానువర్ణనమనే పదియవ అధ్యాయం.

— / —

## ఏకాదశోధ్యాయం

సూతుడు చెప్పుచున్నాడు:

"ఓ మహర్షులారా! నేను పూర్వంచెప్పిన పింగళా అనే పేరుగల వేశ్యాంగన శివభక్తుడగు ఋషభయోగిని పూజించిన పుణ్య మహిమవల్ల తన పూర్వదేహాన్ని విడిచి చంద్రాగద మహారాజు భార్య అయిన సీమంతినికి జన్మించి, అందచందాలతో, సద్గుణాలతో

కీర్తిమాలిని అనే పేరుతో విలసిల్లింది. అక్కడే భద్రాయువనే పేరు గల రాకుమారుడు వైశ్యపతిఇంట గ్రీష్మఋతువులోని సూర్యుడిలా ప్రకాశిస్తున్నాడు. వైశ్యరాజు గొప్ప కొడుకు సునయనుడు భద్రాయువునకు స్నేహితుడయ్యాడు. వారిద్దరూ అన్యోన్యమైత్రితో రత్నాలంకారాలు ధరించి ఆడుకోసాగారు. ఆ వైశ్యరాజు రాజకుమారునికి బ్రాహ్మణులచే క్షత్రియోచితమయిన కర్మలను శాస్త్రయుక్తంగా చేయించాడు. యుక్తవయస్సులో ఉపనయనం చేయబడి ఆ బాలురిద్దరూ గురువులకు భక్తితో శుశ్రూష చేసి వినయవంతులై సర్వవిద్యలూ అభ్యసించారు. రాజకుమారుడికి పదహారవ సంవత్సరం రాగానే ఋషభుడనే ఆ యోగీశ్వరుడు వైశ్యరాజింటికి వచ్చాడు. రాజు భార్య, ఆమె కుమారుడు చాలా సంతోషించి యోగీశ్వరునకు నమస్కరించి పూజించారు. అతడు సంతోషించి రాజకుమారునితో "నాయనా! నీకు క్షేమమేనా? మీ అమ్మ ఆరోగ్యంగాఉందా!' సమస్త విద్యలూ సంపూర్ణంగా అభ్యసించావా? గురువులకు శ్రద్ధగా శుశ్రూష చేస్తున్నావా? నన్నూ నీ ప్రాణమిత్రుడగు గురువును స్మరిస్తున్నావా?" అని ప్రశ్నించాడు.

అప్పుడు ఆ రాజమహిషి తన కుమారుని ఆతని పాదములపై పడవేసి "గురువర్యా! వీడు నీ కుమారుడు. నీవు వీడికి ప్రాణాధికుడైన తండ్రివి. దయాంతరంగుడవగు నీ వీతని నీ శిష్యుడిగా గ్రహించు. బంధువులందరికీ దూరంగాఉన్న నన్ను రక్షించు. నీ వీతనికి సన్మార్గం ఉపదేశించడానికి తగుదువు" అని ప్రార్థించింది. ఆ శివయోగి రాజకుమారుడికి సన్మార్గాన్ని ఉపదేశించాడు. "వేద శాస్త్రపురాణాలలో చెప్పబడినదీ పురాతనమైనదీ అయిన ధర్మాన్ని తమతమ వర్ణాశ్రమధర్మాల కనుకూలంగా జనులందరూ సేవించాలి. నీవు సన్మార్గాన్ని అనుసరించు. సత్పురుషులు నడిచిన మార్గంలో

సంచరించు. దేవశాసనాన్ని ఎప్పుడూ అతిక్రమించకు. దైవాన్ని పరిహాసంచేయకు. గోవులపట్ల, గురువులపట్ల, విప్రులపట్ల ఎప్పుడూ భక్తికల్గిఉండు. లభించని వస్తువుకోసం ఆశపడకు. చండాలుడైనా తనంతటతానుగా వచ్చిన అతిథిని సజ్జనుడివలెనే గౌరవించు. ప్రాణ సంకటమేర్పడినా సత్యాన్ని వీడకు. గోబ్రాహ్మణులను రక్షించడం కోసం ఎప్పుడైనా అబద్ధంపలుకు. పరద్రవ్యమందూ, పరస్త్రీల యందు, దేవబ్రాహ్మణ వస్తువులయందు ఆశనువీడి సమస్త విధాలైన డాంబికాన్ని విడిచిపెట్టు. సత్కథలయందూ, సదాచారాల యందు, మంచి వ్రతాలయందు, సజ్జనప్రాప్తియందు, ధర్మాది మంచి కార్యాలయందు బుద్ధిని ప్రవేశపెట్టు. స్నానం, జపం, హోమం, స్వాధ్యాయం, పితృతర్పణం, గోవులు, బ్రాహ్మణులు, అతిథిపూజ–వీటిపట్ల జాగ్రత్తవహించు. కోపం, ద్వేషం, భయం, చాడీలు చెప్పడం, దుష్టసహవాసం, కుటిలత్వం, మోహం, తొందరపాటు– వీటిని విడిచిపెట్టు. రాజధర్మాన్ని అనుసరించినా వ్యర్థంగా దేనినీ హింసించకు. అకారణమైన శత్రుత్వం, వ్యర్థమైన తాపం, పరనింద–వీటిని విడిచిపెట్టు. వేటాడడం, జూదం, మద్యపానం, పరస్త్రీ సహవాసం మొదలైన దుర్విషయాలపట్ల ఆసక్తిచూపేవారియం దెప్పుడూ మనస్సు మరల్చకు. సుఖంపొందేవారితో సహవాసం చెయ్యి. దుఃఖంచేవారిపట్ల దయచూపించు. పుణ్యాత్ములనుచూచి ఆనందించు. దుర్బుద్ధిగలవారిపట్ల ఔదాసీన్యం వహించు. అధిక భోజనం, మహాకోపం, అతినిద్ర, అతిశ్రమ, అతిసంభాషణం, అధికక్రీడాసక్తి ఎల్లప్పుడూ విడిచిపెట్టు. విద్యలయందు ఎక్కువ పాండిత్యం, అధికమైనశ్రద్ధ, అమితమైన పుణ్యం, సజ్జనవాక్య మందు అధికశ్రవణం, అత్యుత్సాహం, అతిఖ్యాతి, మంచిధైర్యం వీటిని సంపాదించు. నిజభార్యలపట్ల ప్రేమకల్గిఉండు. నీ శత్రువుల

యందు క్రోధం ప్రకటించు. పుణ్యసముదాయమందు ఆసక్తి కల్గి ఉండు. ధర్మంలేనివారిని సహింపకు. పాపండులపట్ల శత్రుత్వం వహించు. సజ్జనులపట్ల అనురాగం కలిగిఉండు. దుష్టమంత్రిని చేర దీయకు. కపటవాఖ్యాలను ఆలకించకు. ధూర్తుడూ, దంభంకల వాడూ, అసహ్యంగా గోతులుతీసే వాడు, క్రూరుడు, వంచకుడు, చంచ స్వభావుడు, పాపాత్ముడు, నాస్తికుడు, బాలుడు– వీరిని దగ్గరకు చేరనీకు. ఆత్మస్తుతికి పాల్పడకు, పరేంగితజ్ఞానం కలిగిఉండు. భార్య, పుత్రులు, ధనం– వీటిపట్ల అత్యాశ విడిచిపెట్టు. భార్య, పతివ్రత, తల్లిదండ్రులు, సత్పురుషులు, గురువులు– వీరి మాటయందు విశ్వా సం ఉంచు. నీ వెప్పుడూ ఆత్మరక్షణ విషయంలో అప్రమత్తుడవై ఉండు. దృఢనియమం కల్గిఉండు. ఎప్పుడూ నీభృత్యులను నమ్మి ఉండకు. నమ్మదగిన దొంగవానిని చంపకు. మంత్రులపట్ల సంశ యించకు. సత్యాన్ని తప్పకు. దిక్కులేనివాడు, దీనుడు, వృద్ధుడు, స్త్రీ, బాలుడు– వీరిని ధనంచేగానీ, ప్రాణాలచేగాని, శక్తిచేతగాని, బలంచేతగానీ లేక అన్నింటిచేగాని రక్షించు. వధార్హుడైనా శరణు గోరిన శత్రువును చంపకు. పాత్రుడైనా, అపాత్రుడైనా, నీచుడైనా, గొప్పవాడైనా సరే నిన్ను యాచించినవాడికి నీ శిరస్సునైనా సమర్పించు. ఎంత కష్టపడిఅయినా కీర్తి సంపాదించు. మహారాజు లకు, విద్వాంసులకు కీర్తియే అలంకారం. లక్ష్మి, పుణ్యం సత్కీర్తి వల్లనే లభిస్తాయి. వెన్నెలవల్ల చంద్రుడు ప్రకాశించినట్లు రాజు సత్కీర్తివల్ల లోకం ప్రకాశిస్తుంది. దుష్కీర్తివల్ల లభించిన ఏను గులు, గుర్రాలు, బంగారపుకాసులు, రత్నరాసులు_గడ్డిపరకలా వెంటనే విడిచిపెట్టు. తల్లిదండ్రులు, గురువు, వీరికోపాన్ని సహించు. నీ పుత్రుల అపరాధాన్ని, బ్రాహ్మణుల తప్పునూ సైరించు. కోపపడినపుడు తిరిగి కోపం వహించకు. బ్రాహ్మణుల కనుగ్రహం వచ్చేటట్లు ఎప్పుడూ వారికి హితంగా సంచరించు. రాజుల కేఆపద

వచ్చినా తొలగించడానికి బ్రాహ్మణులు సమర్థులు. ఆయుర్దాయం, బలం, కీర్తి, సౌఖ్యం, ధనం, పుణ్యం, సంతానం ఏ కర్మ వల్ల లభిస్తాయో ఆ కర్మనే ఎప్పుడూ ఆచరించు. దేశం, కాలం, కార్యాకార్యాలు బాగా విమర్శించి పనిచేయాలి. ఎవరికీ బాధ కలిగించకు. ఇతరులబాధను పోగొట్టు. శక్తిమంతుడవై దొంగలను, దుష్టులనూ, శత్రువులను బాధించు. స్నానం, జపం, హోమం, దైవపూజ, పితృపూజ- వీటిపట్ల ఆసక్తి కల్గిఉండు. నిద్రయందూ, భోజనమందూ తొందరకల్గి ఉండు. దాక్షిణ్యంతో కూడినది, రహస్యం గానైనా అపకారంలేనిదీ, యథార్థమైందీ, సర్వజనులకు మనోహర మైంది, అలాక్షరాలలో విశేషార్థంకలదీ అయిన వాక్యం పలుకు. శత్రువులవల్ల, ఆపదలవల్ల ఎప్పుడూ భయపడకు బ్రాహ్మణవంశ మందు, పాపమందు గురువుల ఆజ్ఞయందు భయంకల్గి ఉండు. జ్ఞాతులు, బంధువులు, మిత్రులు, భార్యాపుత్రాదులు, పంక్తి భోజనం- వీటన్నింటియందు సమభావంతో ప్రవర్తించు. సజ్జనుల హితోపదేశాలపట్ల పుణ్యకథలపట్ల, విద్యాగోష్ఠులపట్ల, ధర్మకార్యా లపట్ల, ఎప్పుడూ విముఖతచూపకు. పరిశుభ్రమైన, పవిత్రమైన, ప్రసిద్ధమైన శివరూపమగు పరమేశ్వరుని నీ చిత్తమందెల్లప్పుడూ నిల్పుకో. కులటలు, వేశ్యలు, కాముకులు నివసించేచోట అనగా దుర్దశకు కారణమైన నీచులకు స్థానమైన ఆ చోట్లలో ఎప్పుడూ వసిం చకు. నీవు ముల్లోకాధిపతి అయిన ఒక్క శివుణ్ణే ఆశ్రయించినవాడ వైనా, సర్వదేవతలను ఉపాసిస్తూ ఆయా పర్వదినాలను గౌరవించు. ఎప్పుడూ పరిశుద్ధుడవై, సమర్థుడవై, అధ్యక్షుడవై, ధైర్యంకల్గి కామక్రోధాది షడ్వర్గాలను జయించి పరమేశ్వర ధ్యానంలో నిశ్చల మైన మనస్సు కల్గిఉండు. వేదవేత్తలగు బ్రాహ్మణులకు, శాంతులై నిష్ఠాగరిష్ఠులైన సన్న్యాసులను, పుణ్యవృక్షాలను, పుణ్యనదులను, పుణ్యతీర్థాలను, గొప్ప సరస్సులను, గోవును, వృషభానికీ, రత్నా

నికీ, పతివ్రతను, ఇలవేలుపులను నమస్కరించు. బ్రాహ్మీకాలంలో మేల్కొని ఆచమనం చేసి, నిర్మలమైన మనస్సుతో నీ గురువునకు నమస్కరించి, ఉమాపతియగు శంకరుని, శ్రీమన్నారాయణుని, బ్రహ్మను, విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, పార్వతిని, మహాలక్ష్మిని, సరస్వతిని, ఇంద్రాది లోకపాలకులను, పుణ్యాత్ములగు మహర్షులను ధ్యానించి పిమ్మట ఉదయిస్తున్న సూర్యభగవానునకు నిత్యమూ నమస్కరించు. గంధం, పువ్వులు, తాంబూలం, శాకాలు, ఫలాదులు– వీటిని పరమేశ్వరుడికి నివేదించి నూత్నమైన ఇష్టమైన భోజనాన్ని భుజించు. నీవు చేసిన దానం, నీవుచేసినకర్మ, నీ జపం, నీ స్నానం, నీ హోమం, నీవు స్మరించిన స్మరణ, నీవు చేసిన తపస్సు అన్నింటినీ పరమేశ్వరునకు అర్పించు. భుజించేటప్పుడు, తిరిగేటప్పుడు, నడిచేటప్పుడు, పడుకునేటప్పుడు, విహరించేటప్పుడు, చూస్తూ, వింటూ, పలుకుతూ, గ్రహిస్తూ అన్ని సమయాల్లో పరమేశ్వరునే ధ్యానించు. దండాలవంటి రెండు చేతులకూ రుద్రాక్షలనే హస్తాభరణాలుగా ధరించి, లలాటభాగాన స్వచ్ఛమైన విభూతిరేఖలను ధరించి, మంత్రరాజమైన పంచాక్షరీ మంత్రాన్ని పఠిస్తూ పరాత్పరుడైన ఆ శంకరుణ్ని ధ్యానించి శరణుకోరు.

ఇతరములైన శ్రుతిస్మృతి పురాణాలలో బాగా విస్తరించి చెప్పబడిన ధర్మాన్ని నీకు తేలికగా బోధపడేటట్లు సంక్షేపంగా చెప్పాను.

పిమ్మట లోకోత్తరమైన, సమస్త పురాణాలలో రహస్యమైన, సమస్త పాపరాశిని హరించే పవిత్రమైన జయాన్ని సమకూర్చే, సకలాపత్తులను పోగొట్టే శివకవచాన్ని నీ క్షేమంకోరి నీకు ఇప్పుడు ఉపదేశించడానికి నిశ్చయించాను.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తర ఖండంలో సకలధర్మాను వర్ణనమనే ప్రసిద్ధమైన పదకొండవ అధ్యాయం.

# ద్వాదశోధ్యాయం

ఋషభుడు చెప్పుతున్నాడు: ప్రపంచమంతా వ్యాపించిన వాడూ, మహాదేవుడూ అయిన శివుడికి నమస్కరించి సర్వరక్షాకర మైన శివకవచాన్ని చెపుతున్నాను. మానవుడు శాస్త్రోక్తంగా పరిశుభ్రమైన ప్రదేశంలో ఆసనాన్ని కల్పించుకొని జితేంద్రియుడై వాయువును బంధించి శివుని ధ్యానించాలి. హృత్పద్మమందు నివసించువాడూ, తన తేజస్సుచే ఆకాశమంతటా నిండినవాడూ, ఇంద్రియాతీతుడూ, సూక్ష్మస్వరూపుడూ, ఆద్యంతరహితుడూ, పరమానంద స్వరూపుడూ అయిన మహేశ్వరుని ధ్యానించాలి. నిరంతర ధ్యానంవల్ల సర్వకర్మబంధాలూ నశించి చిదానందస్వరూపునిపట్ల లగ్నమైన మనస్సుకల మానవుడు షడక్షర మంత్రజపంలో నిశ్చలాంతఃకరణుడై శివకవచంచే రక్షణచేసుకోవాలి. సమస్త దేవతా స్వరూపుడైన పరమేశ్వరుడూ, మహాభయంకరమైన సంసారమనే నూతిలోపడిన నన్ను రక్షించుగాక. లోకోత్తరమూ, మహామంత్రానికి మూలకారణమూ అయిన ఆయన నామం నా హృదయంలోని సమస్త పాపాలనూ తొలగించుగాక. జ్యోతిస్స్వరూపానందాలచే పరమ చిత్స్వరూపుడైన విశ్వమూర్తి సర్వత్రా నన్ను రక్షించుగాక. పరమాణు స్వరూపుడూ, గొప్పశక్తిమంతుడూ, అద్వితీయుడు అయిన ఈశ్వరుడు అన్ని భయాలనుండి నన్ను రక్షించుగాక, భూమిరూపమున విశ్వాన్ని భరిస్తున్న, కైలాసవాసి, అష్టమూర్తి అయిన ఈశ్వరుడు నన్ను భూమియందు రక్షించుగాక. జలరూపాన మానవులకు జీవనమును చేయుచున్న శంకరుడు జలములవల్ల నన్ను రక్షించుగాక. కల్పాంతమున సమస్త లోకాలను దహింపజేసి గొప్ప విలాసంకలవాడై నాట్యంచేయు అట్టి కాలరుద్రుడు దవాగ్ని, వాయు సముదాయం మొదలైన సకలభయాలనుండి సమస్తతాపాలనుండి నన్ను రక్షించుగాక.

ప్రకాశిస్తున్న మెఱుపులు, బంగారంలా శోభిల్లేవాడు, విద్య, వరం, అభయం, గొడ్డలి– వీటిని హస్తమున ధరించినవాడు, నాల్గు ముఖాలు, త్రినేత్రాలు కలిగిన సత్పురుషు డనేపేరుగల పరాత్పరుడు తూర్పుదిక్కునుండి నన్ను కాపాడుగాక! గొడ్డలి, ఖేటు, అంకుశం, పాశం, త్రిశూలం, కపాలమాల, అగ్నికణాలను ధరించేవాడూ, చతుర్ముఖుడూ, నల్లటికాంతికలవాడూ, అఘోరుడనే పేరుగల త్రినేత్రుడు దక్షిణదిక్కున నన్ను రక్షించుగాక! మల్లెమొగ్గ, చంద్రుడు, శంఖం, స్ఫటికమాల– వీటివలె ప్రకాశించేవాడు, వేదం, జపమాల, వరదం, అభయం గుర్తులుగా కలవాడు, త్రినేత్రాలూ, చతుర్ముఖాలు గలవాడు, గొప్ప ప్రభావంకలవాడు అయిన సద్యోజాతుడనే పేరుగల ఈశ్వరుడు పశ్చిమ దిక్కునందు నన్ను రక్షించుగాక! వరం, జపమాల, అభయం, పులి– వీటిని హస్తాలలో ధరించినవాడు, సరోజాల పుష్పాడితో సమానమైన కాంతికలవాడు, త్రిలోచనుడు, అందమైన నాలుగు ముఖాలుకల వాడు అయిన వామదేవుడనే పేరుగల శివుడు ఉత్తరదిక్కునందు నన్ను రక్షించుగాక! వేదాలు, అభయం, ఇష్టమైన అంకుశం, టంకం, పాశం, కపాలం, ఢక్క, అప్రతిహతమైన శూలం ధరించిన వాడు, తెల్లనికాంతి కలవాడు, సాటిలేని ప్రకాశంకలవాడు అయిన ఈశానుడనే పేరున్న శివు డూర్ధ్వభాగాన నన్ను రక్షించుగాక! చంద్రమౌళీశ్వరుడు నా శిరస్సును రక్షించుగాక! ఫాలనేత్రుడు నా లలాటమును రక్షించుగాక! సూర్యనేత్రాన్ని హరించిన శంకరుడు నా నేత్రాలు రక్షించుగాక! విశ్వనాథుడు నా ఘ్రాణాన్ని రక్షించు గాక! వేదాలచే గానం చేయబడ్డ కీర్తిగల పరమేశ్వరుడు నా శ్రోత్రాలను రక్షించుగాక! కపాలధారి నా కపోలాలను రక్షించు

గాక! పంచవక్త్రుడు నా ముఖాన్ని ఎప్పుడూ రక్షించుగాక! వేద జిహ్వుడు నా నాలుకను రక్షించుగాక! దక్షయజ్ఞనాశకుడు నా వక్షస్థలాన్ని రక్షించుగాక! ధర్మబాహుడు నా బాహువులను రక్షిం గాక! మేరువును ధనువుగాగలవాడు నా ఉదరాన్ని రక్షించుగాక! వినాయకుని తండ్రి అయిన శంకరుడు నా నాభిని రక్షించుగాక! ధూర్జటి నాకటిభాగాన్ని రక్షించుగాక! స్మరారి నాగుహ్యప్రదే శాన్ని రక్షించుగాక! పార్వతీశుడు నా పృష్ఠభాగాన్ని ఎప్పుడూ రక్షించుగాక! కుబేరమిత్రుడు నా ఊరుద్వయాన్ని రక్షించుగాక! పురుషశ్రేష్ఠులలో అగ్రేసరుడగు శివుడు నా పిక్కల రెండింటినీ రక్షించుగాక! దేవతలచే నమస్కరించదగిన పాదాలుగల పరమేశ్వ రుడు నా పాదాలను రక్షించుగాక! పరమేశ్వరుడు పగటియొక్క ప్రథమ యామాన నన్ను రక్షించుగాక! వామదేవుడు మధ్య యామాన నన్ను రక్షించుగాక! త్రినేత్రుడు నన్ను మూడో యామాన రక్షించుగాక! వృషభవాహనుడు నన్ను దినమున నాల్గవ యామాన రక్షించుగాక! గంగాధరుడు నిశీథియందు రక్షించుగాక! గౌరపతి తెల్లవారుఝామున నన్ను రక్షించుగాక! మృత్యుంజయుడు నన్ను సర్వకాలాలలో రక్షించుగాక! శంకరుడు లోపలనున్న నన్ను రక్షించుగాక! స్థాణుస్వరూపుడు బాహ్యముననున్న నన్ను రక్షించు గాక! పశుపతి నన్ను మధ్యయందు రక్షించుగాక! సదాశివుడు నన్నంతటనూ రక్షించుగాక! లోకైకనాథుడు నిలుచున్న నన్ను రక్షించుగాక! ప్రమథాధిపతి నడుస్తున్న నన్ను రక్షించుగాక! వేదాంతవేద్యుడు కూర్చున్నప్పుడు నన్ను రక్షించుగాక! అవ్యయు డైన శివుడు నన్ను పరున్నపుడు రక్షించుగాక! వీరరుద్రుడు మార్గ ములందు నన్ను పాలించుగాక! త్రిపురారి పర్వతాలు మొదలైన దుర్గప్రదేశాలలో నన్ను రక్షించుగాక! గొప్పశక్తిమంతుడై లేడిని

సంహరించిన శివుడు అరణ్యవాసాది గొప్ప ప్రవాసాలలో నన్ను రక్షించుగాక ! కల్పాంతాన ఉగ్రమైన కోపంగలవాడూ, స్ఫుటమైన అట్టహాసంచే కదల్పబడ్డ బ్రహ్మాండం కలవాడూ నన్ను రక్షించుగాక! పాదచారులు గుర్రాలు, ఏనుగులగుంపు మొదలైన వేలు, లక్షలు, కోటి సేనాసముద్రంవల్ల భయపడ్డ నన్ను వీరభద్రుడు రక్షించుగాక ! మృడుడు, దుర్మార్గులైన అక్షౌహిణీ సేనలశతాన్ని కుఠారధారలచే ఛేదించుగాక ! ప్రళయాగ్నిజ్వాలవలె మండుచున్న త్రిపురాంతకుని త్రిశూలం దొంగలను సంహరించుగాక ! ఈశ్వరుని పినాకమనే ధనస్సు-పెద్దపులులు, సింహాలు, ఎలుగుబంట్లు, తోడేళ్లు మొదలైన క్రూరజంతువులను ఝడిపించుగాక ! దుస్స్వప్నం, దుశ్శకునం, దౌర్భాగ్యం, దుర్మనస్యం, దుర్వ్యసనం. దుస్సహం, దుష్కీర్తి- వీటినీ గొప్ప అనర్థాలు, తాపం, విషభయం, దుష్టగ్రహాలవల్ల వచ్చే బాధలూ, రోగాలు_వీటినీ లోకనాథుడగు శంకరుడు నశింపచేయుగాక !

శ్లో॥ మాం పాతు దేవోఖిలదేవతాత్మా । సంసారకూపే పతితం గభీరే
తన్నామదివ్యం పరమంత్రమూలం । ధునోతుమే సర్వమఘం హృదిస్థం !

సర్వత్ర మాంరక్షతు విశ్వమూర్తి । ర్జ్యోతిర్మయానంద ఘనశ్చిదాత్మా
అణోరణీయా నురుశక్తిరేక । స్స ఈశ్వరః పాతుభయాదశేషాత్
యోభూస్వరూపేణ బిభర్తివిశ్వం । పాయాత్సభూమే ర్గిరి శోష్టమూర్తిః
యోపాం స్వరూపేణ నృణాం కరోతి । సంజీవనం సోవతు మాం జలేభ్యః
కల్పావసానే భువనాని దగ్ధ్వా । సర్వాణియో నృత్యతి భూరిలీలః
సకాలరుద్రోవతు మాం దవాగ్నే । ర్వాత్యాదిభీతేరఖిలాచ్చ తాపాత్ ॥

ప్రదీప్త విద్యుత్కనకావభాసో । విద్యావరాభీతికుఠారపాణిః
చతుర్ముఖస్తత్పురుషస్త్రినేత్రః । ప్రాచ్యాంస్థితో రక్షతు
మామజస్రం
కుఠారఖేటాంకుశపాశశూల । కపాలమాలాగ్నికణాన్దధానః
చతుర్ముఖో నీలరుచిస్త్రినేత్రః । పాయాదఘోరో దిశిదక్షిణస్యాం
కుందేందు శంఖస్ఫటికావభాసో । వేదాక్షమాలా వరదాభయాంకః
త్ర్యక్షశ్చతుర్వక్త్ర ఉరుప్రభావ । స్సద్యోధిజాతో వతుమాం
ప్రతీచ్యాం
వరాక్షమాలాభయటంకహస్త । స్సరోజ కింజల్కసమానవర్ణః
త్రిలోచనశ్చారు చతుర్ముఖో మాం । పాయాదుదీచ్యాందిశి
వామదేవః ॥
వేదాభయేష్టాంకుశటంకపాశ । కపాలఢక్కాక్షర శూలపాణిః
సితద్యుతిః పంచముఖోవతాన్మా । మీశాన ఊర్ధ్వం
పరమప్రకాశః ॥
మూర్ధానమవ్యాన్మమ చంద్రమౌళిః । ఫాలం మమావాదథ
ఫాలనేత్రః
నేత్రేమమావ్యాద్భగనేత్ర హారీ । నాసాంసదారక్షతు విశ్వనాథః ॥
పాయాచ్ఛ్రుతీ మేశ్రుతగీతకీర్తిః । కపోలమవ్యాత్సతతం కపాలీ
వక్త్రం సదారక్షతు పంచవక్త్రః । జిహ్వాం సదారక్షతు
వేదజిహ్వః ॥
కంఠంగిరీ శోవతు నీలకంఠో । వక్షస్థలం దక్షమఖాంతకోవ్యాత్
దోర్మూలమవ్యాన్మమ ధర్మబాహుః । పాణిద్వయం పాతు
పినాకపాణిః ॥
మమోదరం పాతుగిరీంద్రధన్వా । మధ్యం
మమావ్యాన్మదనాంతకారీ

హేరంభతాతో మమపాతునాభిం । పాయాత్కటిం
ధూర్జటిరీశ్వరోమే ॥
స్మరారిరవ్యాన్మమ గుహ్యదేశం । పృష్టం సదారక్షతు పార్వతీశః
ఊరుద్వయం పాతు కుబేరమిత్రో । జానుద్వయం మే
జగదీశ్వరోవ్యాత్
జంఘాయుగం పుంగవకేతురవ్యా । త్పాదౌ మమావ్యాత్సుర
వంద్యపాదః
మహేశ్వరః పాతు దినాద్యయామే । మాం మధ్యయామేవతు
వామదేవః
త్ర్యయంబకః పాతు తృతీయయామే । వృషధ్వజః
పాతు దినాంత్యయామే
పాయాన్నిశాదౌ శశిశేఖరోమాం । గంగాధరోరక్షతుమాం నిశీథే।
గౌరీపతిః పాతు నిశావసానే । మృత్యుంజయోరక్షతు సార్వకాలం
అంతస్థితం రక్షతు శంకరోమాం । స్థాణుస్సదాపాతుబహిస్థితం
మాం
తదంతరే పాతు పతిః పశూనాం । సదాశివోరక్షతుమాం
సమంతాత్
తిష్ఠంతమవ్యాద్భువనైకనాథః । పాయాద్వ్రజంతం
ప్రమథాధినాథః
వేదాంతవేద్యోవతు మాం నిషణ్ణం । మా మవ్యయః
పాతుశివశ్శయానం
మార్గేషుమాం రక్షతు నీలకంఠః శైలాది దుర్గేషు పురత్రయారిః
అరణ్యవాసాది మహాప్రవాసే । పాయాన్మృగవ్యాధ ఉదారశక్తిః
కల్పాంత కాలోగ్రపటుప్రకోపః । స్ఫుటాట్టహాసోచ్చలిత
తాండకోశః

ఘోరాది సేనార్ణవ దుర్నివార । మహాభయాద్రక్షతు వీరభద్రః
పత్త్యశ్వమాతంగ ఘటావరూధినీ । సహస్ర లక్షాయుత కోటిభీషణం
అక్షౌహిణీనాం శతమాతతాయినాం । ఛ్ఛిందాన్యనశ్వేద్ఘో
ఘోరకుఠారధారయా
నిహంతిదస్యూన్ ప్రళయానలార్చి । ర్జ్వలత్త్రిశూలం
త్రిపురాంతకస్య
శార్దూల సింహర్క్ష వృకాదిహింస్రాన్ । సంత్రాసయత్వీశధనుః
పినాకః
దుస్స్వప్నదుశ్శకున దుర్గతిదౌర్మనస్య దుర్భిక్ష దుర్వ్యసన
దుస్సహ దుర్యశాంసి
ఉత్పాత తాప విషభీతిమసద్గ్రహార్తీన్ । వ్యాధీంశ్చ నాశయతమే
జగతా మధీశః ॥)

మహామంత్రము - ఈశ్వరు నీ విధంగా స్తోత్రం చేయాలి :

'ఓం నమో భగవతే సదాశివాయ సకలతత్త్వాత్మకాయ సకలతత్త్వవిదూరాయ సకలలోకైకకర్త్రే సకలలోకైకభర్త్రే సకల లోకైకహర్త్రే సకలలోకైకగురవే సకలలోకైకసాక్షిణే సకలనిగమ గుహ్యాయ సకలలోకైకవరప్రదాయ సకలదురితార్తి భంజనాయ సకలజగదభయంకరాయ సకలలోకైకశంకరాయ శశాంకశేఖరాయ శాశ్వతనిజావాసాయ నిరావాసాయ నిరాభాసాయ నిరామయాయ నిరాంతకాయ నిష్కళంకాయ నిష్ప్రపంచాయ నిర్ద్వంద్వాయ నిస్సంగాయ నిర్మమాయ నిర్మలాయ నిర్గుణాయ నిరాధారాయ నిరుపమవిభవాయ నిత్యశుద్ధబుద్ధ పరిపూర్ణ సచ్చిదానందాద్వైతపరమ ప్రకాశాయ పరమశాంతప్రకాశాయ తేజోరూపాయ తేజోమయాయ తేజోధిపతయే జయ జయ రుద్రమహారుద్ర మహారౌద్ర వీరభద్రావతార మహాభైరవ, కాలభైరవ, కల్పాంతభైరవ, కపాల

మాలాధర, ఖట్వాంగ, చర్మ, ఖడ్గ, పరశు, పాశాంకుశ, డమరుక మృగశూల, చాప, బాణ, గదా, శక్తి, బిండివాల, తోమర, ముసల, ముసుండి, ముద్గర, ప్రాస, పరిఘ, పట్టస, శతఘ్నీ, చక్రాద్యాయుధ, భీషణాకర, సహస్రదంష్ట్రాకరాళవదన, వికటాట్టహాస, విస్ఫాటిత బ్రహ్మాండమండల నాగేంద్రహార, నాగేంద్రవలయ, నాగేంద్రచర్మధర, మృత్యుంజయ త్ర్యంబక, త్రిపురాంతక, విరూపాక్ష, విశ్వేశ్వర, వృషవాహన, విషభూషణ, విశ్వరూప, విశ్వతోముఖ, సర్వతోముఖ, మాం రక్ష రక్ష, జ్వల జ్వల, ప్రజ్వల ప్రజ్వల, మహా మృత్యు మపమృత్యుభయం నాశయ నాశయ రోగభయముత్సాదయోత్సాదయ విషసర్పభయం శమయ శమయ చోరాన్మారయ మారయ మమ శత్రూనుచ్చాట యోచ్చాటయ శూలేన విదారయ విదారయ కుఠారేణ భింధి భింధిఖడ్గేన చ్ఛింది చ్ఛింధి ఖట్వాంగేన వ్యపోథయ వ్యపోథయ మమపాపం శోధయ శోధయ ముసలేన నిష్పేషయ నిష్పేషయ బాణై స్సంతాడయ సంతాడయ యక్ష రక్షాంసి భీషయ భీషయ భూతాని విద్రావయ విద్రావయ భూత భేతాళ మారీచ బ్రహ్మరాక్షసగణాం సంత్రాసయ సంత్రాసయ మమాభయం కురుకురు విత్రస్తమా మాశ్వాసయాశ్వాసయ దుఃఖాతురం మామానంద యానంద యక్షుత్తృష్ణార్తం మామాప్యాయ యాప్యాయయ అమృతకటాక్ష వీక్షణేన మామాలోకయాలోకయ మాం సంజీవయ సంజీవయ నరకభయాన్మాముద్ధరోదర శివకవచేన మామాచ్ఛాద యాచ్ఛాదయ మృత్యుంజయ త్ర్యయంబక సదాశివ నమస్తే నమస్తే ॥

సకలబాధలను శాంతింపజేయునదీ సర్వప్రాణులకు రహస్యమైనదీ అయిన నాచే చెప్పబడిన ఈ శివకవచం ఏ మానవుడు సదా ధరిస్తున్నాడో అలాంటివాడికి ఈశ్వరానుగ్రహంవల్ల ఎప్పటికీ

భయం జనించదు. ఆయుక్షీణం కలవాడుగానీ, మరణ మాసన్న మైనవాడుగానీ, మహారోగపీడితుడుగానీ, ఈ కవచాన్ని జపించినచో వెంటనే సుఖాన్నీ దీర్ఘాయుర్దాయాన్నీ పొందుతాడు. సకల దారిద్ర్యాన్ని నశింపజేసేదీ, సర్వశుభాలను ఇచ్చేదీ అయిన ఈ శివకవచాన్ని ధరించిన మానవుడు దేవతలచేకూడా పూజింపబడతాడు. మహాపాతకాలతోనూ, ఉపపాతకాలతోనూ ఉన్నప్పటికీ శివకవచ పఠన సామర్థ్యంవల్ల శరీరాంత్యాన ముక్తిని పొందుచున్నాడు. నాచే చెప్పబడ్డ ఈ ఉత్తమమైన శివకవచాన్ని శ్రద్ధగా నీవు ధరిస్తే వెంటనే శ్రేయస్సును పొందుతావు."

ఈ విధంగా ఋషభుడనే ఆ శివయోగిచెప్పి ఆ రాజకుమారుడికోసం మహాధ్వనిగల శంఖాన్నీ, శత్రువినాశకమైన ఖడ్గాన్నీ ఇచ్చాడు. మళ్ళీ విభూతిని మంత్రించి ఆ రాజకుమారుడి శరీర మంతటా స్పృశించి ఆతడికి పన్నెండువేల ఏనుగుల బలాన్ని ఇచ్చాడు.

సూతుడు చెపుతున్నాడు! విభూతిమహిమచే పొందబడ్డ బలమూ, ఐశ్వర్యమూ, ధైర్యమూ, పూర్వస్మృతి గలిగిన ఆ రాజకుమారుడు శరత్కాల సూర్యుడిలా ప్రకాశించాడు. ఆ ఋషభ యోగి అంజలిబద్ధుడైన రాజకుమారునితో "ఓ రాజకుమారా! తపోయంత్రసామర్థ్యంవల్ల సంపాదించి నేను నీకీ ఖడ్గాన్ని ఇచ్చాను. వాడిఅయిన ఖడ్గధారగల ఈ ఖడ్గం ఎవ్వడికి స్ఫుటంగా కనబరుస్తావో ఆతడు మృత్యుదేవతయే స్వయంగా శత్రువులా వచ్చినట్లుండి వెంటనే మరణిస్తాడు. తపోమంత్రమహిమచే నేనిచ్చిన ఈ శంఖధ్వనిని విన్న శత్రువులు తమ శస్త్రాలనువిడి చైతన్యరహితులై పడిపోతారు. లోకోత్తరమైన శత్రుసేనలను నశింపజేయునవి అయిన శంఖఖడ్గాలు నీ సేనలనూ, నీ సహాయులనూ, పరాక్రమాన్ని తేజస్సును వృద్ధి

పొందిస్తాయి. కాబట్టి వీటి మహిమవల్లనూ, శివకవచమహిమ వల్లనూ పన్నెండువేల గజబలంచేతను విభూతిధారణ మహిమ చేతనూ శత్రుసేనను తప్పక జయిస్తావు. నీ తాత తండ్రుల నాటినుండి వచ్చిన సింహాసనాన్ని అధిష్టించి భూమండలాన్ని అంతా పాలించగలవు. ఈ విధంగా తల్లితో ఉన్న ఆ రాజకుమారునికి ఉపదేశించి ఋషభయోగి వారిద్దరిచే పూజింపబడి తన స్వేచ్ఛానుసారం వెళ్ళిపోయాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో శివ కవచోపదేశమని ప్రసిద్ధి పొందిన పన్నెండవ అధ్యాయం.



# త్రయోదశోధ్యాయం

సూతుడు శౌనకాది మునులతో చెప్తున్నాడు: పరాక్రమ శాలీ దశార్ణదేశపురాజూ అయిన వజ్రబాహుడికి బలవంతుడైన మగధదేశాధీశ్వరుడు శత్రువు. మదోత్కటుడూ, బాహుబలశాలి అయిన ఆ హేమరథుడు పెద్ద సైన్యంతో దశార్ణదేశాన్ని ముట్టడించాడు. సైనికులు దశార్ణదేశాన్ని ప్రవేశించి ధనాన్నీ, రత్నరాసులనూ హరించారు. గృహాలను తగులబెట్టారు. కొందరు ధనాన్నీ, మరికొందరు పిల్లలను, మరికొందరు పశువులను, ఇంకా కొందరు దాసదాసీజనాన్ని వశపరుచుకున్నారు. కొందరు ఉద్యానవనంలోని సస్యాలనూ, ఇంటిలోని ఉద్యానవనాలను నాశనం చేశారు. అక్కడున్న స్త్రీలను, గోవులను, ధనాన్ని హరించే కోరికతో రాజ్యాన్ని సర్వనాశనం చేశారు. తన పట్టణం ముట్టడిని చూచి వజ్రబాహు

మహారాజు సేనతో యుద్ధానికి బయలుదేరాడు. మంత్రులూ, సేనాపతులు మగధరాజ సైన్యంతో యుద్ధంచేశారు. దశార్ణరాజుకూడా రథంఎక్కి బాణవర్షాన్ని కురిపిస్తూ బాగా యుద్ధం చేశాడు. చెంతకు చేరశక్యంకాకుండా యుద్ధం చేస్తున్న దశార్ణమహారాజును చూచి మగధరాజ సైనికులందరూ మహాబలంతో అతణ్ణి ఎదిరించారు. ఘోరయుద్ధంచేసి అతడి సేననంతా నాశనంచేసి జయంపొందారు. కొందరాతని రథాన్ని, మరికొందరాతని ధనస్సును విరిచారు. ఒక సైనికుడాతని సారథిని కొట్టాడు. మరియొకడాతని ఖడ్గాన్ని విరిచాడు మరికొందరు నిస్సహాయుడైఉన్న అతనిని బలాత్కారంగా బంధించారు. మంత్రులనూ, సేననూ జయించారు. తరవాత పట్టణంలోకి ప్రవేశించి గుర్రాలను, ఒంటెలను, పశువులను, ధాన్యాన్ని. ధనాలను, సౌందర్యవతులైన స్త్రీలను, అందగత్తెలగు కన్యలను అంతఃపురస్త్రీలను దాసదాసీవర్గాలను సర్వాన్ని స్వాధీనం చేసుకున్నారు. ఆ సైనికులు ధనాగారాన్ని వశపరచుకున్నారు. పట్టణాన్ని సర్వనాశనంచేసి స్త్రీలు, గోవులు, ధనం మొదలైనవాటిని హరించి దశార్ణరాజును బంధించి రథంపై ఎక్కించుకొని వెడలిపోయారువారు.

ఆ వార్తవిని దశార్ణదేశపు రాజకుమారుడు మహాకోపంతో సింహంలా గర్జిస్తూ, శివయోగి తనకిచ్చిన ఖడ్గాన్ని శంఖాన్నిపూని వైశ్యరాజకుమారుడు తోడురాగా గుర్రమెక్కి శత్రువులను జయించటానికివచ్చి మగధసైన్యాన్ని ముట్టడించాడు. తీవ్రమైన బాణాలతో కొట్టాడు. వారుకూడా తీవ్రమైన బాణాలతో అతణ్ని ఎదిరించారు కాని శివకవచంచే రక్షింపబడినవాడై అతడు ఎంతమాత్రమూ ఆయాసపడలేదు. మదపుటేనుగులా శత్రువుల బాణవర్షాన్ని సహించి అతడు మంచిగుర్రాలనూ, మదపుటేనుగులనూ, పాదచారులనూ- లెక్కలేకుండా నశింపజేశాడు. సారథితోకూడా ఒకరథికుని

చంపి ఆ రథమెక్కి వైశ్యరాజకుమారుని సారథిగా చేసుకొని మృగ సంఘంలో సంచరించే సింహంలా యుద్ధరంగాన ధీరుడై సంచరించాడు. బలవంతులు, శూరులు అయిన మగధరాజ సైనికులు ధనస్సులను ధరించి అతడిని ఎదిరించారు. తనమీదకు వారంతా ఒక్కుమ్మడిగా వస్తున్నప్పటికీ ధైర్యంగా ఆ రాజకుమారుడు ఖడ్గంతో ఎదిరించాడు. తీక్షణమైన యముని నాలుకతో సమానంగా ప్రకాశిస్తున్న అతడి ఖడ్గంచూచి దాని మహిమవల్ల వెంటనే వారంతా మరణించారు. రణరంగంలో ఆ ఖడ్గాన్ని చూచినవారంతా అగ్నిలోపడ్డ మిడుతలదండులా చనిపోయారు. తరవాత అతడు సర్వసైన్యాన్నీ నశింపజేయడానికి భూమ్యాకాశాలు దద్దరిల్లే ధ్వనిగల శంఖాన్ని పూరించాడు. విషంతో నిండినదానివలెఉన్న ఆ ధ్వనిని విన్నంతనే శత్రువులందరూ మూర్ఛిల్లి నేలపై కూలిగారు. గుర్రాలపై రథాలపై, ఏనుగులపై కూర్చున్నవారందరూ ఆ శంఖధ్వనిని చైతన్యరహితులై క్రిందపడ్డారు. రాజధర్మమెరిగిన ఆ రాజకుమారుడు నిరాయుధులై, చైతన్యరహితులై భూమిమీదపడిన సైనికులెవ్వరినీ వధించలేదు. రణరంగాన బద్ధులైఉన్న తన తండ్రినీ, రాజభార్యలందరినీ శత్రువులనుండి విడిపించాడు. ముఖ్యమంత్రుల భార్యలను, పురజనుల భార్యలను, మిగిలిన స్త్రీలను బాలురను ముఖ్యులందరినీ, గోవులు, ధనం మొదలగువాటి నన్నింటిని విడిపించాడు. భయపడిన వారినందరినీ విడిపించి వారిని ఓదార్చాడు. తరవాత శత్రుపక్షంలో ఉన్న తన పక్షపు సేనానాయకుల భార్యలను విడుదలచేశాడు. రథం మీద పడిఉన్న మగధదేశాధీశుని బంధించాడు. అతడి మంత్రులనూ, సేనాధిపతులను బలాత్కారంగా తన పట్టణానికి చేర్చాడు. నాలుగు దిక్కులకు పారిపోయిన రాజమంత్రులూ, ఇతర సేనానాయకులూ తిరిగివచ్చారు. వారంతా ఆ రాకుమారుని పరాక్రమాన్ని చూచి

ఆశ్చర్యపోయారు. కారణాంతరంగా భూమిమీదకు దిగిన బ్రహ్మదేవుడిగా తలంచారు. "ఏమి మన అదృష్టం. ఏమి మన పుణ్యఫలం. ఈతడు మృతినొందిన మనలనందరనూ పునర్జీవింప జేసినట్లుగా చేశాడు. మానవులకు శక్యంకానిపని ఈతడు చేసినందువల్ల ఈతడు యోగసిద్ధుడో, తపస్సిద్ధుడో లేదా దేవతలలో ఒకడో అయి ఉండాలి. నిజంగా ఈతనికి పార్వతి తల్లి అయి ఉండాలి. శంకరుడు తండ్రిఅయి ఉండాలి. లేకపోతే అపారశక్తిని ధరించిన ఈతడు నూరు అక్షౌహిణుల సేననెలా జయించగలడు ?" అని ఆశ్చర్యమగ్నమానసులై పరస్పరం స్తోత్రంచేస్తూ మంత్రివర్గం అడగినా ఆతడు తన వృత్తాంతాన్నిగూర్చి చెప్పలేదు. ఆశ్చర్యం, సంతోషం, భయంతో కూడి ఆనందబాష్పాలు రాలుస్తున్న తండ్రికడకేగి ప్రేమతో నమస్కరించాడు. అప్పుడా రాజుకుమారుణ్ని గాఢాలింగనం చేసుకొని ప్రేమతో "మహాబుద్ధిశాలి అయిన కుమారా ! నీవు దేవుడవో, మనుష్యుడవో, గంధర్వుడవో కావాలి లేకపోతే పరాక్రమహీనులై మృతప్రాయులై శత్రువుచే బంధించబడ్డ మమ్మల్ని మా భార్యలను దయతోవచ్చి విడిపించావు. నీకీ శౌర్యం, ధైర్యం, తేజస్సు, అధికబలమూ ఎలాకల్గినాయి ? దేవతలూ, రాక్షసులూ, మానవులు వీరితోకూడిన ముల్లోకాలను జయించే కోరికకలవాడివలె కన్పిస్తున్నావు. మహాపరాక్రమశాలి అయిన నీ ఋణం నేనూ నా భార్యలూ ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేము. ఇన్నింటినీ విడిచి నీయందే నా మనస్సు ప్రేమానుబద్ధమైఉంది. కాబట్టి నా ప్రాణాలను కాపాడిన ఓ చిన్నవాడా నీ వృత్తాంతాన్ని సవిస్తరంగాచెప్పు" అని అడిగాడు.

సూతుడు చెపుతున్నాడు: "ఈ నా భార్యల జీవనంకూడా నీ అధీనం" అని ఆ మహారాజు రాకుమారుణ్ని అడగగా ఆతనితో

"ఓ మహారాజా! సునయుడనే ఈ వైశ్యసుతుడు నా స్నేహితుడు. ఈతని ఇంట్లో నేను నా తల్లితోకూడా నివసిస్తున్నాను. నా పేరు భద్రాయువు. తర్వాత నా వృత్తాంతం చెపుతాను. నీ సంసారం, మిత్రబృందంతో శుభకరమైన నీ పట్టణాన్ని ప్రవేశించి సుఖంగా ఉండు. శత్రువులవల్ల భయంవిడిచి సుఖంగా విహరించు. నేను తిరిగి వచ్చేవరకూ ఈ శత్రువులను విడిచిపెట్టకు. నేనుకూడా శీఘ్రంగా తిరిగి ఇంటికి రాగలను" అని చెప్పి మహారాజువద్ద సెలవు తీసుకొని భద్రాయువు తన ఇంటికివచ్చి తన తల్లికి జరిగినదంతా చెప్పగా ఆమె సంతసించి ఆనందబాష్పాలతో ఆతడిని కౌగలించుకుంది. వైశ్య మహారాజుకూడా ఆతడిని ప్రేమతో కౌగలించుకుని పూజించాడు. వజ్రబాహు మహారాజుకూడా తన భార్యాపుత్రులతో, మంత్రులతో కలిసి తన పట్టణాన్ని ప్రవేశించి చాలా ఆనందాన్ని పొందాడు. ఆ రాత్రి ఋషభయోగి సీమంతిని భర్త అయిన చంద్రాంగద మహారాజుతో కలిసి భద్రాయువుని జన్మవృత్తాంతాన్ని ఆతని అమానుష కర్మను రహస్యంగా ఆతనికి తెలిపి కీర్తిమాలిని అనే పేరున్న నీ కుమార్తెను భద్రాయువునికిచ్చి వివాహం చేయమని బోధించి వెళ్ళాడు.

తరవాత చంద్రాంగద మహారాజు ఒక శుభముహూర్తాన భద్రాయువుని పిలిపించి తన కూతురగు కీర్తిమాలినిచ్చి వివాహం చేశాడు. ఆ రాజకుమారుడు పెండ్లియాడి బంగారు సింహాసనం మీద భార్యాసహితుడై కూర్చుండి రోహిణితో కూడిన చంద్రుడిలా ప్రకాశించాడు. చంద్రాంగద మహారాజు భద్రాయువుని తండ్రి అయిన వజ్రబాహు మహారాజును రావించి పట్టణం ప్రవేశించిన వెంటనే మంత్రులతో ఎదురేగి ఇంటికితెచ్చి తగిన విధంగా పూజించాడు. వివాహితుడై శత్రుసంహారుడగు భద్రాయువుడువచ్చి

ప్రేమతో తండ్రికి నమస్కరించగా లేవనెత్తి సంతోషంతో కౌగ లించుకున్నాడు. "ఓ చంద్రాంగద మహారాజా ! మహాబలశాలి అయిన ఈ నీ అల్లుడు, నా శత్రువులను సంహరించి నా ప్రాణాలను కాపాడినవాడు. అవక్రపరాక్రమ వంతుడైన ఈతని వంశోత్పత్తిని గూర్చి వినడానికి కోరుతున్నాను ? అని అడగగా ఆ రాజును విడిగా పిలిచి చిరునగవుతో చంద్రాంగదుడు "ఓ మహారాజా ! బాల్య మందు రోగపీడితురాలైన తల్లితోసహా అడవిలో విడువబడ్డ ఇతడు నీ కుమారుడే సుమా ! నీ భార్య శిశువుతోకూడి అడవిలో తిరుగుతూ చివరకు దైవవశాత్తు ఒక వైశ్యగృహానికి చేరి ఆతడిచే రక్షించ బడింది. తరవాత అనేక రోగాలతో బాధపడుతున్న నీ కొడుకు మర ణించాడు. అక్కడికొక యోగీంద్రుడువచ్చి మృతిచెందిన నీ కుమా రుణ్ని బ్రతికించాడు. ఋషభుడనే ఆ శివయోగి మహిమవల్ల తల్లీ కొడుకు లిద్దరూ దేవసదృశులయారు. ఆతడిచ్చిన శంఖం, శత్రు నాశనహారి అయిన ఖడ్గాన్నిబూని శివకవచంచే రక్షించబడి యుద్ధాన శత్రువుల నెల్లరనూ జయించాడు. ఈతడు రెండువేల ఏనుగుల బలం కలవాడు. సకలవిద్యాపారంగతుడు. ఇప్పుడు నా కల్లుడైనాడు కావున ఓ రాజా ! ఈ చిన్నవానినీ, ఈతని తల్లిని స్వీకరించి నీ పట్ట ణానికి వెళ్ళు. కొద్దికాలంలో మహాధైర్యాన్ని పొందగలవు. ఈ విధంగా చంద్రాంగద మహారాజు విషయమంతా చెప్పి తన అంతః పురాన అలంకరించుకొనిఉన్న ఆతని జ్యేష్ఠ భార్యను చూపించాడు. ఈ వృత్తాంతం అంతావిని ఆ రాజు ఆమెను చూచి తన మూర్ఖత్వా నికి చాలా బాధపడి తాను చేసిన పనికి తనను నిందించుకొని భార్యా పుత్రుల దర్శనంచే అపరిమితానందాన్ని పొంది పులకించిన శరీరంతో వారిద్దరినీ ఒక్కమారు కౌగిలించుకొన్నాడు.

ఈ విధంగా నిషధరాజైన చంద్రాంగద మహారాజుచే పూజింపబడి సంతోషించి తన మంత్రులతోకూడి ఆతనిని గౌరవించి తన పెద్దభార్యను కుమారుని కోడలిని వెంటబెట్టుకొని సపరివారంగా వజ్రబాహు మహారాజు తన పట్టణానికి చేరాడు. ఆ రాజకుమారుడు తండ్రి ఇంటికిచేరి పురజనుల నందరనూ సంతోషపెట్టాడు. కొంత కాలానికి ఆతని తండ్రి మరణించగా యౌవనుడైన భద్రాయుషుడు భూపాలకుడై చాలా బాగా పరిపాలించాడు. హేమరథుడనే మగధ దేశపురాజుతో అమిత స్నేహాన్నిచేసి ఆతణ్ని బంధవిముక్తుణ్ని గావించాడు.

ఈ విధంగా ముల్లోకాలలో పూజ్యమైన శివయోగి పూజను పూర్వజన్మలో చేసిన భద్రాయుర్మహారాజు దాటశక్యంకాని ఆపత్తులను దాటి రాజ్యాభిషిక్తుడై చంద్రాంగదుని కుమార్తె కీర్తిమాలినితో కలిసి చాలాకాలం క్రీడిస్తూ రాజ్యపాలన గావించాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో శివకవచ మహిమాను వర్ణన అనే ప్రసిద్ధమైన పదమూడవ అధ్యాయం.

— I —

# చతుర్దశోధ్యాయం

సూతుడు చెపుతున్నాడు :

ధీరుడైన భద్రాయుర్మహారాజు సింహాసనమెక్కి రాజ్యపాలన చేస్తూ ఒకానొకప్పుడు భార్యాసహితుడై అరణ్యానికి వెళ్ళాడు. సంపెంగ, అశోకపూలూ చిగుళ్లూ కలదీ, వికసించిన మల్లెలూ పద్మాలూ; వాటియందు ధ్వనిచేస్తున్న తుమ్మెదలచే వ్యాకుల

మైందీ, నవకేసరాలలోని పరిమళంతో కాముకజనుల కానందాన్ని కలిగించేదీ, అప్పుడే పుట్టిన మొగ్గలున్న అశోకతమాల వనంకలదీ, క్రొత్తమాలతీ పూలగుత్తులచే వంగిన మంటపాలు కలదీ, అప్పుడే జనించిన చిగుళ్ళూ, పూలతోకూడిన తీయమామిడి కొమ్మలచే అలంకరించబడినదియూ, పున్నాగ పనసవృక్షాలలో తిరుగుతున్న మగకోకిలారావాలు కలదీ అయిన సుందరవసంతకాలాన భార్యా సమేతుడైన ఆ రాజు ఉద్యానవనంలో క్రీడిస్తున్నాడు. అదే సమయంలో పెద్దపులిచే తరుమబడి ఆర్తనాదంచేస్తూ పరుగెడుతున్న బ్రాహ్మణదంపతులను రాజు చూచాడు.

అంతలో "ఓ రాజా ! మహాబలమైన ఈ పెద్దపులి మమ్మల్ని భక్షించడానికి వస్తున్నది. కరుణానిధీ ! మమ్మల్ని రక్షించు." అనే శబ్దం వినబడింది. ఆ ఆర్తారవాన్ని విన్న మహారాజు ధనస్సును ఎక్కు పెడుతున్న సమయంలో వేగంగా ఆ పెద్దపులివచ్చి బ్రాహ్మణస్త్రీ నడుమును పట్టుకొన్నది. "ఓ నాథా ! ఓ ప్రియా ! హా శంకరా ! జగద్రక్షకా !" అని ఏడుస్తున్న ఆ స్త్రీని భయంకరంగా పెద్దపులి గ్రహించింది. అంతట ఆ రాజు వాడిఅయిన బల్లాలచే పెద్దపులిని కొట్టాడు. వర్షధారలవల్ల పర్వతరాజంలా అతిడి బాణపరంపరలచే ఆ వ్యాఘ్రం శ్రమ నొందలేదు. అతడి బాణాలకు ఏ మాత్రం లెక్క చేయక అది బలాత్కారంగా స్త్రీని వేగంగా పట్టుకొని వెళ్ళిపోయింది. పెద్దపులిచేత తీసుకొనిపొబడిన తన భార్యనుచూచి మహాదుఃఖంతో ఆ బ్రాహ్మణుడు 'ఓ ప్రియురాలా ! ఓ కాంతా ! ఓ పతివ్రతా శిరోమణీ' అని పిలుస్తూ ఏడ్వసాగాడు." నన్నొకడినీ విడిచి పర లోకానికి ఎలావెళ్లావు ? ప్రాణాధికమైన నిన్నువీడి నేనెట్లు జీవించాలి ? ఓ రాజా ! నీ అస్త్రాలెందుకు ? ప్రశంసింపదగిన నీ ధనస్సు ఏమయింది ? పన్నెండువేల మహాగజాలతో సమానమైన నీ బలమేమ

యింది? నీ శంఖం, ఖడ్గం, మంత్రవిద్య, అస్త్రవిద్య, సత్యం, ప్రతాపం, ప్రభావం– వీటన్నిటివల్ల లాభం ఏమిటి? అన్నీ నిష్ప్రయోజనమయాయి. ఒక్క అడవిజాతువును చంపలేకపోతివే? ఆపత్తు నుండి రక్షించడం క్షత్రియక్షత్రం. అలాంటి వంశంలో పుట్టి ధర్మం నశించిన తరవాత నీవు బ్రతికి ఎందుకు? శరణు జొచ్చినవారినీ ఆర్తలను రక్షించడం మహాధర్మం. మహారాజులు తమ అర్థప్రాణాలచే ఇతరులను రక్షిస్తారు. అలా రక్షించలేనివారు జీవన్మృతులే కదా! ఆర్తులను రక్షించలేని రాజులు బ్రతకడంకన్నా చనిపోవడం మంచిది. దానంచేయని ధనవంతులైన గృహస్థులు బిచ్చమెత్తుకోవడం మంచిది. దిక్కులేనివారు, శరణు జొచ్చినవారు, దీనులు– వీరిని కాపాడని రాజులు విషాన్ని తినిగానీ, అగ్నిలోబడిగానీ, మరణించడం మంచిది" అని తన పరాక్రమాన్ని నిందిస్తూన్న అతడి ఆర్తారావం విని ఆ రాజు దుఃఖించి దైవానుకూలంలేక ఇప్పుడు నా పరాక్రమం అంతా నష్టమయింది. ఏమి ఆశ్చర్యం! నా కీర్తి నశించింది. మహాపాపం నాకు సంభవించింది. దౌర్భాగ్యుడను; దుర్మతిని. నా కులధర్మం కూడా ఇప్పుడు నశించింది. నా సంపదలు, రాజ్యం, ఆయుస్సు తప్పక క్షీణిస్తాయి. ఆయుర్దాయాలు, సంపదలు, భోగాలు, దారాపుత్రాదులు, ధనం మొదలైనవన్నీ దైవవరంవల్ల ఒకప్పుడు వస్తాయి. మరొకక్షణంలో నశిస్తాయి. భార్యావియోగం పొంది దుఃఖిస్తున్న ఈ విప్రుడికి నా ప్రాణాలు ఇచ్చిఅయినా దుఃఖంలేని వానినిగా చేస్తాను." అని భద్రాయుర్మహారాజు మనస్సులో నిశ్చయించుకొని ఆ విప్రుని పాదాలకు నమస్కరించి బ్రతిమలాడుతూ "ఓ బ్రాహ్మణోత్తమా! పరాక్రమహీనుడనై క్షత్రియాధముడనైన నన్ను అనుగ్రహించు. నీవు కోరినధనం ఇస్తాను. దుఃఖించకు. ఇది

నా రాజ్యం. ఈమె నా భార్య. ఇదిగో నా దేహం. ఈ సర్వమూ నీ అధీనం చేశాను. ఇంక నీ కోరిక తెల్పు" అన్నాడు.

అప్పుడు బ్రాహ్మణుడు "గ్రుడ్డివాడికి అద్దమెందుకు? బిచ్చమెత్తుకొని జీవించేవాడికి గృహమెందుకు? మూగవాడికి పుస్తకమెందుకు? భార్యలేనివాడికి ధనమెందులకు? నేను భార్యావియోగం పొందాను. అనుభవించిన దానిని మళ్ళీ అనుభవించడం మంచిది కాదు. కాబట్టి నీ పెద్దభార్యను కోరుతున్నాను. నా కిమ్ము" అని అడిగాడు. దానికి రాజు "ఓ బ్రాహ్మణోత్తమా! ఇది నీ కులధర్మమేనా? ఇలాంటిపనులు పెద్దలు అంగీకరిస్తారా? పరస్త్రీలను తాకడంవల్ల మహానరకమూ అపకీర్తి తప్పక కలుగుతాయికదా! ప్రపంచంలో ధనం, రాజ్యం, ఏనుగులు, గుర్రాలు– వీటిని దానంచేసే దాతలున్నారు కాని తన శరీరాన్నీ; భార్యనూ దానమివ్వడం మంచిది కాదు. 'పరదారోప భోగేన యత్పాపం సముపార్జితం। నతత్త్యాయితుం శక్యం ప్రాయశ్చిత్త శతైరపి' ఎన్నివేల ప్రాయశ్చిత్తాలు చేసుకొన్నా పరస్త్రీ సంభోగంవల్ల కల్గిన పాపం నశించదుసుమా!" అని చెప్పాడు.

అప్పుడు బ్రాహ్మణుడు "బ్రహ్మహత్య, మద్యపానం మొదలైన మహాపాపాలనైనా నశింపజేయగల తపస్సామర్థ్యంగల నాకు ఈ పరస్త్రీ సంభోగంవల్ల వచ్చేపాపం నశింపజేయటం ఎంతపని? కాబట్టి నీ భార్యను నా కిమ్ము. అలాచేయకపోతే ఆర్తులను రక్షించక పోవడంవల్ల కలుగు మహానరకాన్ని నీవు వెంటనే పొందుతావు." అని బ్రాహ్మణుడు చెప్పగా భయపడిన ఆ మహారాజు "ఆపన్నులను రక్షించకపోతే మహాపాపం కల్గుతుంది. అంతకన్నా భార్యను ఈతడికివ్వడమే మంచిది. కాబట్టి బ్రాహ్మణునికోసం నా భార్యనిచ్చి పాపరహితుడనై వెంటనే అగ్నిప్రవేశం చేస్తాను. దానివల్ల కీర్తి స్థిరంగా

ఉంటుంది” అని రాజు నిశ్చయించి అగ్నిని ప్రజ్వలింపజేసి ఆ విప్రుణ్ణి పిలిచి ఉదకపూర్వకంగా తన భార్య నాతనికి దానమిచ్చాడు. తరవాత స్నానంచేసి పరిశుద్ధుడై దేవతానమస్కారం చేసి అగ్నికి మూడుమార్లు ప్రదక్షిణంచేసి శ్రద్ధగా పరమేశ్వరుని ధ్యానించాడు. తన పాదారవిందాలయందు మనస్సును లగ్నంచేసి అగ్నిలోపడుతున్న ఆ రాజునకు జగత్పతి అయిన విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై ఆతడిని అగ్నిలో పడకుండా నిరోధించాడు.

అయిదు ముఖాలు కలవాడూ, త్రినేత్రుడూ, చంద్రకళావతంసుడూ, వ్రేలాడుతున్న పచ్చని జటాజూటం కలవాడూ, కోటి మధ్యాహ్న సూర్యసమాన తేజుడూ, తామరతూడువంటి తెల్లని కాంతికలవాడూ, గజచర్మాన్ని ధరించినవాడు, గంగానదీ తరంగాలచే తడపబడ్డ మౌళిప్రదేశం కలవాడూ, నాగేంద్రహారావళిని కంఠ సాలుగా ధరించినవాడూ, కిరీటం, మొలత్రాడు, బాహుపురులూ, కుండలాలచే ప్రకాశించేవాడూ, త్రిశూలం, ఖడ్గం, ఖట్వాంగం, కుఠారం, చర్మం, మృగం, అభయముద్ర, పద్మం, పినాకం-హస్తాలలో ధరించినవాడూ వృషభమెక్కినవాడూ, నల్లనికంఠం కలవాడు అయిన పరమేశ్వరుడు తన ఎదుట ప్రత్యక్షం కావడం ఆ రాజు దర్శించాడు. ఆకాశం నుండి దివ్యకుసుమవృష్టి కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి. దేవతాస్త్రీలు నాట్యంచేస్తూ శ్రావ్యంగా గానం చేశారు. నారదుడు మొదలగు మునీశ్వరులు సనకాది దేవర్షులూ, ఇంద్రాది లోకపాలకులూ, పవిత్రులైన బ్రహ్మర్షులు అచ్చటికి వచ్చారు. వారందరిమధ్య పార్వతీ సమేతుడై కూర్చున్న ఈశ్వరుడు భక్తితో వంగి నమస్కరిస్తున్న రాజుపై తన దయావర్షం కురిపించాడు.

పరమేశ్వర దర్శనంవల్ల కలిగిన ఆనందంచే పెంపొందిన అంతః కరణంతో ఆనందబాష్పాలతో తడిసిన శరీరంగల ఆ రాజు పులకాంకితదేహుడై గద్గదస్వరంతో దోసిలొగ్గి దేవదేవుని "అత్యంత రహితుడు, ప్రధానమైనవాడు, తెలియబడని గుణాలు కలవాడు, మహానుభావుడు, కారణం లేనివాడు, కారణానికి కారణమైనవాడు, చిదానందస్వరూపుడు, ప్రకాశం కలవాడు అయిన శివునికి నేను నమస్కరిస్తున్నాను. విశ్వసాక్షి, జగత్తునకు కర్త, కప్పబడ్డ తేజం కలవాడు, హృదయ పద్మమందే ఉన్నవాడు కావున విద్వాంసులు తమ చిత్తాన్ని నిరోధించి అనేకమైన యోగాభ్యాసాలుచేసి తమ బుద్ధిచే అన్వేషిస్తున్నారు. నన్ను అద్వితీయుడిగా భావనచేసేవారికి ఏకరూపుడుగానే ఉండి అనేక రూపబుద్ధితో ధ్యానించేవారికి అనేక విధాలుగానే ఉన్నావు. ఇంద్రియాతీతమైనదీ, అజ్ఞానవినాశమైనదీ అయిన నీ స్థానం మనోమార్గానికి కనిపించడంలేదు. వాఙ్మనస్సులకు అగోచరుడవై పరాత్పరుడవైన జ్ఞానరూపుడవై నిన్నును, విషయవాసనలు కలిగి మాయాసంబంధంకల నా వాక్యాలు ఏ విధంగా స్తోత్రం చేయగలవు ? ఓ పరాత్పరా ! ఆపన్నుల ఆర్తిని నశింపజేసే భక్తులకు ఆధారభూతుడవైన నీ పాదారవిందాలను భయంకరమైన సంసార దావాగ్నిచే బాధపడుచున్న నేను నా భయం నశించడంకోసం సేవిస్తున్నాను. దేవదేవుడవు. సుఖమిచ్చేవాడవు. నీకు నమస్కారం. సృష్టి స్థితి లయాలనుచేసే బ్రహ్మ విష్ణు మహేశ్వరులకన్నా వేరుకాని నీకు నమస్కారం. విశ్వాదిరూపుడవైన నీకు నమస్కారం పంచ తన్మాత్రల యొక్క సారమైనవాడవు జ్ఞానానంద స్వరూపుడవు అయిన నీకు నమస్కారం. సర్వశరీరధారులలో నివసించిఉన్నావు. భార్యతోకూడిన దేహంకలవాడివి. ఆమెకన్న భిన్నమైన ఆత్మశక్తి కలవాడవు. అన్ని శక్తులకన్నా గొప్పదైన శక్తికలవాడవు.

శక్తిమాత్రంచేతనే ప్రకాశించే గొప్పవాడవగు నీకు నమస్కారం. స్వయంప్రకాశం కలవాడవు. నిత్యుడవు. పరమజ్ఞాన స్వరూపుడవు. విశుద్ధుడవు. ఆగామి సంచిత ప్రారబ్ధాలనే మూడు రకాలైన కర్మలు లేనివాడవు అయిన నీకు వందనం. ఉపనిషత్తులలో రహస్యంగా ఉన్న వాడవు. వేదాలను ప్రకాశింపజేయువాడవు. ఎఱుకపడని చేష్టలు కల వాడవు. త్రిగుణాలకు చెందిన షడ్వర్గాలు లేనివాడవైన నీకు అభి వందనం. కళ్యాణరూపుడవు. శుభాలనిచ్చువాడవు. చావులేనివాడవు. శాంతమైనవాడవు అయిన నీకు నమస్కారం. కఠినత్వం లేనివాడవు. చూడశక్యంగాని శరీరం కలవాడవు. గొప్ప పాపసమూహాలను నశింపజేయువాడవు. సంసారసంబంధమైన విచారాలను పోగొట్టే వాడవు అయిన నీకు వందనం. భక్తులమాయలను పోగొట్టువాడవు. నిర్మలమైన పరమాత్మగుణాలు కలవాడవు. అణువుకన్నా చిన్నవాడవు. ప్రపంచంలోని పెద్దవస్తువుల కన్నింటికన్నా పెద్దవాడవు అయిన నీకు నమస్కారం. పినాకమనే ధనస్సును ధరించినవాడవు. పార్వతీపతివి. విఘ్నేశ్వర కుమారస్వాములకు తండ్రివైన నీకు వందనం. మన్మథు నకు విరోధివి. కాలకూటవిషాన్ని మ్రింగినవాడవు. ప్రమథగణా లకు నాయకుడవు. శ్మశానవాటికలో నివసించువాడవు అయిన నీకు వందనం. త్రిపురారి సంహారం చేసినవాడవు. దక్షునియజ్ఞాన్ని నాశనం చేసినవాడివి వీరభద్రావతారం ధరించినవాడవు అయిన నీకు నమ స్కారం. ప్రపంచనాయకుడా! శాశ్వతమైనవాడా రుద్రా! విరూ పాక్షా! మృత్యుంజయా! నన్ను రక్షించు. సుఖమిచ్చేవాడా! చంద్రుని శిరస్సున ధరించిన శాంతమూర్తీ! పార్వతీపతీ! సూర్య చంద్రాగ్నులను మూడు కన్నులుగా కలవాడా! గంగను ధరించిన వాడా! భూతేశా! కైలాసవాసా! శంకరా! నమస్కారం." అని స్తుతించాడు.

సూతుడు పలుకుచున్నాడు :

ఈవిధంగా మహారాజు చే స్తోత్రంచేయబడిన భగవంతుడైన శంకరుడు పార్వతితోకూడా ప్రసన్నుడై "ఓరాజా! నీభక్తి చే పవిత్రమైన నీస్తోత్రంచే నేను ఆనందించాను. నీ చిత్తం అన్యాక్రాంతం కాకుండా నిత్యమూ నన్నే పూజించు. నీ భావాన్ని పరీక్షించేనిమిత్తం నేను బ్రాహ్మణుడనైనాను. వ్యాఘ్రరూపంలోవచ్చి మింగబడ్డస్త్రీ పార్వతియే! ఆవ్యాఘ్రంమాయారూపం. కాబట్టి నీబాణాలవల్ల చావలేదు. నీధైర్యాన్ని చూడటంకోసం నీభార్యనేయాచించాను. ఈకీర్తిమాలిని యొక్క నీయొక్క భక్తికి నేను సంతోషించాను. నీ వేవరం కోరినా ఇస్తాను. కోరుకో" అనగా "సంసారతాపంచే వ్యాప్తమైన నాకు పరమేశ్వరుడవైన నీసాక్షాత్కారరూపమే వరంగాఇవ్వదగింది. ఓదేవా! వరప్రదాతలలో శ్రేష్ఠుడవైన నిన్ను ఏవరమూకోరను. నేను నాభార్య నాతల్లి నాతండ్రి పద్మాకరుడనే వైశ్యుడు సునయుడనే అతడి కొడుకు మమ్మందరినీ ఎప్పుడూ నీదగ్గరే ఉండేటట్లుగా అనుగ్రహించు." అని అర్థించాడు.

తరవాత కీర్తిమాలిని భక్తితో శంకరునికి నమస్కరించి "ఓ మహాదేవా! నాతండ్రి చంద్రాంగద మహారాజుకూ, తల్లి సీమంతినికీ నిత్యమూ నీసాన్నిధ్యం ప్రసాదించు" అని వేడుకొన్నది.

సూతుడుచెపుతున్నాడు : భక్తులయందు వాత్సల్యంగల ఆ పరమేశ్వరుడు "అదేవిధంగా అగుగాక" అని ప్రసన్నుడై కోరిన వరాలిచ్చి క్షణంలో అంతర్ధానమయాడు. ఆ మహారాజు తనపట్టణాన్ని చేరి ఈశ్వరానుగ్రహంపొంది కీర్తిమాలినితో కూడి సకల భోగాలనూ అనుభవించాడు. అక్షీణబలోన్నతుడైన అతడు పదివేలసంవత్సరాలు రాజ్యమేలి తరవాత కుమారులకు రాజ్యం అప్పగించి పరమేశ్వర

పదవిని పొందాడు. చంద్రాంగదుడు, సీమంతిని కూడా భక్తితో శంకరుని పూజించి కైలాసాన్ని చేరారు.

పవిత్రమైనదీ, విచిత్రమైనదీ, ఈశ్వరగుణాలను ప్రకటించేదీ అయిన ఈ పరమరహస్యాన్ని ఏపుణ్యాత్ముడు ఇతరులకు చదివి విని పిస్తాడో, నియమంతో పఠిస్తాడో అలాంటివాడు ఇహలోకంలో సర్వ సుఖాలూ అనుభవించి దేహాంతాన పరమేశ్వరుని పొందుతాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో భద్రాయుర్మహారాజుకు శివప్రత్యక్షకథనమనే ప్రసిద్ధమైన పదు నాల్గవ అధ్యాయం.

— / —

# పంచదశోధ్యాయం

సూతుడు శౌనకాదులతో చెపుతున్నాడు: నేను ఋషభు డనే పేరుగల శివయోగి సామర్థ్యాన్ని వివరించాను. మరోశివయోగి ప్రభావాన్ని గూర్చి చెప్పుతాను. మహాపాపాత్ములుకూడా విని కృతార్థత చెందే విభూతిమాహాత్మ్యాన్ని గూర్చి సంక్షేపంగా వివరిస్తాను.

పూర్వం వాసుదేవుడనే ఒకశివయోగి ఉన్నాడు. అతడు మహా తపశ్శాలి. సుఖదుఃఖాలకు అతీతుడు. నిర్మలుడు. శాంతుడు సంసార బంధం లేనివాడు. సమదృష్టి కలవాడు. ఆత్మారాముని ధ్యానించే వాడు. క్రోధాన్ని జయించినవాడు. ఇంటిని భార్యనువిడిచినవాడు. సంతోషి. దానం పుచ్చుకోనివాడు. భస్మంతో నిండిన సర్వా వయవాలు కలవాడు. జటామండలధారి. నారచీరలు, జింకచర్మం

ధరించినవాడు. భిక్షాపాత్రనుధరించినవాడు. సర్వ జనానుగ్రహంలో తత్పరతవల్ల లోకాలన్నీ తిరుగుతూ దైవయోగంవల్ల మహాభయం కరమైన క్రౌంచారణ్యాన్ని ప్రవేశించాడు. నిర్మానుష్యమైన ఆ వనంలో ఆకలి దప్పికలతో ఎప్పుడూ బాధపడుతూంఉండే ఒక క్రూర రాక్షసుడున్నాడు. అతడు శివయోగినిచూచి ఆకలిబాధతో అతణ్ని భక్షించడానికి వేగంగా పరుగెత్తాడు. భయంకరమైన కోరలతో, నోరుతెరచుకొని మహాకాయంతో వస్తున్న ఆ బ్రహ్మరాక్షసుణ్ణి చూచి యోగి ఏమాత్రం చలించలేదు. ఆరాక్షసుడు వేగంగా వచ్చి ఆయోగిని తన చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. లోహం చింతామణి తాకడంతో బంగారమైనట్లుగా, మట్టి జంబూనదాన్ని పొంది బంగారమైనట్లుగా, కాకులు మానససరోవరాన్ని పొంది రాజహంసలై నట్లుగా, ఒకసారి అమృతపానంచేసి నరుడు దేవరూపాన్ని పొంది నట్లుగా ఆశివయోగి శరీరస్పర్శచే బ్రహ్మరాక్షసుడు సమస్త పాపాలు నశించి నిర్మలుడైనాడు. మహానుభావులు తమ దర్శన స్పర్శనాదులచే మహాపాపులను కూడా వెంటనే పవిత్రీమొనరిస్తున్నారు.

కావున సజ్జనసాంగత్యం అతిదుర్లభమైంది. అంతకు ముందు క్షుత్పిపాసతో బాధపడుతున్న భయంకరమైన ఆ రాక్షసుడు వెంటనే తృప్తినిపొంది అధికసంతసాన్ని పొందగల్గాడు. అతని శరీరానికున్న తెల్లని విభూతికణ సంబంధం వల్ల వెంటనే నశించిన మహాపాపం, తమోగుణం, భయంకర దేహంకల ఆ రాక్షసుడు పూర్వజన్మ వృత్తాంత జ్ఞానం కలవాడై ఆ శివయోగి పాదారవిందాలకు సాష్టాంగ దండ ప్రణామంచేసి "కరుణానిధివైన ఓమహాయోగీ! నన్ను అనుగ్రహించు. సంసారతాపం పొందినవారికి ఆనందామృతవారధివైన నీ వనుగ్రహించు. సకలలోకభయంకరుణ్ణాయి మహాపాపుడనైన

నేనెక్కడ ? దయాసముద్రుడవూ మహాత్ముడవూ అగు నీదర్శన మెక్కడ ? ఘోరమైన దుఃఖసముద్రంలో మునిగిపోతున్న నన్ను ఉద్ధరించు. నిన్ను చూచినంతనే నాకు ఆనందం వెల్లువుతోంది'' అన్నాడు.

అప్పుడా వామదేవ యోగి "వనంలో తిరుగుతున్న నీవెవ్వడవు? ఘోరరాక్షసుడవై ఇక్కడ ఎందుకున్నావు ? మిక్కిలి ఘోరమైన ఈఅతికష్టగతిని ఎలాపొందావు ? అని ప్రశ్నించాడు. దానికి బ్రహ్మ రాక్షసుడు ఈజన్మకు పూర్వం ఇరవది అయిదవజన్మలో నేను మహా పరాక్రమశాలినై యవనరాజ్యపాలన చేసిన దుర్జయుడనే రాజును. దుష్టుడను. పాపాత్ముడను. మదగర్వితుడను అయి యథేచ్ఛగా సంచ రించేవాడిని. నిర్దయుడనై ప్రజల్ని హింసిస్తూ దండంబూని దుష్టవర్త నంతో ఉండేవాడిని. యవ్వనంలో చాలామంది భార్యలతో కూడి కామాసక్తిచే దుర్వ్యాపారానికి పాల్పడ్డాను. ప్రతిరోజునా ఒక నూత్న స్త్రీసంభోగేచ్ఛ కలిగిననాకు నాభృత్యులు నాఆజ్ఞకుబద్ధులై ఇతరదేశాలనుండికూడా స్త్రీలను తెచ్చేవారు. రోజుకొక స్త్రీతో సంభో గించి ఆ స్త్రీని అంతఃపురంలోఉంచి ఇతర స్త్రీలను రప్పించేవాడిని. ఈవిధంగా స్వరాష్ట్రంలో, పరరాష్ట్రంలో ఇతరదేశాలలో గ్రామా లలో పల్లెలలోఉన్న స్త్రీల నందరినీ బలాత్కారంగా తెప్పించి ప్రతి రోజూ నా భోగాసక్తిని తీర్చుకునేవాడిని. నేను అనుభవించిన స్త్రీలను ఇతరులు అనుభవించడంలేదు. వారంతా నా అంతఃపురంలో ఉంచబడి రాత్రింబవళ్ళు దుఃఖిస్తూ ఉండేవారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర అనే నాలుగుజాతుల స్త్రీలనుకూడా హరించాను. నా రాజ్యంలో బ్రాహ్మణులంతా తమ భార్యలతో మరోచోటికి పారి పోయారు. భర్తలున్నవారూ, కన్యకలు, విధవలు, రజస్వలలు

అనే భేదం లేకుండా అందరినీ హరించి కామాగ్రుడనై రమించాను. మూడువందలమంది బ్రాహ్మణస్త్రీలు, నాల్గువందలమంది క్షత్రియ స్త్రీలు, ఆరువందలమంది వైశ్యస్త్రీలు, ఒకవేయిమంది శూద్ర స్త్రీలు, నూరుగురు బాలకన్యకలు, వేయిమంది కిరాతస్త్రీలు, అయిదువందలమంది నాటకస్త్రీలు, నాలుగువందలమంది చాకలి స్త్రీలు, వేలకొలది భోగపుత్రీలతో నేను భోగించాను. అయినా నాకు కామం తీరలేదు. విషయలోలాసక్తికి లగిలి మత్తుడుగా పాపాత్ముడనై ఉండటంవల్ల యౌవనంలోనే క్షయ, కుష్ఠు మొదలైన మహారోగాలు ఆవహించాయి. రోగపీడితుడనై సంతానహీనుడనై శత్రువులచే పీడింపబడి మంత్రులు భృత్యులచే విడచిపెట్టబడి నా పూర్వకర్మవశాన మరణించాను.

'ఆయుర్వినశ్యతి యశోప విపద్యతేచ। భాగ్యం క్షయమాంత్యధియాతి దుర్గతిం। స్వర్గాచ్యవంతే పితరః పురాతనా ధర్మవ్యపేతస్య నరస్య నిశ్చయాత్'। ధర్మం తప్పిన మానవుడి ఆయుర్దాయం క్షీణిస్తుంది, కీర్తి నశిస్తుంది, అదృష్టం ఉండదు, దుర్గతి కల్గుతుంది. ఆతడి పితృదేవతలు పూర్వం స్వర్గంలోఉన్నప్పటికీ అక్కడనుండి జారిపడిపోతారు. అందువల్ల యమకింకరులు నన్ను యమలోకానికి తీసుకువెళ్లారు. యమధర్మరాజు చాలాకోపంతో నన్ను పీర్యకుండంలో పడవేయించాడు. ఆ నరకంలో ముప్పయివేల సంవత్సరాలు యమకింకరులచే పీడింపబడుతూ రేతఃపానం చేస్తూ గడిపాను. తరవాత పాపశేషంచే నిర్జనమైన ఈ అడవిలో నిత్యం ఆకలిదప్పికలచే చాలాబాధపడుతూ సహస్రశిశ్నాలతో జన్మించాను. పిశాచ రూపంతో నూరు దివ్యసంవత్సరాలు గడిపిన తరవాత మృతిబొంది రెండవజన్మలో ప్రాణులకు భయం గొలిపే వ్యాఘ్రంగా పుట్టాను. మూడోజన్మలో భయంకరమైనకొండచిలువగా, నాలుగోజన్మలో

తోడేలు, అయిదోజన్మలో పందిగా. ఆరులో ఊసరవిల్లిగా, ఏడులో కుక్కగా, ఎనిమిదింలో నక్కగా, తొమ్మిదిలో భయంగొలిపే గవయ మృగంగా. పదింలో లేడిగా, పదకొండులో పిల్లిగా, పన్నెండులో గద్దగా, పదమూడులో వానరగా, పదునాలుగులో కాకిగా, పదిహేనులో ఎలుగుబంటిగా, పదహారులో అడవికోడిగా. పదిహేడులో గాడిదగా, పదునెనిమిదింలో పిల్లిగా, పందొమ్మిదిలో కప్పగా, ఇరువైలో తాబేలుగా. ఇరవైఒకటిలో చేపగా, ఇరవైరెండులో ఎలుకగా, ఇరవైమూడులో గుడ్లగూబగా, ఇరవైనాల్గులో అడవిఏనుగుగా పుట్టి ఇరవైఅయిదో జన్మలో బ్రహ్మరాక్షసుడ నయ్యాను. ఈఅడవిలో చాలాకాలంనుండ ఆహారం లేక ఆకలికి బాధపడుతూ కనబడ్డనిన్ను మింగాలని ఆశపడ్డాను. నీ దేహం తాకడంతోనే పూర్వజన్మజ్ఞానం కలవాడ నయ్యాను. నీమాహాత్మ్యంవల్ల గడిచిన వేయిజన్మలవృత్తాంతం జ్ఞప్తికివస్తున్నది. అదీకాక నేను చాలాసుఖపడ్డాను. నాహృదయం నిర్మలమైంది. ఓమునీంద్రా! నీకీశక్తి తీవ్రతపస్సువల్లలభించిందా లేక పుణ్యతీర్థసంసేవనంవల్ల కలిగిందా? యోగాభ్యాసంవల్ల వచ్చిందా లేక దేవతలందుగలభక్తి చేత ఏర్పడిందా? మంత్రపునశ్చరణవల్ల వచ్చిందా? ఏవిధంగా కల్గింది? నిన్ను నేశరణుగోరాను. నాకు నిజంచెప్పు" అని ప్రశ్నించాడు.

అప్పుడు వామదేవుడు "ఇదంతా నాశరీరానికిపూసుకున్న విభూతిమహిమ" అనిచెప్పి "తామసగుణప్రధానుడవైన నీకు నా భస్మసంపర్కంవల్ల ఉత్తమగతి గలిగింది. భస్మప్రభావాన్ని శంకరుడు తప్ప ఇంకెవ్వరూ తెలిసికో లేరు. పరమేశ్వరశక్తి తెలుసుకోవడం ఎలా శక్యంకాదో అలాగే భస్మసామర్థ్యం తెలుసుకోలేము.

పూర్వం ద్రవిడదేశంలో ధర్మహీనుడైన నీవంటి ఒకబ్రాహ్మణుడుండేవాడు. అతడు కర్మచే శూద్రధర్మాన్నిపొంది దొంగతనాలు

చేస్తూ రహస్యంగా మిత్రుల కళత్రాలు చేస్తూ శూద్రస్త్రీసంపర్కం లోనే ఆసక్తి కల్గిఉండేవాడు. ఒకనాడా బ్రాహ్మణుడు శూద్రాంగనతో భోగిస్తుండగా చూచిన దానిభర్త అతణ్ణిచంపి ఊరవతల పారేశాడు, కర్మహీనమైఉన్న ఆకళేబరంపై దైవయోగంవల్ల భస్మంతో కూడిన పాదాలుకల ఒకకుక్క నడిచింది. అప్పుడు యమకింకరులు వచ్చి ఆబ్రాహ్మణుణ్ణి తీసికొనిపోయి భయంకరమైన నరకంలో పడేశారు. శివకింకరులు స్వయంగాఅక్కడకువచ్చి ఆబ్రాహ్మణుణ్ణి విమానంలో కూర్చుండబెట్టుకొని బలాత్కారంగా తీసుకుపోసాగారు. అప్పుడుకోపంతో యమధర్మరాజువచ్చి శివదూతలతో "ఎన్నో మహాపాతకాలుచేసిన ఈతడిని మీరెందుకు తీసుకుపోతున్నారని" అడిగాడు. దానికి శివదూతలు "ఈతడివక్షస్థలం, లలాటం, బాహుమూలం విభూతిచేచిహ్నితాలైనాయి. ఈతడి శరీరంచూడు. అందువల్లనే శివాజ్ఞనుపొంది ఈతణ్ణితీసుకుపోవడానికి వచ్చాం, యమధర్మరాజా! మమ్మల్ని వారించడానికి నీవుతగవు" అనిచెప్పి అందరూ చూస్తుండగా ఆబ్రాహ్మణుణ్ణి శివలోకానికి తీసుకుపోయారు.

కాబట్టి సమస్తపాపాలనూ నశింపజేసే మహేశ్వరాలంకారమైన భస్మాన్ని నేనెప్పుడూ ధరిస్తున్నాను" అని యోగేంద్రుడు చెప్పాడు. అప్పుడా బ్రహ్మరాక్షసుడు యోగితో "ఓమునీంద్రా! నీ దర్శనంచేత నేను చాలాధన్యుణ్ణి అయ్యాను. భయంకరమైన ఈనీచ జన్మనుండి నన్ను రక్షించు. నాకు పూర్వజన్మలో చేసిన పుణ్యం ఉందని తోస్తున్నది. అందువల్ల నేను నీదయచే సంసారబాధంనుండి విముక్తి పొందుతాను. నేనుపూర్వం మహారాజజన్మలో సస్యం, ఫలవృక్షాలతో కూడిన జీవనానికి పనికివచ్చే భూమిని ఒక బ్రాహ్మణుడికి దానంచేశాను. ఇరవైఅయిదవ జన్మలో ఒకానొక యోగి సహవాసంవల్ల సంసారం నుండి విముక్తి నందగలనని యముడు

చెప్పాడు. నేను పూర్వంచేసిన పుణ్యం ఇప్పుడు ఫలితానికి వచ్చింది. కాబట్టి ఈ నిర్జనారణ్యంలో నీ సహవాసం లభించింది. ఓ దయా సముద్రుడా! మహాపాపినై నీచజన్మలలో జన్మిస్తూ చనిపోతూ ఉన్న నన్ను మంత్రసహితమైన విభూతితో ఉద్ధరించు. గురువర్యా! ఈ భస్మాన్ని ఏవిధంగా ధరించాలి? దీనికి మంత్రమేది? విధానం ఏమిటి? కాలమేది? దేశమేది? దీనినంతా సవిస్తరంగాచెప్పు. పరోపకారపారీణులైన మహనీయులయిన మీవంటివారు కల్ప వృక్షాల మాదిరిగా ఆత్మహితాన్ని కోరరు."

సూతుడు చెప్తున్నాడు: అడవిలోఉన్న ఘోర రాక్షసు డా విధంగా పలకగా ఆ యోగీంద్రుడు గంభీరంగా

"వేదవేదాంగ శాస్త్రార్థవిదుషే బ్రహ్మవాదినే
సస్యారామగృహోపేత క్షేత్రదానం కరోతి యః
స మహాపాప సంఘాతం కృతం కోటి భవాంతరే
విధూయ ముక్తిమాప్నోతి సర్పోజీర్ణ మివత్వచం."

వేదవేదాంగాలూ, షట్ఛాస్త్రాలూ చదివి వాటి సారాన్ని గ్రహించి బ్రహ్మను తెలిసిన మహాత్మునికి సస్యం, తోటలూ, గృహాలూ- వీటితోకూడిన దానం ఎవడు చేస్తాడో ఆతడు కోటిజన్మల నుండి చేసిన పాపరాశిని నశింపజేసి కూసం విడిచిన సర్పంలా నిర్మలుడై ముక్తిని పొందుతున్నాడు. అలాంటివాడి పుణ్యం గూర్చి వర్ణించ డం ఆదిశేషుడికికూడా సాధ్యంకాదు." అని యోగీంద్రుడు భూదాన ఫలంచెప్పి తిరిగి భస్మమాహాత్మ్యాన్ని గూర్చి చెప్పడం మొదలు పెట్టాడు.

ఇది శ్రీస్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో భస్మమహిమానువర్ణనమనే ప్రసిద్ధమైన పదిహేనవ అధ్యాయం.

— / —

# షోడశోధ్యాయం

వామదేవయోగి చెప్పడం మొదలు పెట్టాడు:

పూర్వం అనేక విధాలైన గైరికాదిధాతువులతో చిత్రింప బడింది, అనేకజంతువులతో కూడింది, వివిధరకాలైన వృక్షాలూ-లతలతో ఒప్పారుతున్నదీఅయిన మందరపర్వతం మీదకు ఒకప్పుడు ప్రళయాగ్నిలా భయంకరుడూ, పూజ్యుడూ, విశ్వవందితుడూ, సకల భూతనాథుడూ అయిన శంకరుడు స్వేచ్ఛగా వచ్చాడు. నూరుకోట్ల రుద్రులాశంకరుని చుట్టూఉన్నారు. దేవదేవుడైన ఆ ముక్కంటి వారిమధ్య కూర్చున్నాడు. అప్పటికి దేవతలరాజు ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, వాయువు, యముడు. కుబేరుడు మొదలైన వారందరూ వచ్చారు. చిత్రసేనుడు మొదలైన గంధర్వులు, పన్నగులతో కూడిన ఖేచరులూ, విద్యాధరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు, గుహ్యకులు, నల, వసిష్ఠుడు మొదలైన బ్రహ్మర్షులు, నారదుడు మొదలైన దేవర్షులూ, మహనీయులైన పితృదేవతలూ, దక్షుడు మొదలైన బ్రహ్మలూ, ఊర్వశి మొదలైన అప్సరస్త్రీలు, చండిక మొదలైన సప్తమాతృకలూ, ద్వాదశాదిత్యులూ, అష్ట వసువులు, ఏకాదశరుద్రులూ, పూజ్యులైన త్రయోదశ విశ్వే దేవులు, ఇతర లోకపాలకులు, శంకరుని ప్రక్కనఉన్న మహా కాళుడు, నందీశ్వరుడూ, మహాతేజశ్శాలి అయిన వీరభద్రుడు, మహాబలవంతుడైన శంఖుకర్ణుడు, కదల్చశక్యంగాని ఘంటాకర్ణుడు, మాణిభద్రుడు, వృకోదరుడు, కుండోదరుడు, వికటుడు, బలవంతుడైన నికుంభుడు, మహోదరుడు, కర్ణసారుడు, కేతువు, భృంగి, రిటుడు, మహాతేజోవంతులూ, గొప్పశరీరంకల భూతప్రభువులు, నీలవర్ణులు, శ్వేతవర్ణులు, మంకెన పుష్పాలతో సమానమైన కాంతికల

వారు, హరితవర్ణులు, ధూసరవర్ణులు, కర్బురవర్ణులు, పీతవర్ణులు, లోహితవర్ణులు, నానావిధవర్ణం కలవారు, చిత్రాలైన అవయవాలు కలవారు, చిత్రవిలాసాలు కలవారు, మదాధిక్యం కలవారు, అనేక విధాలైన జూదగాళ్లు, అనేక రకాలైన వాహనాలు- అలంకారాలు కలవారు, వ్యాఘ్రముఖులు, సూకరముఖులు, మృగాననులు, మొసలి- కుక్క- నక్క- నెమలి- ఒంటె- గ్రద్ద- కొంగ- శరభం- ఖడ్గ- గరుడముఖులు, ఏకముఖులు, ద్విముఖులు, బహుముఖులు, ముఖాలులేనివారు, ఏకహస్తులు, త్రిహస్తులు, పంచహస్తులు, చేతులులేనివారు, పాదాలులేనివారు, అనేక పాదాలుకలవారు, ఒకే కన్నుకలవారు, నాల్గుకళ్లుకలవారు, పొడుగువారు, పొట్టివారు- వీరంతా భూతనాథుడైన శంకరుని చుట్టూ కూడిఉన్నారు.

ఆ సమయంలో తేజశ్శాలి, మునిశ్రేష్ఠుడు, విద్వాంసుడు, ధర్మస్వరూపుడు అయిన సనత్కుమారుడు జగత్ప్రభులైన పరమేశ్వరుని దర్శించడానికి వచ్చాడు. కోటి సూర్యులతో సమానమైన కాంతికలవాడు, దేవదేవుడు, సకలప్రపంచానికి ప్రభువు, మహా ప్రళయకాలంలో కల్లోలమైన సప్తసముద్రాలవంటి గొప్పధ్వనికల వాడు, ప్రళయకాలాగ్ని జ్వాలల ఆడంబరంవంటి జటామండలంతో ప్రకాశించేవాడు, ప్రకాశించే శిరోమణిమైన చంద్రరేఖతో ప్రకాశించేవాడు, వామకర్ణమందు తక్షకుణ్ణి, దక్షిణకర్ణమందు వాసుకినీ ధరించినవాడు, రెండుకుండలాలను ధరించినవాడు, నీలరత్నాలవంటి గొప్ప హనువుకలవాడు, నల్లనికంఠంకలవాడు, జానువువరకూ వ్రేలాడేచేతులు కలవాడు, సర్పాలచే అలంకరించబడినవాడు, సర్పరాజులనే కంకణాలుగా బాహుపురులుగా చిహ్నితమైనవాడు, అనంతుని వేయిపడగల మణులచే రంజింపబడిన మొలనూలు కలవాడు, పులిచర్మం ధరించినవాడు, గంటలు- అద్దాలచే అలంకరించబడిన

వాడు, కర్కోటకుడు- మహాపద్మము- ధృతరాష్ట్రుడు- ధనంజ యుడు అనే సర్పాలచే ధరించబడిన అందెలధ్వనివల్ల ప్రకాశించే పాదాలుకలవాడు, ప్రాసం, తోమరం, ఖట్వాంగం, ఘంట, త్రిశూలం, ధనస్సు- వీటిని ధరించినవాడు, కదల్పశక్యం కానివాడు, నిర్దేశింపశక్యం కానివాడు, ఊహింపశక్యంకాని ఆకారంకలవాడు, రత్నసింహాసనాసీనుడూ అయిన శంకరునికి సనత్కుమారుడు నమస్క రించాడు. మహాభక్తితో వికసించిన వాక్కులచే స్తుతించి దోసిలొగ్గి వినయంతో వంగినకంఠం కలవాడై శుభప్రదాలైన సకలధర్మాలను గూర్చి అడిగాడు.

వాటన్నింటికీ శివుడు సమాధానం చెప్పాడు. తిరిగి ఆ మునీం ద్రుడు "ఓ భగవంతుడా ! మనుజులే ధర్మాలనువిని పాపవిముక్తులై సంసారసముద్రం తరించుతున్నారో నీవల్ల విన్నాను. తక్కువశ్రమ, ఎక్కువ ఫలంకలదీ, మనుష్యులకు వెంటనే ముక్తినిచ్చేదీ అయిన మరోగొప్పధర్మాన్ని నాకు దయతోచెప్పు. బహుప్రయాస జన కాలు, శాస్త్రంలో చూపబడిన అనేకవేలధర్మాలు చక్కగా సేవింప బడినవై సఫలానికి సిద్ధించవచ్చు లేదా కాకపోవచ్చు కాబట్టి లోకోత్తరమైందీ, భుక్తిముక్తిదాయకమైందీ, రహస్యమైందీ అయిన ధర్మాన్ని నీవల్ల వినాలని కుతూహలంగా ఉన్నది" అని అడిగాడు.

అప్పుడు శివుడు "సమస్త ప్రాణులకూ త్రిపుండ్రధారణం సమస్త ధర్మాలలో ఉత్తమమైంది, అది వేదచోదితమైంది, పరమ రహస్యమైంది" అని చెప్పగావిని సనత్కుమారుడు "ఓ మహేశ్వరా! నాకు త్రిపుండ్ర విధానం గూర్చి చెప్పు. నీ అనుగ్రహంవల్ల త్రిపుండ్ర విధానంగూర్చి వినాలని కోరికగా ఉంది. త్రిపుండ్రానికి స్థానా లెన్ని ? ద్రవ్యం ఏది ? శక్తి ఏది ? దేవత ఏది ? ప్రమాణ మెంత ? కర్త ఎవరు ? మంత్ర మేది ? దాని ఫలమేమిటి ? త్రిపుండ్రానికి

లక్షణమేది? లోకహితంకోరి ఈ విషయమంతా నాకు చెప్పవలసింది" అని ప్రశ్నించాడు.

అప్పుడు శివుడు "ఓ మహామునీంద్రా! దహింపజేసిన గోమయంవల్ల పుట్టిన భస్మఅగ్ని దేవతాకమని చెప్పబడింది. అదియే త్రిపుండ్రానికి ద్రవ్యంగా చెప్పబడింది. బ్రహ్మను తెలియజేసే "సద్యోజాతం ప్రపద్యామి" ఇత్యాది అయిదు మంత్రాలచే భస్మాన్ని గ్రహించి "అగ్నిరితి భస్మ" ఇత్యాది మంత్రాలచే భస్మాన్ని మంత్రించాలి. ఓ మునీంద్రా! వేదాలను చదివిన బ్రాహ్మణోత్తములు నీళ్ళతో తడిపిన భస్మాన్ని "త్ర్యయంబకం యజామహే" అనే మంత్రాలచే త్రిపుండ్రంగా ధరించాలి. బ్రహ్మచారులు పైన చెప్పిన భస్మాన్నే "మేధావిభూయాసం" అనే మంత్రాలచే ధరించాలి. జనులు భుక్తి ముక్తి కలిగించే త్రిపుండ్రాన్ని శిరస్సునందు, లలాటమందు, కంఠమందు, రొమ్మునందు, ముక్కునందు, పార్శ్వాలు రెండింటియందు, రెండుభుజాలయందు, బాహువులపై మధ్యలందు, హస్తాలయందు, పృష్ఠభాగమందు, భుజమూపురమందు నిత్యం ధరిస్తే మాయ అనే పాశం నుండి విముక్తులవుతారు.

పైన చెప్పబడ్డ పదిహేను స్థానాలలో త్రిపుండ్రాన్ని ధరించినవాడు ఎటువంటి పాపాత్ముడైనా నమస్కరించదగ్గవాడు. వాడు సాక్షాత్తు శివుడితో సమానం. మోక్షార్థులు ప్రమాదవశాన అయినా భస్మాన్ని ధరించకుండా ఉండకూడదని వేదప్రసిద్ధం. ఇంత గొప్ప మహిమగల త్రిపుండ్రధారణకు ఎవరికి ద్వేషభావం కల్గుతుందో వారు పూర్వజన్మలలో మహాపాపం చేసినవారని చెప్పవచ్చు. ఎవరికి త్రిపుండ్రధారణంలో, దాని మహిమను గూర్చిన కథలలో శ్రద్ధకలగదో వారు పూర్వజన్మలలో మహాపాపాలు చేసినవారు.

"మానస్తోకే మానఆయుషే"త్యాది మంత్రాలచే భస్మను నీళ్ళతో కలిపి "త్ర్యంబకం యజామహే" అనే మంత్రాలచే శిరస్సున ధరించాలి 'త్రియాయుషం జమదగ్నే' అనే మంత్రాలచే ఫాలభాగం, తొడలు, భుజాలు, భుజమూపురాలు మొదలైనచోట్ల ధరించాలి. పైన చెప్పిన అవయవాలేకాక శరీరమందంతట మంత్రించిన భస్మను పూసుకోవచ్చు. అలా ధరించడంవల్ల అనేక జన్మలలో చేసిన పాపం నశిస్తుంది. సమస్త పాపాలను నశింపచేయగలగడంవల్ల 'భ' అనే అక్షరమూ, పరమశివస్మరణ కలగడంవల్ల 'స్మ' అనే అక్షరము కలిసి "భస్మ" అయింది.

అటువంటి భస్మధారణంవల్ల సకలపాపాలు నశించి శివస్మరణ చేసిన ఫలం లభిస్తుంది. కంఠమందు ధరించినభస్మ శిరస్సుచేత చేయ బడిన పాపం పోగొడుతుంది. బాహువులందు ధరించిన భస్మ బాహువుల పాపాన్ని, వక్షస్థలమందు ధరించిన భస్మ రొమ్ము చేసిన పాపాన్ని, నాభియందు ధరించిన భస్మ శిశ్నకృతి పాపాన్ని, పృష్ఠ భాగాన ధరించిన భస్మ గుదస్థానమందలి పాపాన్ని, పార్శ్వమందు ధరించిన భస్మ పరస్త్రీ ఆలింగన పాపాన్ని పోగొడుతుంది. భస్మతో మిళితమైన ఆహారాన్ని భుజించినవాడై, భస్మచే చల్లబడిన పక్క మీద పరుండినవాడై, భస్మచే పూయబడిన శరీరం కలవాడై, భస్మ స్నానం చేయబడినవాడై ఉంటే సకలపాప విముక్తినందుతాడు. ఇందు కేమీ సందేహంలేదు. ఇది కేవం లింగధారుల విషయం.

ఓ మునీంద్రా! పైన చెప్పిన పదిహేను స్థానాలలో మూడు రేఖలు ఉండాలి. కనుబొమ్మల మధ్యనుండి కనుబొమ్మల చివర వరకూ మధ్యవ్రేలు, అనామికావ్రేళ్ళ మధ్యయందు ప్రతికూలంగా బొటనవ్రేలితో చేయబడినదానిని త్రిపుండ్రమంటారు. మూడు రేఖలకు వేరువేరుగా తొమ్మిదిమంది దేవతలున్నారు. అందులో అకారం

గార్హపత్యాగ్ని భూమి, ఆత్మ, రజోగుణం, ఋగ్వేదం, క్రియాశక్తి, ప్రాతస్సవనం, మహాదేవుడు మొదటిరేఖకు దేవతలు. ఉకారం దక్షిణాగ్ని, ఆకాశం, సత్వగుణం, యజుశ్శాఖ, మాధ్యం దినసవనం, ఇచ్ఛాశక్తి, అంతరాత్మ, మహేశ్వరుడు, రెండవ రేఖకు దేవతలు. మకారం, ఆహవనీయాగ్ని, పరమాత్మ, తమోగుణం, స్వర్గం, జ్ఞానశక్తి, సామవేదం, తృతీయ సవనం, శివుడు మూడవ రేఖకు అధిదేవతలు.

మానవుడు శుద్ధాంతఃకరణం గలవాడై వీరికందరికీ నిత్యమూ నమస్కరించి త్రిపుండ్రాన్ని ధరించాలి. ఇదియే మాహేశ్వర వ్రతమని సర్వవేదాలయందూ చెప్పబడింది. ముక్తినికోరే నరులు ఈ మాహేశ్వర వ్రతం సేవించాలి. అలాంటివారికి తిరిగి జన్మలేదు. బ్రహ్మచారీ, గృహస్థు, వానప్రస్థు, సన్యాసి- వీరిలో ఎవరైనా విధానప్రకారం భస్మ 'చే' త్రిపుండ్రాన్ని ధరిస్తున్నాడో ఆతడు బ్రహ్మహత్యాది మహాపాపాల నుండి, ఉపపాతకాలనుండి విముక్తుడవుతున్నాడు. అలాగే ఇతరులగు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలైనవారు పైన చెప్పిన త్రిపుండ్ర వ్రతాన్ని చేసినట్లయితే స్త్రీ హత్య, గోహత్య, వీరహత్య, భ్రూణహత్య మొదలైన పాపాలనుండి అయినా విముక్తి గాంచుచున్నారు. మంత్రం లేకుండాగానీ, దీని మహిమ తెలియకుండాగానీ లలాటాన త్రిపుండ్రాన్ని ధరించినవాడు సర్వపాపాలనుండి విడువబడుచున్నాడు. పరద్రవ్యాపహరణం, పరభార్యలను స్పృశించడం, పరనింద, ఇతరుల భూముల్ని హరించడం, ఇతరులను బంధించడం, పంటలను, తోటలను పాడుచేయడం, ఇళ్ళను తగలపెట్టడం మొదలైన పనులను, అబద్ధమాడటం, చాడీలుచెప్పడం, వడ్డీవల్ల జీవించడం, వేదాలను అమ్మడం, అబద్ధపు సాక్ష్యం చెప్పడం, నియమాలను విడిచిపెట్ట

డం, కపటనాటక మాడటం, నీచులను సేవించడం, గోవులు, భూమి, బంగారం, గేదె, నువ్వులు, కంబళీవస్త్రాలు, అన్నం, ధాన్యం, ఉదకం– వీటిని నీచులనుండి ప్రతిగ్రహించడం, మాంసం, తోలు, నేయి, నూనె మొదలైనవి, ఉప్పు– వీటిని విక్రయించడం మొదలైన పాపాలనూ, దాసీది, భోగముది, వర్ణసంకరానిది, నాట్యకత్తె, రజస్వల, కన్య, విధవ– వీటితో సంగమ దోషాన్ని - త్రిపుండ్రధారణం నశింపజేస్తుంది. శివద్రవ్యాన్ని హరించడం, శివుని నిందించడం వంటి పాపాలు ప్రాయశ్చిత్తాలవల్ల పోవు. ఏ మనిషి శరీరమందు రుద్రాక్ష, లలాటప్రదేశమందు త్రిపుండ్రధారణం ఉంటాయో అతడు చండాలుడైనా సకలలోకాలలో పూజ్యుడై సమస్త వర్ణాలలో ఉత్తముడవుతాడు. లోకంలో ఏ నరుడు తన లలాటభాగాన త్రిపుండ్రాన్ని ధరిస్తాడో అలాంటివాడు ఈ లోకంలో ఉన్న సమస్త తీర్థయాత్రలను సేవించి గంగాది దివ్యపుణ్యనదులలో స్నానం చేసినవాడవుతాడు. పంచాక్షర మంత్రం మొదలైన ఏడు కోట్ల మహామంత్రాలున్నాయి. అలాగే మోక్షకారణాలైన శివ సంబంధమైన ఇతర మంత్రాలు కోట్లకొలది ఉన్నాయి. త్రిపుండ్రాన్ని ధరించినవానిచే ఆ శైవమంత్రాలన్నీ జపించబడినవవుతాయి. ఎవడు త్రిపుండ్రాన్ని ధరిస్తాడో అతడు తన వంశంలో పుట్టబోయే వేయితరాలవారిని నరకం నుండి ఉద్ధరిస్తాడు. ఈ లోకంలో సకల భోగాలనూ అనుభవించి రోగాలులేక చిరకాలం జీవితాంతంలో సుఖ మరణాన్ని పొందుతాడు. అష్టైశ్వర్యాలతోకూడి తరవాత దేవతా దేహం వహిస్తాడు. చివరలో దేవతావిమానం ఎక్కి వందలకొద్దీ దేవతాస్త్రీలచే సేవించబడి, విద్యాధరులు, సిద్ధులు, తేజోవంతులైన గంధర్వులు, ఇంద్రుడు మొదలైన లోకపాలకులు లోకాలలో క్రమంగా సకలభోగాలను అనుభవించి ప్రజాపతుల స్థానాలలో

వసించి, బ్రహ్మపదవినిపొంది అచ్చట నూరుకల్పాలవరకూ విహ రిస్తాడు. తరవాత విష్ణులోకంలో బ్రహ్మయుర్దాయాంతం వరకూ సుఖిస్తాడు. ఆ తరవాత శివలోకంపొంది చాలాకాలం అచ్చట భోగాలనుభవించి శివసాయుజ్యం పొందుతాడు. అలాంటివాడికి మళ్ళీ పునర్జన్మలేదు. పెద్దలు సర్వోపనిషత్తుల సారాన్ని బాగా ఆలోచించి త్రిపుండ్ర ధారణమే శ్రేయోదాయకమని నిశ్చయిం చారు. యజ్ఞహోమగుండంలోని భస్మమూ, పరబ్రహ్మ- ఈ రెండూ సంసారతారకాలు. సంసారవిషంచే భీతిపొందేవారు ఈ రెండింటిలో ఏదోఒకదానిని సేవించాలి. ఓ మునీంద్రా! నీకీ త్రిపుండ్ర మాహా త్మ్యాన్ని నేను సంక్షేపంగా చెప్పాను. నీవీ మంత్రాన్ని ఇతరులకు తెలియనీకుండా రహస్యంగాఉంచు."

వామదేవుడు చెపుతున్నాడు. "ఈ విధంగాపలికి పరమేశ్వ రుడు అక్కడే అంతర్ధానమయాడు. ఆ సనత్కుమారుడుకూడా బ్రహ్మలోకానికి వెళ్లాడు. కాబట్టి నీకుకూడా భస్మసంపర్కంవల్ల నిర్మలమైన బుద్ధికలిగింది. ఓ బ్రహ్మరాక్షసుడా! నీవుకూడా పవిత్ర మైన త్రిపుండ్రాన్ని శ్రద్ధగా ధరించు" అని చెప్పాడు.

సూతుడు చెప్పుతున్నాడు: మహాతపస్సంపన్నుడైన వామ దేవుడనే శివయోగి ఆ విధంగాచెప్పి భస్మను అభిమంత్రించి ఆ ఘోరరాక్షసుడికిచ్చాడు. ఆ భస్మాన్ని ఆ బ్రహ్మరాక్షసుడు తన లలాటాన వెంటనే త్రిపుండ్రంగా ధరించాడు. దాని మహిమవల్ల వెంటనే బ్రహ్మరాక్షస రూపం పోయింది. అతడు కాంతిసమూ హంతో ప్రకాశిస్తూ సూర్యునితో సమానంగా తేజరిల్లాడు. లోకో త్తరమైన అవయవాలు, రూపం, శోభకలవాడై, లోకోత్తరమైన పూలదండలు, వస్త్రాలచే ప్రకాశించాడు. తరవాత గురువైన ఆ శివ యోగికి భక్తితో నమస్కరించి దేవవిమానంఎక్కి పుణ్యలోకా

నికి వెళ్ళిపోయాడు. వామదేవుడు ఆ బ్రహ్మరాక్షసుడికి ఉత్తమ మార్గాన్ని చూపించి సాక్షాత్తు లోకాత్ముడైన శివుడివలె గూఢంగా సంచరించసాగాడు. ఏ నరుడు భస్మమహిమను మూడు సంధ్యలలో వింటాడో ఆతడు పరమపదవిని పొందుతున్నాడు. ఓ మునివర్యులారా! మీరు ముక్తిదాయకమైన శివచరిత్రను చెప్పుకుంటూ ఉండండి. శివయోగులచే ధ్యానించతగు ఈశ్వర పాదారవిందాలకు నమస్కరించండి. మీ ఫాలభాగాన తెల్లతామర పద్మంలా ప్రకాశిస్తున్న త్రిపుండ్రాన్ని ధరించండి. ఈ విధంగా చేస్తే ఈ లోకంలో తిరిగి తల్లి గర్భవాసం పొందరు." అని చెప్పాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో భస్మధారణవిధి అనే పదహారవ అధ్యాయం.

—/—

# సప్తదశోధ్యాయం

ఋషులు ప్రశ్నించారు :

వేదవేదాంగరహస్యాన్ని తెలిసినవారు బ్రహ్మజ్ఞానసంపన్నులైన గురువులచే ఉపదేశింపబడ్డ మానవులకు వెంటనే మంత్రసిద్ధి కలుగుతుంది. అలాకాకపోతే విద్వాంసులుకాని సామాన్యగురుజనం చేత ఉపదేశంపొందిన నరులకు మంత్రసిద్ధి ఎలాకల్గుతుంది?

సూతుడు చెపుతున్నాడు :

సకలజనులకు శ్రద్ధయే తల్లివలె హితంచేకూరుస్తుంది. నరులకు శ్రద్ధఉంటే భూలోక స్వర్గలోకాలలో సిద్ధికల్గుతుంది. శ్రద్ధగా సేవిస్తున్న పురుషుడికి రాయికూడా ఫలమిస్తుంది. భక్తితో పూజించబడ్డ

మూర్ఖుడుకూడా సిద్ధినిచ్చే గురువవుతున్నాడు. బాగా శ్రద్ధగా పఠించబడ్డ మంత్రం శాస్త్రంలో చెప్పబడినట్లు లేకపోయినా ఫలమిస్తుంది. శ్రద్ధతో పూజించబడిన దేవుడు నీచుడికికూడా ఫలమిస్తాడు. అశ్రద్ధగా చేసిన పూజ, దానం, యజ్ఞం, తపస్సు, వ్రతం – గొడ్డుమోతుచెట్టు పువ్వులావ్యర్థాలు (అశ్రద్ధయా కృతా పూజా దానం యజ్ఞస్తపో వ్రతం, సర్వం నిష్ఫలతాం యాతి పుష్పం వంధ్యతరోదివ') అన్నిటికన్నా సందేహాంకలవాడూ, శ్రద్ధలేనివాడూ, చపలచిత్తుడూ, పరమార్థంవల్లభ్రష్టుడైనవాడు సంసారాన్ని ఎప్పటికీ వీడలేరు. 'మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ' మంత్రం, పుణ్యతీర్థం, బ్రాహ్మణుడు, దేవుడు, జ్యోతిష్కుడు, వైద్యుడు, గురువు – వీరివట్ల ఎలాంటిభావం ఉంటుందో అలాంటిసిద్ధియే కలుగుతుంది. ఈప్రపంచం భావమయం కాబట్టి మనోభావంచేత పుణ్యపాపాలు లెక్కించేవాడికే పుణ్యపాపాలులభిస్తాయి. వాటియందు మనఃప్రవృత్తి లేనివారికి ఆ పుణ్యపాపాలు అంటవు, ఏకథలువింటే అందరికీ అశ్రద్ధతొలగుతుందో, భక్తిశ్రద్ధలుకలిగి మనస్సుచే నివృత్తి మార్గాన్ని పొందుతారో అటువంటి భక్తులవిషయమై చాలా ఆశ్చర్యకరమైన ఒకఇతిహాసాన్ని చెపుతాను వినండి.

పూర్వం పాంచాలదేశపురాజునకు సింహకేతుడనే ఒక కొడుకున్నాడు. అతడు దేవేంద్రుడికి అగ్నుడిలా ప్రకాశించాడు. సకల సద్గుణరాశి అతడు. ఒకప్పుడాతడు బలశాలులైన కొందరుభటులతో కూడి వేటాడటానికి అడవికివెళ్లాడు. అతని భృత్యుడైన ఒకకిరాతుడు వేటకోసంతిరుగుతూ ఒకచోట జీర్ణావస్థలోఉన్న ఒకదేవాలయాన్ని చూచాడు. అక్కడే విడిపోయినపీఠంతో భూమిమీదపడిఉన్న ఒక చిన్నశివలింగాన్ని కనుగొన్నాడు. తనఅదృష్టమే ఆరూపంగా దిగి

వచ్చిందని తలచి దాన్ని తీసుకొని పుణ్యకర్మ ప్రేరితుడై వెళ్ళి "ఓ రాజా ! అందమైన ఒకశివలింగాన్ని చూచి తీసుకువచ్చాను. ఇదిగో చూడు" అనిచూపించాడు. "ఓరాజా ఈశివలింగాన్ని నాశక్తివంచన లేకుండా ఆదరంతో పూజిస్తాను. కాబట్టి పూర్వం మంత్రశాస్త్రజ్ఞులు చేసిన పూజవల్ల శివుడు ఎలాసంతోషించాడో ఆపూజావిధానాన్ని నాకుచెప్పు" అని రాజును ప్రశ్నించాడు.

అదివిని పరిహాసంగా రాజనవ్వి "కొత్తజలంతో, సంకల్పం చేసి అభిషేకం ఒనర్చాలి. పరిశుభ్రమైన ఆసనంపై కూర్చుండి శుభప్రదమైనగంధం, అక్షింతలు, అడవిపూలు, ధూపదీపనీరాజనాలు మొదలైన ఉపచారాలుచేసి నిశ్చలమైనమనస్సుతో శివునిపూజించాలి. మొదట శివుడికి శ్మశానమందలిభస్మం కానుకగా సమర్పించాలి. తనకుపయోగపడేదీ లేదా మరియొకపదార్థంకానీ నివేదన చేయాలి. తరవాత ధూపదీపాది ఉపచారాలను మళ్ళీ సమర్పించాలి. నాట్యం, వాయిద్యం. సంగీతాలచే ఆరాధించి ప్రదక్షిణ నమస్కారాలుచేసి తరవాత ప్రసాదం స్వీకరించాలి. ఈ శివపూజా విధానం నీకు సామాన్యంగా చెప్పబడింది. శంకరుడు శ్మశానభస్మను కానుకగాఇస్తే వెంటనే సంతోషిస్తాడు" అని రాజు చెప్పాడు.

సూతుడు చెపుతున్నాడు : పరిహాసానికి అన్నప్పటికీ చండకుడనే ఆ కిరాతుడు రాజు మాటలను శిరసావహించి తన ఇంటికివెళ్ళి లింగాకారం దాల్చిన శివుణ్ని ప్రతిరోజూ శ్మశానభస్మను కానుకగా ఇచ్చి పూజించాడు. తనకు ఏ గంధపుష్పాదికాలు ప్రియమైనవో వాటిని శివుడికి నివేదించి తరవాత తాను ఉపయోగించుకునేవాడు. ఈ విధంగా ఆ కిరాతుడు భార్యతోకలిసి నిత్యమూ భక్తిశ్రద్ధలతో శివుణ్ని పూజిస్తూఅపరిమితమైన సుఖసంతోషాలను పొందాడు. కొంతకాలం గడిచింది. ఒకనాడు పరమేశ్వరుని కోసం తెచ్చిన

శ్మశానభస్మం పూజామండపంలో కనబడలేదు. వెంటనే ఆతడు చాలాదూరంపోయి వెదికి ఎక్కడా శ్మశానభస్మం కానరాక అలిసిపోయి తిరిగి ఇంటికి వచ్చాడు. తన భార్యను పిలిచి "ఓ ప్రియురాలా! ఇవాళ శ్మశానభస్మ నాకు ఎక్కడా లభ్యంకాలేదు. ఏమి చేయాలో చెప్పు. మహాపాపినైన నాకు ఇప్పుడు శివపూజకు విఘ్నమేర్పడింది. శివపూజ చేయకుండా ఒక్కక్షణంకూడా బ్రతకలేను. పూజాద్రవ్యాలు లేని ఈ సమయంలో ఏ ఉపాయంచే గుర్వాజ్ఞను అతిక్రమించకుండా చేయగలనో తెలియడంలేదు." అని కలవరం చెందిన భర్తతో కిరాతాంగన "భయపడకు. చక్కని ఉపాయం చెపుతాను. రకరకాలైన కట్టెలతో ఉన్న ఈ గృహాన్ని దహింపజేసి నేను అగ్నిలో ప్రవేశిస్తాను. తరవాత నీకు శ్మశానభస్మం లభిస్తుంది" అన్నది. అదివిని ఆతడు "ధర్మార్థకామమోక్షాలనే పురుషార్థాలకు ఈ దేహమే పరమసాధనం. నీవింకా సంతానవంతురాలవు కాలేదు. విషయసుఖాలను పూర్తిగా ఎఱుగవు. భోగాలను అనుభవించడానికి తగిన ఈ దేహాన్ని విడవడానికి ఏ విధంగా ఇష్టపడుతున్నావు?" అని ప్రశ్నించాడు. అప్పుడామె "ఎవడు పరులనిమిత్తం ప్రాణాలను విడిచిపెడతాడో అదే అతడి జన్మకు సాఫల్యం. కాబట్టి శివుడికోసం ప్రాణాలను విడవడంకన్నా పరార్థమేముంది? నేను పూర్వజన్మలో ఏ ఘోరతపం చేశానో! లేక మహాదానం చేశానో! అనేకవేల పూర్వజన్మలలో నేనెంత శివపూజ చేశానో! నా తల్లిదండ్రుల పుణ్యవిశేష మెంతఉందో! శివుని ఉద్దేశించి ప్రజ్వలించే ఈఅగ్నిలో శరీరం నా పుణ్యంవల్ల విడిచిపెడుతున్నాను" అన్నది. ఆమె స్థిరబుద్ధినీ, శివుని యందుగలభక్తినీ చూచి ఆతడు "అలాగే అగుగాక" అని దృఢసంకల్పంతో తిరిగి పూజచేయ నారంభించాడు.

అప్పుడామె భర్తకడకేగి నమస్కరించి నిర్మలమైన మనస్సుతో గృహాన్ని దహింపజేసి భక్తితో ఆ అగ్నికి ప్రదక్షిణ మొనర్చింది. తన గురువునకు నమస్కరించి, హృదయంలో శివుని ధ్యానించి, అగ్ని ప్రవేశానికి అభిముఖరాయె అంజలిఘటించి "ఓ దేవా! నా ఇంద్రియాలు నీకు పుష్పాలగుగాక! ఈ శరీరం అగరుధూపంగా, హృదయం దీపంగా, ప్రాణాలు హవిస్సులుగా, కరచరణాదులు నూతనాక్షతలుగా అగుగాక! ఈ నా జీవుడు పూజాఫలాన్ని ఇప్పుడు పొందుగాక! ఏను భూమండలాధిపత్యం కోరను. స్థిరమైన స్వర్గం కోరను. బ్రహ్మపదమందు నాకు కోరికలేదు. కాని నాకు మళ్ళీ జన్మఉంటే శంకరా! నీ పాదపద్మాలలోని మకరందంగ్రోలే ఆడు తుమ్మెదనుగా జన్మించగోరుతున్నాను. నాకు ఎన్ని వేలజన్మలు వచ్చినారానీ; అజ్ఞానకారణమైన మాయమాత్రం నా చిత్తంలో ప్రవేశించకుండా అనుగ్రహించు. నా హృదయం ఒక అరక్షణమైనా నీ పాదారవిందాలను విడవకుండా ఉండుగాక! శంకరా! నీకు నమస్కారం" అని ఆమె దేవదేవుని అనుగ్రహింప జేసుకొని స్థిరమైన నిశ్చయంతో అగ్నిలో ప్రవేశించి వెంటనే భస్మమయింది.

ఆ కిరాతుడు మహాప్రయత్నంతో ఆ చితాభస్మాన్నిగ్రహించి దగ్ధమైన తనఇంటిముందే నిశ్చలమైనమనస్సుతో శివపూజ చేశాడు. పూజాంతంలో ప్రసాదస్వీకారానికి అభిముఖుడై వినయపూర్వకంగా దోసిలొగ్గి నిత్యంవచ్చే తనభార్యనొకమారు తలచుకొన్నాడు. స్మరించినమాత్రాననే ఆమెవచ్చి వెనకనిలబడిఉంది. పూర్వశరీరంతో చిరునవ్వునవ్వుతూ భక్తితో వంగిఉండడం అతడు చూచాడు. భస్మమైపోయిన గృహమూ, భార్య యథాప్రకారం ఉండటంచూచి "ఇది స్వప్నమా! లేకమాయా లేక నే నీవిధంగా భ్రాంతిపడుతున్నానా?" అని ఆలోచించి భార్యను "ఓప్రియురాలా! అగ్ని

హోత్రంలో భస్మమయ్యావుకదా! తిరిగి ఎలావచ్చావు? దగ్ధమైన గృహంకూడా మునుపటిలాగానే ఉన్నదేమిటి?'' అని ప్రశ్నించాడు.

అప్పుడామె "నేను ఇంటిని ప్రజ్వలింపజేసి ఎప్పుడుఅగ్నిలో ప్రవేశించానో అప్పుడు నన్నుగానీ, అగ్నిహోత్రాన్నిగానీ నేను చూడలేదు. అమృతంలో మునిగినదానిలా నాదేహానికి వేడి ఏమాత్రం తగలలేదు. ఒకఅరక్షణం నిద్రించి మేల్కొన్నాను. అంతలో దగ్ధం కాకుండాఉన్న ఇంటినిచూచాను. ఇప్పుడు శివపూజాసమయాన మామూలుగా ప్రసాదంకోసం వచ్చాను'' అనిచెప్పింది.

ఈవిధంగా పరస్పరప్రేమాదరాలతో మాటలాడుకుంటున్న ఆపుణ్యదంపతుల ఎదుట ఒకదివ్యమైన విమానంవచ్చిఆగింది, నలుగురు ఈశ్వరభటులు సూర్యచంద్రుల్లా ప్రకాశిస్తున్న ఆ విమానంలో నుండి దిగి ఆ కిరాతదంపతులను శరీరాలతోటే తమహస్తాలతో ఎత్తుకొని విమానంలో కూర్చుండబెట్టారు. ఆదంపతులిద్దరూ శివదూతల హస్తస్పర్శవల్ల శివసారూప్యాన్ని పొందారు. భక్తితో ఈశ్వర పూజచేసి శివలోకాన్ని పొంది వారు అమితానందాన్ని గాంచారు,

కాబట్టి సకలపుణ్యకార్యాలలో శ్రద్ధయే ముఖ్యం. శ్రద్ధచేతనే నీచుడైన కిరాతుడుకూడా యోగులకు సాధ్యమైన పదవిని పొందాడు. సర్వమానవులలో ఉత్తమమైనజన్మతో ఏమిప్రయోజనం? వేద శాస్త్రపురాణవిమర్శగల విద్యతో ఏమిప్రయోజనం? ఏమానవుడు చిత్తమున పరమేశ్వరభక్తి ఉంటుందో అతడికన్నా ముల్లోకాలలో ధన్యుడైనపురుషుడు లేడు. ముమ్మాటికీ లేడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైనబ్రహ్మోత్తరఖండలో భక్తి మహిమోపాఖ్యానమనే ప్రసిద్ధినొందిన పదిహేడవఅధ్యాయం.

—/—

# అష్టాదశోధ్యాయం

సూతుడు చెప్తున్నాడు:

సమస్తధర్మాలలో ఉత్తమమైందీ, సర్వకార్యసిద్ధినిచ్చేదీ అయిన ఉమామహేశ్వరవ్రత మనేపేరన ప్రసిద్ధిచెందిన ఒకవ్రతాన్ని గూర్చి చెప్తాను.

ఆనర్తదేశంలో వేదరథుడనే బ్రాహ్మణుడు ఒకడున్నాడు. ఆతడు ఉత్తమవంశంలో పుట్టడమేగాక గొప్పపండితుడు. ఆతడికి భార్యాపుత్రులూ సకలరూపలక్షణోపేతఅయిన శారదఅనేపేరుగల కుమార్తె ఉన్నారు. శారదకు పన్నెండేళ్లువచ్చాయి. అప్పుడు భార్యా వియోగంపొందిన పద్మనాభుడనే ఒకవృద్ధబ్రాహ్మణుడు ఆమెను తనకిచ్చి వివాహంచేయుమని అర్థించాడు, గొప్పధనవంతుడూ, శూరుడూ, రాజచిహ్నాలుకల ఆ విప్రునియాచనకు భంగంవాటిల్లుతుం దనే భయంవల్ల వేదరథుడు తనకూతురు నాతనికిచ్చి పెళ్ళిచేశాడు. మధ్యాహ్నసమయంలో ఆకన్యకను వివాహమాడి అత్తవారింట్లో ఉన్న పద్మనాభుడు సాయంసంధ్య నుపాసించడానికై నదీతీరానికి వెళ్లాడు. యథావిధిగా సాయంసంధ్యనుపాసించి తిరిగి ఇంటికివస్తుం డగా పూర్వకర్మవశాన ఆ కటికచీకటిదారిలో ఒకపాముకరచి ఆతడు మరణించాడు. ఆ వార్త విని బంధువులందరూ అక్కడికివచ్చి మృత కళేబరాన్ని చూచి చాలాదుఃఖించారు. తరవాత వారందరూ దహన సంస్కారక్రియలుపూర్తి చేసి తమతమఇళ్లకు వెళ్లిపోయారు.

శారద వైధవ్యంపొంది పుట్టింటనే ఉండిపోయింది. వృద్ధుడూ. తనకిష్టంలేనివాడూ అయినభర్తతో వియోగాన్నిపొంది కొన్నినా సాలు తండ్రిఇంటనే గడిపింది. ఒకానొకరోజు నైధ్రువుడనేపేరుకల జాత్యంధుడైన ఒకవృద్ధబ్రాహ్మణుడు శిష్యులచేయిపట్టుకొని అక్క-

డకు వచ్చాడు. ఇంటికివచ్చిన ఆ వృద్ధుడిని తనపాలిట సాక్షాత్తు దైవంగా భావించి బంధువులందరూ వెళ్ళినతరవాత శారద ఆతడికి సేవచేసింది," ఓ మహాత్మా! నీకు కుశలమేనా? ఈ ఆసనంపై కూర్చుండండి. మునినాథా! మీకు నమస్కారం. నేను మీ ఆజ్ఞకు బద్ధురాలను." అనిపలికి చాలాభక్తితో ఆతడి పాదప్రక్షాళనమొనర్చి మార్గాయాసంపొందిన ఆతడికి సేదదీర్చి సంతోషపెట్టింది. తరవాత ఇంటిలోకి తీసుకొనిపోయి తనే స్వయంగా ఆతడికి అభ్యంగనస్నానం చేయించింది. స్నానంచేసి, దేవతారాధన పూర్తిచేసుకొని సుఖాసీనుడై ఉన్న ఆతడికి ధూపాదులచే పూజలొనర్చి సాదరంగా భోజనం పెట్టింది. ఆతడు మెల్లగా భోజనంచేసి తృప్తిపొంది ఆనందపారవశ్యంతో "నీవు యావజ్జీవితం భర్తతో విహరించి సర్వగుణసంపన్నుడైన ఒక కుమారుని బడసి ఈ లోకంలో అపారకీర్తినిపొంది దేవతానుగ్రహానికి పాత్రవుకమ్మ" అని ఆశీర్వదించాడు.

అంధుడైన ఆ వృద్ధుడుపలికిన మాటలకు ఆమె ఆశ్చర్యపడి అంజలిఘటించి "ఓ బ్రాహ్మణోత్తమా! సత్యమైన నీ వాక్యం ఎప్పటికీ అబద్ధంకాదు. నిర్భాగ్యనగు నాపట్ల అది ఏవిధంగా ఉపయోగిస్తుంది? చవిటిభూమిలో కురిసిన వర్షంలా, శునకానికిచేసిన అలంకారంలా, అదృష్టహీనులకు చేసిన బ్రహ్మవేత్తల ఆశీర్వాదం కూడా వ్యర్థంకదా! మునివర్యా! దుష్కర్మఫలభాగినిని. విధవరాలిని. నేను మీ ఆశీర్వాదానికి ఏవిధంగా తగుతాను?" అని ప్రశ్నించింది.

దానిని నైధ్రువుడు "గుడ్డివాడనైన నేను నిన్నుచూడకుండా ఏమి పలికానో దానినే సాధిస్తాను. నా ఆజ్ఞప్రకారంచెయ్యి. ఉమామహేశ్వర వ్రతాన్ని నీవు ఆచరిస్తే దాని మహిమవల్ల సర్వశ్రేయస్సులు పొందగల్గుతావు" అని చెప్పాడు. అప్పుడు శారద "నీవు ఉప

దేశించిన వ్రతం ఎంతదుర్లభమైనా గట్టిప్రయత్నంతో నేరు చేస్తాను. ఆవ్రతాన్నీ, దానిని ఆచరించే విధానాన్నీ నాకు విపులంగా సెల వియ్యి స్వామీ !" అని అర్థించింది.

దానికి నైధ్రువుడు "చైత్రమాసంలోగానీ, మార్గశీర్షంలో గానీ శుక్లపక్షంలో మంచిరోజున గురువుల ఆజ్ఞనుపొంది శాస్త్రోక్తంగా వ్రతాన్ని ఆరంభించాలి. అష్టమినాడుగానీ, చతుర్దశినాడు గానీ, రెండింటియందుగానీ శాస్త్రోక్తంగా సంకల్పంచేసి ప్రాతఃకాల మందే స్నానంచేయాలి. తరవాత పితృదేవతలను తృప్తిపఱచి, తన ఇంటికివెళ్ళి అందంగా అలంకరించిన మంటపాన్ని ఏర్పరచాలి. ఫలాలు, చిగుళ్లు, పూలు, తోరణాలతో ఆ మంటపాన్ని చక్కగా అలంకరించాలి. దానిమధ్యలో అయిదురంగుల ముగ్గులచే పద్మా లను వేయాలి. బయట అరవైనాలుగుదళాల పద్మాన్నీ, లోపల ముప్పయిరెండుదళాల పద్మాన్నీ, దానిలోపల పదహారుదళాల పద్మాన్నీ రచించాలి. ఈవిధంగా వేసిన అయిదురంగుల పద్మానికి బయటిభాగాన నాలుగుపలకలుగా వ్రాసి దానిమధ్య వర్తులాకారంగా వేయాలి. తరవాత ధాన్యంగానీ బియ్యంగానీ రాశిగా మంటపంపై పోసి మధ్యలో ఒకదర్భకూర్చనుంచి దాని పైభాగాన ధాన్యంతో నిండిన ఒక కలశాన్ని పెట్టాలి. ఆ కలశం పైభాగంలో బంగారంతో కూడిన ఒక వస్త్రాన్ని ఉంచాలి. దానిలో బంగారంతో చేయించిన పార్వతీపరమేశ్వరుల ప్రతిమలను అమర్చాలి. ఆ ప్రతిమలను యథా శక్తిగా పంచామృతాలతో శుద్ధోదకంతో స్నానంచేయించి పూజిం చాలి. ఏకాదశరుద్రాన్ని జపించి, ఎనిమిదివందల పంచాక్షర మంత్రాన్ని జపించాలి. తరవాత బంగారుపీఠంలో ఆ ప్రతిమలనుఉంచి పూజించాలి. శుభ్రమైన ఆసనంపై పొడిబట్టలుకట్టుకొని కూర్చుండి బుద్ధిగా ముందుగా మంత్రంతో పీఠార్చనచేసి తరవాత ప్రాణ

యామం చేయాలి. శివుని ఎదట అంజలిఘటించి సంకల్పం చెప్పాలి.

అనేకవేల జన్మలలో చేయబడిన ఏమహాపాపాలున్నాయో అవన్నీ నశించడంకోసం శివపూజ ప్రారంభించాలి. సౌభాగ్యం, వైభవం, ఆరోగ్యం, ధర్మం, ఐశ్వర్యం, అభివృద్ధి పొందడంకోసం స్వర్గమోక్షాలప్రాప్తికోసం శివపూజ చేస్తున్నాను అని సంకల్పంచేసి, నిశ్చలమనస్సుతో పూజించాలి. అంగన్యాస కరన్యాసాలు చేసి పరమేశ్వరుణ్ని ఈవిధంగా ధ్యానించాలి.

'కుందేందుధవళాకారం నాగాభరణభూషితం
వరదాభయహస్తంచ బిభ్రాణ పరశుం మృగం
కోటిసూర్యప్రతీకాశం జగదానందకారణం
జాహ్నవీజల సంసిక్త దీర్ఘపింగళ జటాధరం
భుజగేంద్ర ఫణోన్నద్ధ మహామకుట మండితం
శీతాంశు విలసత్ఖండ కిరీటాంతర భూషణం
ఉజ్వలత్ఫాల నయనం తథా సూర్యేందు లోచనం
నీలకంఠ చతుర్బాహుం గజేంద్రాజిన వాసనం
రత్నసింహాసనారూఢం నానాభరణభూషితం'

(మల్లెమొగ్గలలా చంద్రునిలా తెల్లనిదేహకాంతి కలవాడు, సర్పాలంకారాలచే అలంకరింపబడినవాడు, వరదం, అభయం అనే గుర్తులు హస్తాలలోకలవాడు, గండ్రగొడ్డలి, మృగం ధరించినవాడు, కోటిసూర్యులతో సమానమైన తేజస్సుకలవాడు, లోకానందానికి కారణమైనవాడు, గంగానదీజలంతో తడిసిన పొడవైన పచ్చని జడలను ధరించినవాడు, శేషునిపడగలపైగల మాణిక్యాలచేవ్యాప్తమైన కిరీటంచే అలంకరించబడినవాడు, కిరీటమధ్యభాగాన చంద్రరేఖను ధరించినవాడు, మండుచున్న లలాటనేత్రం కలవాడు, సూర్య

చంద్రులను నేత్రాలుగా ధరించినవాడు, నీలకంఠుడు, నాలుగు భుజాలుకలవాడు, గజచర్మాన్ని ధరించినవాడు, రత్నసింహాసనాన అధిష్ఠించినవాడు, అనేకాభరణాలచే అలంకరించబడినవాడు.)

ఆ తరవాత పార్వతిని—

'దేవీం చ దివ్యావయవాం బాలసూర్యాయుత ద్యుతిం
బాలవేషాం చ తన్వంగీం । బాలశీతాంశు శేఖరాం
పాశాంకుశాభయ వరాన్ । బిభ్రతీం చ చతుర్భుజాం
ప్రసాద సుముఖీం బాలాం । లీలారస విహారిణీం
లసత్కురవకాశోక । పున్నాగ నవచంపకైః
కృతావతంసా ముత్ఫుల్ల । మల్లికోత్కలితాలకాం
గరిడమండల సంయుక్త రత్నకుండల శోభితాం
బింబాధరానురక్తాంశు లసద్దశన కుట్మలాం
మహార్హ రత్నగ్రైవేయ । తారహార విరాజితాం
నవమాణిక్య రుచిర । కంకణాంగద ముద్రికాం
కాంచీకలాప పర్యస్త । జఘనాభోగశాలినీం
ఉదారకింకిణీ శ్రేణి । నూపురాఢ్య పదద్వయాం
రక్తాంశుకపరీధానాం । రక్తమాల్యానులేపనాం
ఉద్యత్పీనకుచద్వంద్వ । నిర్జితాంభోజ కుట్మలాం
ఆలోల లలితాపాంగీం । భక్తానుగ్రహదాయినీం'

అని ధ్యానించాలి.

(లోకోత్తరమైన అవయవాలుకలది, లేతసూర్యులతో సమానమైనకాంతి కలది, బాలవేషం కలది, సూక్ష్మశరీరం కలది, బాల శరీరం కలది, బాలచంద్రుడు శిరోమణిగా గలది, పాశం, అంకుశం, అభయం, వరం ధరించినది, నాలుగు బాహువులు కలది, అనుగ్రహం గలముఖం కలది, బాల అయినది. విలాసరసంలో విహరించేది. ప్రకా

శించే ఎర్రగోరింట, అశోకం, పొన్న, సంపెగ మొదలైన పుష్పాలచే అలంకరించబడింది, వికసించిన పూలచేఒప్పుచున్న ముంగురులుకలది, గండస్థలభాగాలలో భాసిల్లుచున్న రత్నకుండలాలు కలది, దొండ పండువంటి అధరోష్ఠకాంతిచే ప్రకాశిస్తున్న మొగ్గలవంటి దంతాలు కలది, అమూల్యమైన రత్నగ్రథితమైన కంఠాభరణం, ముత్యాలహారాలచే భాసిల్లుతున్నది, నూతనమణిఖచితమైన కంకణాలు, బాహుపురులు గలది, మువ్వలవడ్డాణంచే ప్రకాశించే జఘనసంపూర్తితో ఒప్పేది, గొప్పధ్వనిగల అందెలతో ఒప్పు పాదద్వయం కలది, ఎర్రని వస్త్రం కట్టుకొన్నది, రక్తచందనాన్ని దేహాన పూసుకొన్నది. తామరమొగ్గలను తిరస్కరించు స్తనద్వయం కలది, చలిస్తున్న అందమైన క్రీగంటిప్రసారంకలది, భక్తులకు అనుగ్రహం ఇచ్చేది అయిన పార్వతీదేవిని ధ్యానించాలి.)

పార్వతీ పరమేశ్వర రూపమైన మంత్రాన్ని జపించి తరవాత బాహ్యపూజ చేయాలి. రెండుప్రతిమలను ముందుగా ఆవాహనం చేసి ఆసనం మొదలైన ఉపచారాలు చేయాలి. పార్వతీ పరమేశ్వరులకు "నమస్తే పార్వతీకాంత నమస్తే భక్తవత్సల। త్ర్యంబక మహాదేవ గృహాణార్ఘ్యం సదాశివ। నమస్తే దేవి విశ్వేశి। ప్రపన్న భయహారిణి। అంబికే వరదే దేవి। గృహాణార్ఘ్యం శివప్రియే" అనే మంత్రాలతో మూడుమార్లు అర్ఘ్యం ఇవ్వాలి. గంధపుష్పాక్షతలు ఆభరణాలు ధూపదీపాలు అర్పించాలి. నేతితో తడిసిన పరమాన్నాన్ని నైవేద్యంగా సమర్పించాలి. తరవాత మూలమంత్రంతో నూటఎనిమిదిమార్లు హవిస్సులతో హోమం చేయాలి. నైవేద్యాన్నీ ధూపదీప నీరాజనాలుఇచ్చి తాంబూలం అర్పించి నిశ్చలచిత్తంతో ఆత్మప్రదక్షిణ నమస్కారం చేయాలి. తరవాత బ్రాహ్మణ దంపతు

లను పూజించి వారికి సంతృప్తిగా భోజనం పెట్టాలి. ఈ విధంగా సాయంకాలం పూజచేసి బ్రాహ్మణులను ఆనందపరచి వాజ్ఞియమంతో, పాలతో పచనమైన హవిస్సును తాను భుజించాలి. ఈ విధంగా రెండుపక్షాలలోనూ ఒక సంవత్సరకాలం విద్వాంసుడు ఈ వ్రతాన్ని చేసి సంవత్సరాంతంలో ఉద్యాపన చేయాలి. ఆ ప్రతిమను నూరు రుద్రాక్షలచే జపించిన ఉదకంతో స్నానం చేయించాలి. శాస్త్రోక్త విధానంగా పార్వతీ పరమేశ్వరులను పూజించాలి. వస్త్రం, బంగారం, ప్రతిమతోకూడిన కలశాన్ని పూజ్యుడు, సదాచారసంపన్నుడు అయిన గురువుకు సమర్పించాలి. శక్త్యానుసారం బ్రాహ్మణుల్ని భక్తితో పూజించి, వారికి మృష్టాన్నంపెట్టి, గోవులు, బంగారం, వస్త్రాలు, ధనం దక్షిణలుగా ఇచ్చి తరవాత వారి ఆజ్ఞనుపొంది తాను ఇష్టజనులతో బంధువులతో కలిసి సుఖంగా భోం చేయాలి.

ఈ విధంగా ముల్లోకాలలో ప్రసిద్ధిపొందిన ఈ వ్రతం ఎవరు భక్తితో చేస్తాడో అతడు ఇరవై ఒక్క పురుషాలవరకూ తరింపచేసి తన కిష్టమైన భోగాలను అనుభవించి ఇంద్రాది లోకపాలకుల పదవులతో చిరకాలం క్రీడిస్తున్నాడు. క్రమంగా బ్రహ్మలోకంలో విష్ణులోకంలోఉండి తరవాత శివలోకాన్ని పొంది అక్కడ నూరు కల్పాల వరకూ స్వేచ్ఛగా ఉంటాడు. అక్కడ అనేక భోగాలను అనుభవించి తరవాత శివునితో ఐక్యమవుతున్నాడు.

కాబట్టి ఓ చిన్నదానా! నీవుకూడా శ్రద్ధగా ఈ వ్రతం ఆచరించు. ఇలాచేస్తే ఎలాంటి అసాధ్యమైన కోరికైనా పొందగలవు." అని మునీంద్రుడు చెప్పగావిని ఆ ఉపదేశాన్ని గ్రహించి ఆమె అంతులేని ఆనందాన్నిపొంది గట్టి విశ్వాసంతో ఆ మాటలను స్వీకరించింది. తరవాత ఆమె తల్లిదండ్రులూ, సోదరులూ, ఆ మునీంద్రునిచేరి నమ

స్మరించారు. "ఓ మునీంద్రా! మమ్మల్ని అనుగ్రహించు"మని స్తుతించి పూజించారు. విషయమంతావిని చాలా సంతోషించారు. "మీవంటి మహాత్ములు రావడంవల్లనే మేమంతా ధన్యులమయ్యాం. మా వంశమంతా పవిత్రమైంది. మా గృహం నేటికి పావనమైంది. ఈ శారద దుష్కర్మఫలితంగా విధవరాలైంది. ఇపుడు మీ పాద పద్మాలను శరణుపొందింది. భయంకర దుఃఖసముద్రాన్నుంచి ఈమెను ఉద్ధరించండి. మీరంతవరకూ ఇచ్చటనే మా యింటిదగ్గరలో స్నానపూజ జపాదులకు అనుకూలంగా మేము నిర్మించే మఠంలో ఉండండి. ఈమె మీ పూజచేస్తూ మీ సన్నిధానంలోనే వ్రతాన్ని చేస్తుంది. వ్రతం పూర్తి అయేవరకూ మీరు ఇచ్చటనేఉండి ఆమెను కృతార్థురాలిగా చేయవలసింది." అని వారంతా ఆయనను అర్థించారు. దాని కాయన అంగీకరించి శుభకరమైన మఠంలో నివసించాడు. శారద ఆ ముని ఉపదేశించిన మార్గంలో పార్వతీ పరమేశ్వ లను పూజిస్తూ నిర్మలాంతఃకరణంతో వ్రతం చేసింది.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో సోమవారవ్రతవిధిఅని ప్రసిద్ధిపొందిన పద్ధెనిమిదో అధ్యాయం.

— / —

# ఏకోనవింశోధ్యాయం

సూతుడు చెపుతున్నాడు:

గురుసన్నిధిలో నియమయుక్తమైన మనస్సుతో శారద మహా వ్రతంచేస్తూ సంవత్సరం గడిపింది. అప్పుడామె మణిమంటపమందే ఉద్యాపనచేసి బ్రాహ్మణులకు భోజనం పెట్టింది. వారికి శాస్త్రో

క్తంగా దక్షిణలిచ్చి నమస్కరించి పంపించి తల్లిదండ్రులను సంతోషపరచింది. ఆ రోజున ఉపవాసముండి చాలా నియమంతో మహనీయుడైన ఆ మునీశ్వరుడు ఉపదేశించిన మంత్రాన్ని జపించింది. ప్రదోషకాలంలో మఠంలో గురుసన్నిధిలో శంకరుణ్ని పూజించింది. జపంలో పూజలో ఆసక్తికల ఆమె శివుణ్ని ధ్యానిస్తూ శివసమీపంలో కూర్చుండి ఆరాత్రంతా జాగరణచేసింది. ఆ ముని శారదతోకూడి లోకమాతఅయిన పార్వతిని జపమూ ధ్యానమూ స్తోత్రాదులతో బాగా సంతోషపెట్టాడు. ఆమె భక్తిచేతా, వ్రతమహిమచేతా మునీంద్రుని తపస్సు, యోగాభ్యాసం, నియమాదులచేత సంతోషించిన జగన్మాత అమృతసాంద్రమూర్తిగా ప్రత్యక్షమయింది. ఆ క్షణంలోనే పుట్టుగుడ్డివాడైన ఆ మునికి చూపువచ్చింది. దర్శించి వెంటనే అతడు, ఆ కన్యక పార్వతీదేవి పాదాలమీదపడి నమస్కరించారు. భక్తిభావంతో ఉప్పొంగిన నిర్మలావయవాలు ఆనందబాష్పాలతో తడిసిన శరీరం కలవారిద్దరినీ లేవదీసి పార్వతి దయారసంతో, ప్రేమతో "ఓ మునివర్యా! నేను ప్రీతినొందాను. ఓ సఖీ నేను సంతృప్తినొందాను. దేవతలకుకూడా దుర్లభమైన కోరికను తీరుస్తాను. ఏమి కావాలో తెల్పండి." అని అడిగింది.

అప్పుడు నైధ్రువుడు. "ఈ శారద భర్తృవియోగం పొందింది. అంధుడనుగా నేనామెకు అందించిన ఆశీస్సును యథార్థం గావించు" అని ప్రార్థించాడు. దానికి పార్వతి చాలా ఆనందించి "ఈమె పూర్వజన్మలో ద్రావిడబ్రాహ్మణుని రెండవ భార్యగా భామిని అనే పేరుతో ప్రసిద్ధిపొందింది. సౌందర్యంతో, మాటనేర్పుతో తన భర్తకీమె చాలా ప్రియురాలై అతడిని వశపరచుకుంది. ఈమెపట్లగల మోహపారవశ్యంతో అతడు పతివ్రతఅయిన పెద్దభార్య ఇంటికి వెళ్ళడం మానేశాడు. భర్త తన ఇంటికిరాక, పుత్రసంతానంలేక

ఆమె మహాదుఃఖంతో కొంతకాలానికి మరణించింది. ఈ చిన్నదాని ఇంటిదగ్గరలోఉన్న ఒక బ్రాహ్మణయువకుడు ఈమె సౌందర్యానికి ముగ్ధుడై కామపీడితుడై ఒక రోజు చేయిపట్టుకున్నాడు. కాని ఈమె ఆతడిని తిరస్కరించింది. దాంతో ఆతడు రాత్రింబవళ్లు ఈమెనే స్మరిస్తూ చివరకు కన్నుమూశాడు. పెద్దభార్యపట్ల భర్తను విముఖునిగా చేసినపాపానికి ఈమె ఈ జన్మలో వైధవ్యం పొందింది. ఈ లోకంలో ఏ స్త్రీలు భార్యాభర్తలకు ఎడబాటు కలిగిస్తారో వారికి ఇరవై ఒక్క జన్మలవరకూ బాలవైధవ్యం కల్గుతుంది. ఈ చిన్నది వెనకటి జన్మలో నా పూజ విశేషంగా చేసింది. ఆ పుణ్యంవల్ల ఈ జన్మలో ఆ పాపం నశించింది. ఈమెను స్పృశించి కామవిమోహితుడై మరణించిన విప్రుడే ఈ జన్మలో ఈమెను వివాహమాడి వెంటనే మరణించాడు. పూర్వజన్మలోని ఈమె భర్త పాండ్య రాష్ట్రంలో జన్మించి భాగ్యవంతుడై బ్రాహ్మణోత్తముడుగా ప్రసిద్ధి చెంది మరోస్త్రీని పెండ్లియాడాడు. ఈమె ప్రతిరాత్రియందూ ఆతడి పట్లగల ప్రేమాతిశయంవల్ల స్వప్నంలో కలుసుకుంటున్నది. స్వప్నంలోని రతిసుఖం జాగ్రదవస్థసుఖంకన్నా శ్రేష్ఠమైందికదా! ఆ విప్ర వరుడిక్కడకు రెండువందల ఆమడల దూరంలో ఉన్నప్పటికీ కర్మ ఫలంచేత మనోలగ్నమైన ఈమెవల్ల ప్రతిరాత్రీ స్వప్నంలో రతి సుఖాన్ని పొందుతూ నిత్యమూ చూస్తున్నాడు. ఈమె ప్రతిరాత్రీ భర్తవల్ల పొందుతున్న స్వప్నసాంగత్యంవల్ల కొంతకాలానికి వేద వేదాంగ పారంగతుడైన ఒక కుమారుణ్ని కంటుంది. ఈమెపట్ల ఉన్న చిరకాల సాంగత్యంవల్ల ఆ బ్రాహ్మణుడుకూడా రాత్రిపూట స్వప్నంలో తనకు పుట్టిన కొడుకును ప్రేమగాచూస్తాడు. ఓ మునీశ్వరా! నేను పూర్వజన్మలో ఈమెచే పూజించబడ్డ కారణంగా వర మివ్వడంకోసం ఇప్పుడు ప్రత్యక్షమయ్యాను." అన్నది.

సూతుడు చెపుతున్నాడు :

మళ్ళీ పార్వతి "ఓ చిన్నదానా ! నా మాటలువిను. ఒకానొకప్పుడు కలలో కనబడిన నీ పూర్వభర్తను గుర్తిస్తావు. అతడు కూడా నిన్ను గుర్తిస్తాడు. అప్పుడు మీరు పరస్పరం సంభాషించుకుంటారు. నీ కుమారుణ్ని అతనికిచ్చి ఈ వ్రతఫలంలో సగం ఆ భర్త కోసం సమర్పించు. అదిమొదలు అతడి స్వాధీనంలోనే ఉండు. మీ ఇద్దరికీ స్వప్నసంభోగంతప్ప వేరు సంగమంలేదు. ఆ బ్రాహ్మణుడు కొంతకాలానికి మరణించినప్పుడు నీవుకూడా అతడితోపాటు అగ్ని ప్రవేశంచేసి నా స్థానం చేరతావు. సకలలోక మనోహరుడైన నీ కుమారుడు ఐశ్వర్యవంతుడై పరమసౌఖ్యాన్ని పొందుతాడు" అని ఆనతిచ్చింది.

సూతుడు చెపుతున్నాడు :

తరవాత లోకమాత అదృశ్యమైంది. శారద కరుణానిధి అయిన పార్వతీదేవి వరాన్నిపొంది చాలా సంతోషించి గురువును పూజించింది. ఆ రాత్రి గడిచినతరవాత ఆ మునీంద్రుడు ఆమె తల్లిదండ్రులకు జరిగిన వృత్తాంతమంతా ఏకాంతంగా చెప్పాడు. అందరివద్ద సెలవు తీసుకొని అక్కడనుండి అతడు యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

కొన్నిరోజులు గడిచిన తరవాత ఆబాలిక ప్రతిరాత్రీ స్వప్నంలో పూర్వభర్తృ సాంగత్యాన్ని పొందింది. పార్వతి వరప్రసాదంవల్ల ఆమె నిర్మలకాంతిశరీరంతో గర్భవతి అయింది. భర్తలేని ఆమె గర్భవతి అయినదని తెలిసి జనులామెను అసహ్యించుకొని ఆమెను "జారిణి" అని నిందించసాగారు. సర్వదష్టుడైన ఆమె భర్త యొక్క జ్ఞాతులు, మామగారు, గ్రామపెద్దలు. పండితులు, కులవృద్ధులు కలిసి ఒక సభ ఏర్పాటుచేశారు. ఆ సభలో కొందరు శారదను పిలిచి అనేక విధాలుగా భయపెట్టారు, మరికొందరు ఆమెను చూడకూడ

దన్నారు. "ఓ మూఢురాలా! జారిణీ! ఇలాంటి పాడుపని చేశావేమిటి? మా వంశానికి అపకీర్తి తెచ్చావే! ఎంత దుర్మార్గురాలవే?" అని గ్రామపెద్దలు, విద్వాంసులు ఆమెను నిందించి భయపెట్టి చేయవలసినపనిని ఆలోచించారు. "ఈ పాపాత్మురాలు వంశమంతా పాడుచేసింది కాబట్టి దీని తలగొరిగి, ముక్కు-చెవులుకోసి కులంనుంచి వెలివేసి ఈ గ్రామంనుంచి వెళ్ళగొట్టాలి'' అని కొందరు కోపంగా అన్నారు.

వారావిధంగా చేయడానికి ప్లానుకుంటున్న సమయంలో ఆకాశంనుండి అశరీరవాణి "ఈ చిన్నది ఏపాపమూ చేయలేదు. వంశాన్ని పాడుచేయలేదు. దీనికి వ్రతభంగంకాలేదు. ఈమె వాస్తవంగా సచ్చరిత్రకలది. ఎవరైతే ఈమెను జారిణి అంటారో వారే మహాపాపులు. వారి నాలుక వెంటనే తెగిపడిపోతుంది'' అని వినిపించడంతో అచ్చటివారంతా ఆనందభరితులయారు. గ్రామస్థులూ, సభ్యులందరూ మహాభయంతో సంభ్రమంకలిగి ఏమీ మాటాడక తలలు వంచుకొనిఉన్నారు. వారిలో కొందరు ఆకాశవాణి అబద్ధమనీ, ఆమె నిజంగా జారిణియేననీ పలికారు. వెంటనే వారి నాలుకలు రెండు చీలికలై క్షణంలో నోటినుండి పురుగులను కక్కారు.

తరవాత శారదను ఆమె భర్తజ్ఞాతులూ, బంధువులూ పూజించారు. స్త్రీలూ, వృద్ధులూ "బాగుబాగ'ని కొనియాడారు. ఉత్తమవంశస్థులు కొందరు ఆనందబాష్పాలను రాల్చారు. కులాంగనలు సంతోషంతో శారదను ఓదార్చి కౌగిలించుకొన్నారు. మరికొందరు "దైవం అబద్ధంపలకడు. ఈమె సత్కులాన్ని పాడుచేయకుండా గర్భం ఎలాధరించింది?'' అని వితర్కించుకొన్నారు. అందరినిచూచి లోకతత్వజ్ఞుడైన ఒక వృద్ధుడు "ఈ ప్రపంచాన్ని మనం మాయారూపంగా దర్శిస్తున్నాం. వింటున్నాం. భ్రమాత్మకమైన ఈ సంసా

రంగూర్చి ఏమిచెప్పడానికీ వీలులేదు. నిశ్చయించడానికి శక్యం కానిదీ పూర్వమెన్నడు జరగనిదీ అయిన ఈశ్వరమాయతో కూడిన ఒక విషయం చెపుతాను వినండి.

యువకేతుడనే రాజర్షి వీర్యం నీటిలో పడింది. శుక్లంతో కూడిన ఆ జలాన్నిత్రాగి ఒక వేశ్య గర్భవతి అయిందట. విభాండక మహా ముని శుక్లంతో కూడిన జలాన్నిత్రాగి ఆడులేడి గర్భంధరించి ఋష్య శృంగ మహర్షిని కన్నది. సురాష్ట్రమహారాజు వస్త్రాన్నిపట్టిన దేవతాస్త్రీ వెంటనే గర్భవతిఅయి మనువనే ఋషీశ్వరుణ్ని కన్నది. అలాగే సత్యవతి అనే శబరాంగన గర్భవతి అయింది. అదేవిధంగా మహిషి గర్భంనుండి మహిషాసురుడుద్భవించాడు. పూర్వం స్త్రీలు ఏదో కారణంవల్ల గర్భవతులయారు. వసుదేవునితో సంయోగంలేకుండానే రోహిణీదేవి కుమారుణ్ని ప్రసవించింది. దేవతల, మహర్షుల శాపంవల్ల, వరాలవల్ల అయుక్తమైన కర్మఅయినా సంభవిస్తుంది. ఇందులో ఎటువంటి సందేహంలేదు. సాంబుని కడుపున ముని శాపం వల్ల రోకలి పుట్టింది. పురుషుడైన యవనాశ్వునికి మునీశ్వరుల మంత్రగౌరవంవల్ల గర్భమయింది. అలాగే ఈ కళ్యాణికికూడా మునీంద్రుని పాదసేవనంవల్ల మహావ్రతమహిమవల్ల నిర్దోషురాలైనా గర్భమయింది. ఈమెను ఏకాంతంగా స్త్రీలు విషయమంతా అడిగి తెలుసుకుంటే సందేహనివృత్తి అవుతుంది.” అని చెప్పాడు.

ఆ మాటలువిన్న స్త్రీలలో కొందరు రహస్యంగా పిలిచి శారదను ప్రశ్నించారు. ఆమె ఆశ్చర్యకరమైన తన వృత్తాంతాన్ని అంతా వారికి వివరించింది. ఆ సంగతి తెలుసుకొని యోగ్యురాలైన ఆమెను గౌరవించి సంతోషంతో ఆమెను పొగుడుతూ వారంతా తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

తరవాత నెలలునిండి నిర్మలభావంకల ఆ శారద బాలార్క సమతేజుడైన ఒక కుమారుణ్ని ప్రసవించింది. సుకుమారుడూ, మహోదారలక్షణోపేతుడూ, కమలాక్షుడూ, మహాబుద్ధిశాలి అయిన ఆ బాలుడు చిన్నతనంలోనే సకలవిద్యలలో ఆరితేరాడు. యుక్త వయస్సు రాగానే ఒక మంచి ముహూర్తాన ఆ పిల్లడికి గురువు ఉపనయనం చేయగా అతడు శారదేయుడని పేరుపొందాడు. కుశాగ్ర బుద్ధి అయిన ఆతడు ఎనిమిదవఏటనే ఋగ్వేదాన్నీ, తొమ్మిదవఏట యజుర్వేదాన్నీ, పదోఏట సామవేదాన్నీ సునాయాసంగా అభ్యసించాడు.

తరవాత కొంతకాలానికి ముల్లోకాలకూ పూజ్యుడైన శివుని పర్వదినంరాగా భారతీయులంతా గోకర్ణక్షేత్రానికి బయలుదేరడం చూసి, శారదకూడా తన కొడుకుతో బంధుజనులతో తల్లిదండ్రులతో కలిసి ఆ క్షేత్రానికి వెళ్ళింది. ఆ తీర్థంలో ఆమె స్వప్నంలో కాంచిన సర్వగుణసంపన్నుడైన పూర్వజన్మలోని భర్తను కనుగొన్నది. ఆతడిని చూడటంతోనే ప్రేమనిండిన హృదయంతో నగుర్పొడిచిన శరీరంతో గద్గదకంఠస్వరంతో ఆతనియందే దృష్టిని కేంద్రీకరించింది. ఆ బ్రాహ్మణుడుకూడా సౌందర్యవతి, యౌవనవతి, కలలో నిత్యమూ అనుభవింపబడేదీ, తనకు సుఖాన్ని ఇచ్చేదీ అయిన ఆమెనూ, ఔరసపుత్రుడైన ఆ పిల్లడినిచూచి ఆశ్చర్యపడి. "ఓ బాలామణీ! నా మనసులోఉన్న ఒక విషయం అడుగుతున్నాను" అని ఏకాంతంగా "నీవెవ్వతెవు? నీ భర్త ఎవరు? మీ దేశం ఏమిటి? నీ వెవరి కూతురువు? నీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు.

అప్పుడామె కన్నీరుకారుస్తూ బాల్యవైధవ్యానికిగల కారణాన్ని సవిస్తరంగా వివరించింది. మళ్ళీ ఆతడు "ఓ బాలా! ఈ చిన్నవాడె

వరి కొడుకు ? చంద్రసమానుడైన ఈతని గన్నతల్లి ఎవరు ?" అని ప్రశ్నించాడు. దానికామె "ఓ స్వామీ! సకలవిద్యాపారంగతు డైన ఈ బాలుడు నా కుమారుడే! మా వశిష్ఠుడీతనికి నా పేరును బట్టి శారదేయుడని పేరుపెట్టాడు." అని చెప్పింది. అప్పుడాతడు చిరునవ్వుతో "ఓ భామినీ! నీ చరిత్ర దుర్భరంగా ఉంది. నీ భర్త పెండ్లి అయినవెంటనే మరణించాడుకదా! నీకీ కుమారుడు ఎలా కలిగాడు? ఆ కారణంచెప్పు" అని ప్రశ్నించాడు. దానికామె కొంచెం సిగ్గుపడి తలవంచుకొని మళ్ళీ ధైర్యం తెచ్చుకొని "మహాత్మా! పరిహాసపు మాటలతో పనేముంది ? నన్ను నీ వెరుగుదువు. నిన్ను నే నెరుగుదును. దీనికి మన మనస్సేసాక్షి" అన్నది.

సూతుడు చెపుతున్నాడు :

శారద తనకు పార్వతి ఇచ్చిన వరం మొదలైన విషయమంతా చెప్పి స్థిరమైన నియమంతో తన వ్రతఫలం కోసగాన్నీ, కుమారుణ్నీ ఆతడికి సమర్పించింది. ఆ విప్రుడుకూడా ఆనందంతో కుమారుణ్ని స్వీకరించి ఆమె తల్లిదండ్రుల అనుమతిని బొంది ఆమెనూ, కుమారుణ్నీ తన ఇంటికి తీసుకొనిపోయాడు. శారద ఆతడింట్లో చాలా సంవత్సరాలుండి, ఆతడు మరణించడంతో తాను కూడా ఆతడితోపాటు అగ్నిప్రవేశం చేసింది. తరవాత వారిద్దరూ దంపతులై దివ్యవిమానంఎక్కి దివ్యభోగాలతో శివమందిరానికి చేరారు.

నాచే వర్ణించబడ్డ ఈ ఉమామహేశ్వర వ్రతమాహాత్మ్యాన్ని పఠించినవారికీ, వినినవారికీ వెంటనే భోగం, మోక్షం కల్గుతాయి ఆయురారోగ్యసంపత్తీ, ధనధాన్యాభివృద్ధీ, స్త్రీలకు మాంగల్యసౌభాగ్యం, సంతానసౌఖ్యం కల్గుతాయి. సకలపాపాలను హరించే గౌరీమహేశ్వరవ్రతమనే పుణ్యకీర్తనంగల ఈ ఉపాఖ్యానాన్ని ఎవరు

భక్తితో ఒకమారు వింటారో, పఠిస్తారో ఆతడు సకలభోగాలూ అనుభవించి చివరకు పరమేశ్వరపదవిని పొందుతాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో ఉమామహేశ్వరవ్రత మహిమానువర్ణనమని ప్రసిద్ధి బొందిన పందొమ్మిదవ అధ్యాయం.



# వింశోధ్యాయం

సూతుడు శౌనకాది మునులతో చెపుతున్నాడు:

నేను వినేవారి, పఠించేవారి పాపాలను నశింపజేసే రుద్రాక్ష మహిమను సంక్షేపంగా వివరిస్తాను.

'అభక్తోవా సభక్తోవా, నీచో నీచతరోపివా
రుద్రాక్షం ధారయేద్యస్తు ముచ్యతే సర్వపాతకైః'

భక్తుడైనా భక్తుడు కాకపోయినా నీచుడైనా పరమనీచుడైనా ఎవడు రుద్రాక్షను ధరిస్తాడో ఆతడు సర్వపాపాలనుండి విముక్తుడవుతాడు. 'రుద్రాక్షధారణం పుణ్యం కేనవా సదృశంభవేత్ మహావ్రతమిదం ప్రాహురృనయ స్తత్వదర్శినః' పవిత్రమైన రుద్రాక్షధారణకు సమానమైంది మరొకటి ఏదీలేదు. తత్వవేత్తలైన మహామునులు దీనినే ఒక మహావ్రతంగా చెప్పారు. ఏ నరుడు దృఢనియమంతో వేయిరుద్రాక్షలను ధరిస్తాడో ఆతనిని దేవతలందరూ సాక్షాత్తు రుద్రుడిగా తలంచి నమస్కరిస్తారు. వేయిరుద్రాక్షలు లభించకపోతే ఒక్కొక్క బాహువుకు పదహారుచొప్పున, శిఖయందు ఒకటీ, రెండు చేతులయందు రెండు పన్నెండ్లు ఇరవైనాలుగు ధరించాలి.

కంఠమందు ముప్పదిరెండు, శిరస్సునందు నలుబది, రెండు చెవులకు రెండార్లు పన్నెండు, వక్షస్థలమందు నూటయెనిమిది— ఈ విధంగా ఎవడు ధరిస్తాడో ఆతడిని రుద్రుడుకూడా పూజిస్తాడు. ముత్యం, పగడం, స్ఫటికం, వెండి, వైడూర్యమణి, బంగారం— వీటితో కూడిన రుద్రాక్షలను ధరించినవాడు సాక్షాత్తు శివుడవుతున్నాడు. కేవలం తనకు లభించిన రుద్రాక్షలను ధరించినవాడిని సూర్యుణ్ని చీకట్లు స్పృశించని విధంగా పాపాలు అంటవు. 'రుద్రాక్షమాల యా జప్తో మంత్రోనంతి ఫలప్రదః రుద్రాక్షం మస్తకేధృత్వా జపేచ్చ సుసమాహితః అరుద్రాక్షో జపః పుంసాం తావన్మాత్రఫల ప్రదః' రుద్రాక్షమాలను ధరించి జపించిన మంత్రం అనంత ఫలాన్ని ఇస్తుంది. రుద్రాక్షను శిరస్సున ధరించి ఏకాగ్రమనస్సుతో ఏకాగ్ర చిత్తంతో జపించాలి. రుద్రాక్షధారణ లేకుండా చేసిన జపం ఎంత జపిస్తే అంతేఫలం ఇస్తుంది. 'యస్యాంగేనాస్తి రుద్రాక్ష ఏకోపి బహుపుణ్యదః తస్యజన్మనిరర్థం స్యాత్త్రిపుండ్రరహితంయథా' బహుపుణ్యప్రదమైన ఒక్క రుద్రాక్ష అయినా ఎవని శరీరమందు లేదో ఆతనిజన్మ త్రిపుండ్ర రహితమైన దానివలె నిరర్థకమవుతుంది. 'రుద్రాక్షంమస్తకేధృత్వా జలేస్నానంకరోతియః గంగాస్నాన ఫలం తస్య జాయతే నాత్రసంశయః' రుద్రాక్షను శిరస్సున ధరించి జల మందు స్నానం చేసినవాడికి గంగానదీ స్నానంవల్ల కలిగేఫలం లభించడంలో ఏ సందేహమూలేదు. 'రుద్రాక్షం పూజయేద్యస్తు వినా తోయాభిషేచనైః యత్ఫలం లింగపూజాయాం తదేవాప్నోతినిశ్చితం' ఉదకంతో స్నానాలు విడిచిఅయినాసరే రుద్రాక్షను పూజిస్తే ఆతడు శివలింగ పూజాఫలాన్ని నిశ్చయంగా పొందుతున్నాడు.

ఏకముఖం పంచముఖం, ఏకాదశముఖం, చతుర్దశముఖాలు కల రుద్రాక్షలు లోకపూజ్యాలు. 'భక్త్యాసంపూజితో నిత్యం

రుద్రాక్ష శ్శంకరాత్మకః దరిద్రం చాపికురుతే రాజరాజమివశ్రియా' భక్తితో పూజించబడ్డ శివాత్మమైన రుద్రాక్ష దరిద్రుడినైనా సంపదలో కుబేరుడితో సమానంగా ఒనరుస్తుంది. పండితులు ఈ విషయం గూర్చి వినడంచేత, పఠించడంచేత, మహాపాపక్షయకరమైన ఒక పవిత్రకథను వర్ణిస్తున్నారు.

కాశ్మీరదేశపు ప్రభువైన చంద్రసేన మహారాజుకు బుద్ధిమంతుడూ, నీరుడూ అయిన సుధర్ముడనే కొడుకున్నాడు. ఆతడికి చాలా ప్రీతిపాత్రుడైన ఒక మిత్రుడున్నాడు. ఆతడు మంత్రి కుమారుడైన తారకుడు. చాలా అందంగలవాళ్ళూ, స్నేహంగలవాళ్ళు వారిద్దరూ. బాల్యంలోనే విద్యాభ్యాసాసక్తితో కలిసి ఆడుకునేవారు. వారెప్పుడూ సర్వావయవాలకూ రుద్రాక్షలనే అలంకారాలుగా ధరించేవారు. గాంభీర్యంగల అవయవాలకు వారెప్పుడూ భస్మంధరించి తిరిగేవారు. ముత్యాలహారాలూ, బాహుపురులూ, కంకణాలూ, కుండలాలూ, బంగారం, రత్నాలు మొదలైన అలంకారాలన్నీ విడిచిపెట్టి రుద్రాక్షలనే వారు కంకణాలుగా, కర్ణాభరణాలుగా, కుండలాలుగా ధరించేవారు. బంగారం రత్నాలు మొదలైన అలంకారాలు మట్టిముండలతో సమానంగా వాళ్ళు చూచేవారు. పెద్దలు చెప్పినాసరే వారి మాటలు వినక రుద్రాక్షలనే ధరించేవారు.

ఒకనాడు సాక్షాత్తు బ్రహ్మదేవుడా అనేటట్లు పరాశర మహర్షి కాశ్మీరదేశపు రాజగృహానికి వచ్చాడు. ధర్మవేత్తలలో శ్రేష్ఠుడైన చంద్రసేన మహారాజాముసీశ్వరుని యథావిధిగా పూజించి, సుఖాసీనుడై ఉండగా త్రికాలవేది అయిన ఆ మునితో "ఓ మహాత్మా! నా కుమారుడూ, మంత్రికుమారుడు ఇద్దరూ ఎప్పుడూ రుద్రాక్షలనే ధరిస్తున్నారు. వారికి రత్నాలంకారాలపట్ల ఎలాంటి ఆసక్తీ లేదు. ఎన్ని విధాలచెప్పినా మా మాటలను పెడచెవిని పెడుతున్నారు.

పూర్వం వాళ్ళు ఎవరిచేతనూ మంత్రోపదేశం పొందినవారుకాదు. బాలురు. వీళ్ళ కీవిధమైన ప్రవర్తన ఎలాకలిగిందో మాకు తెలియ జేయండి" అని అడిగాడు.

దాని కా మునీశ్వరుడు "ఓ రాజా! నీ కొడుకు చరిత్ర, నీ మంత్రికొడుకు చరిత్ర చాలా ఆశ్చర్యకరమైనవి. చెపుతాను విను.

నందిగ్రామంలో శృంగారంలో లావణ్యవతి అయిన ఒక వేశ్య ఉండేది. ఆమె పేరు మహానంద. ఆమెకు పూర్ణచంద్రునివంటి ఒక ఛత్రం, బంగారపుపల్లకీ, మంచిదండాలు కల్గిన వింజామరలు, బంగారపు పాముకోళ్ళు, అమూల్యమైన మంచి కాంతిగల చిత్రమైన చీనాంబరాలు, శరత్కాలచంద్రునితో సమానమైన శయ్య, బంగారపు పందిరిమంచాలు, కోట్లకొలదీ గోవులూ, గేదెలు, ఇష్టమైన పరివారం, సర్వాభరణాలతో ప్రకాశించే అవయవాలుగల నవయౌవనపు దాసీజనం, నవరత్నఖచితాలైన శ్రేష్ఠమైన అలంకారాలూ, మంచిగంధం, కుంకుమ, కస్తూరి, కర్పూరం అగరులేపనం, చిత్రవిచిత్రాలైన పూలదండలు ఉన్నాయి. ఇష్టమైన భోజనం, అనేకరత్నాలతో, అనేక ధాన్యరాసులతో ఒప్పుతున్న ఆమె ఇంటిలో ఎక్కడ చూచినా కోట్లకొలదీ రత్నరాసులే! ధనరాసులే!

ఇంత సంపదఉన్నా ఆవేశ్యాంగన స్వేచ్ఛాసంచారం కలది. అయితే ఆమె. మనస్సు ఎల్లప్పుడూ శివపూజయందే లగ్నమైఉండేది. సత్యధర్మపరాయణ ఆమె. సదాశివునియందే ఆమె చిత్తవృత్తి ఎప్పుడూ శివనామాలు జపించేది. శివభక్త పాదారవిందాలకు నమస్కరించేది. బ్రాహ్మణులపట్ల అమితభక్తి కలిగిఉండేది. వినోదం కోసం ఆమె ఒక కోతినీ, ఒక కోడినీ రుద్రాక్షలతో అలంకరించి నాట్యమంటపానికి తీసుకొనివచ్చి పాటపాడుతూ, తాళంవేస్తూ ఆడించేది. అంతేకాదు. తన చెలికత్తెలతో కలిసి గట్టిగా నవ్వేది. రుద్రాక్ష

లతో అలంకరించబడ్డ చేతులూ, బాహువులూ, చెవులు కలిగిన ఆ కోతి ఆమె ఎదట పిల్లవాడిలా నాట్యంచేసేది. శిరస్సుపై రుద్రాక్ష కట్టిన కోడికూడా కోతితో సమానంగా నాట్యంచేస్తూ చూపరులకు ఆనందం కల్గించేది.

ఒకనాడావేశ్య ఇంటికి శివదీక్షాపరుడైన ఒక వైశ్యుడు వచ్చాడు. అతడు రుద్రాక్షధారి, త్రిపుండ్రధారి, జటాధారి. స్వచ్ఛమైన భస్మాన్ని ధరించి, అమూల్యరత్నఖచితమైన కంకణాలతో తరుణార్కుడిలా అతడు ప్రకాశించాడు. ఆ వేశ్యాంగన చాలా ఆనందంతో అతణ్ని పూజించి, అతడిముంజేతి కంకణాన్నిచూచి ఆశ్చర్యంతో "మహారత్నమయమైనదీ, దివ్యస్త్రీల అలంకారానికి తగినదీ అయిన నీచేతి కంకణం నా మనస్సును ఆకర్షిస్తున్నది. ఓ మహాభాగా! రత్నాలచే ప్రకాశించే ఈ కంకణం నా కిస్తావా?" అని అడిగింది. దాని కాతడు చిరునవ్వునవ్వి "దివ్యమైన ఈ రత్నఖచిత కంకణంమీద నీకు ఆశఉంటే దీనికితగిన వెలఇచ్చి తీసుకో." అని అన్నాడు.

అప్పుడామె "వేశ్యలు స్వేచ్ఛాసంచారం కలవారు కాని పతివ్రతలుకారు. వ్యభిచారమే మా కులధర్మం. దీనికి ఎలాంటి సందేహంలేదు. కాబట్టి ఈ హస్తకంకణాన్ని నాకిస్తే నీకు నేను మూడు రాత్రుళ్ళు భార్యగాఉంటాను" అన్నది. దానికాతడు "ఓ వారవనితా! నీవు మాటలాడింది నిజమేఅయితే అలాగేకానిమ్ము. నీకు రత్నకంకణాన్ని ఇస్తాను. నీవు నాకు మూడు రాత్రులు భార్యవు కమ్ము. ఈ వ్యవహారంలో మనకు సూర్యచంద్రులే సాక్ష్యం. ఓ ప్రియురాలా! మూడురాత్రులూ నీతోనే ఉంటాను అని నా హృదయంమీద చెయ్యివేసి ప్రమాణంచెయ్యి'' అన్నాడు. దానికామె "ఓ నాథా! నేను మూడు రోజులు రాత్రిళ్ళంతా నీకు

భార్యనై ఉండి ధర్మాన్ని ఆచరిస్తాను" అని అతడి హృదయాన్ని స్పృశించింది.

సూతుడు పలుకుతున్నాడు :

తరవాత ఆ వైశ్యుడు ఆమె కా కంకణం ఇచ్చాడు. రత్నమయమైన శివలింగాన్నికూడా ఆమె చేతియందుఉంచి "ఈ రత్నమయమైన శివలింగం నా ప్రాణంతో సమానం. ఓ కాంతా! దీనిని జాగ్రత్తగా రక్షించు. దీనికి భంగం కలిగితే నేను మరణిస్తాను." అన్నాడు.

సూతుడు చెపుతున్నాడు :

"అలాగే" అని ఆవేశ్య రత్నమయమైన ఆ శివలింగాన్ని గ్రహించి నాట్యమండపస్థానమందుంచి గృహంలోపలికి వెళ్లింది. విట ధర్మిణిఅయిన ఆ వేశ్యాంగన ఆరాత్రి అతడితో కలిసి పర్యంకం మీదపరుండి సుఖంగానిద్రించింది. అర్ధరాత్రిసమయాన నాట్యమంటపంలో అకస్మాత్తుగా అగ్నిపుట్టి మంటపమంతా ఆవరించింది. వెంటనే అక్కడికివచ్చి ఆ వారాంగన మంటలలోచిక్కుకొన్న కోతిని, కోడినీ విడుదలచేసింది. అయితే రత్నమయమైనశివలింగం ముక్కలయింది. అదిచూచి వైశ్యుడూ, వేశ్య చాలాదుఃఖించారు. ప్రాణతుల్యమైన శివలింగం దగ్ధంకావడంవల్ల నిర్వేదంతో వైశ్యుడు మరణించడానికి సిద్ధమయాడు. "శివలింగం బ్రద్దలైనతరవాత నేను ఏమాత్రంజీవించడానికి ఇష్టపడను. నీభృత్యులచే నాకు చితినేర్పాటు చేయించు. శివునియందు నామనస్సులగ్నంచేసి అగ్నిలోప్రవేశిస్తాను. బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు మొదలైన దేవతలంతాకలిసివచ్చి నన్ను ఆపినా నేనీక్షణంలో అగ్నిలోప్రవేశించి ప్రాణాలువిడిచిపెడతాను" అంటూదృఢనిశ్చయంతోఉన్న ఆవైశ్యుణ్ణిచూచి ఆమె తనభృత్యులచే ఊరిబయట చితి నేర్పాటుచేయించింది. తరవాత శివభక్తిచే

పూజించబడ్డ ఆవైశ్యుడు మండుతున్నఅగ్నికి ప్రదక్షిణంచేసి జను లంతా చూస్తుండగా చాలాధైర్యంగా అగ్నిలో ప్రవేశించాడు. ఆ వేశ్య చాలాపరితపించింది. ధర్మసూక్ష్మాన్ని పరిశీలించి బంధు జనులతో ఆమె కరుణరసం ఉట్టిపడేటట్లు "నేనీతనివద్ద రత్నకంకణాన్ని గ్రహించి మూడురోజులు భార్యగాఉంటానని ప్రమాణం చేశాను. నేను చేసిన కర్మచేత ఈవైశ్యుడు మరణించి శివసాయుజ్యాన్ని పొం దాడు. కాబట్టి నేనుకూడా ఈతడితో పాటు అగ్నిలో ప్రవేశిస్తాను. నేను మూడురోజులవరకూ ఆతడికి ధర్మచారిణిగా ఉంటానన్నాను కాబట్టి ఇదిసత్యమేఅవుతుంది. సత్యంవల్ల మూడులోకాలకు ప్రభువు లైనదేవతలంతా సంతోషిస్తారు. సత్యప్రవర్తనమే ధర్మం. సత్య మందే సర్వధర్మాలూఉన్నాయి. సత్యంవల్లనే స్వర్గమోక్షాలుకల్గుతు న్నాయి. సత్యంకన్నా వేరైన ఉత్తమగతి లేదు. కాబట్టి సత్యమూధా రంగాచేసుకొని నేను అగ్నిలోప్రవేశిస్తాను" అని చెప్పింది.

సూతుడు పలుకుతున్నాడు: అదివిని బంధువులంతా ఆమెను నివారించడానికి ప్రయత్నించారు. కానిఆమె తానుచేసిన సత్యప్రతి జ్ఞకు భంగంకల్గుతుందనే భయంవల్ల అగ్నిలో ప్రవేశించడానికే ప్రయత్నించింది. తనయావదాస్తి బ్రాహ్మణునకిచ్చి పరమేశ్వరుని ధ్యానించి, అగ్నిహోత్రుడికి ముమ్మారుప్రదక్షిణం చేసి ప్రవేశించ డానికి ఎదురుగానిలబడింది. ఆమె తన పాదపద్మాలయందు అర్పించిన మనస్సుగలదానినిగా తెలుసుకొని విశ్వాత్ముడైనశంకరుడే అక్కడ ప్రత్యక్షమై అగ్నిలోప్రవేశించకుండా ఆమెను నివారించాడు. సకల దేవతలకూ దేవుడైనవాడూ, త్రినేత్రుడూ, చంద్రకలనుధరించిన వాడు, కోటిచంద్రులు, సూర్యులు, అగ్నిహోత్రులుతో సమాన మైనకాంతిగల శివునిచూచి భయపడి ఆవేశ్యకదలలేక నిలుచుండి

పోయింది. వెలవెలబోతూ నమస్కరిస్తూ కన్నీరువిడుస్తూఉన్న ఆమె చేయిపట్టుకొని. "ఓచిన్నదానా! నీసత్యప్రవర్తనకు సంతోషించాను. నీసత్యాన్నీ ధర్మాన్నీ ధైర్యాన్నీ నాపట్లగలవిశ్చలభక్తినీ పరీక్ష చేయడానికే వైశ్యునివేషంలో వచ్చాను. నాట్యమంటపంలో నా మాయచేతనే అగ్నిని పుట్టించి రత్నలింగాన్నీ గృహాన్నీ దగ్ధంచేసి అగ్నిలోప్రవేశించాను. వేశ్యలు సాధారణంగా వంచనచేసేవారుగా, స్వేచ్ఛగావిహరించేవారుగా, ఏదోనెపంతో మాటాడేవారుగా ఉంటారు. నీవుమాత్రం ఆవిధంగా కాక సత్యంగాప్రవర్తిస్తూ నాతోపాటు అగ్నిలో ప్రవేశించదలిచావు. కాబట్టి నీకు దేవతలకుకూడా దుర్లభమైన కోరినవరాలిస్తాను. నీకు దీర్ఘాయుస్సు, ఆరోగ్యం, సంతానం మొదలైనవి ఏవికావాలో కోరుకో అన్నింటినీ ప్రసాదిస్తాను.'' అన్నాడు.

సూతుడు చెపుతున్నాడు: శివుడీవిధంగాపల్కడంతో ఆవేశ్య "ఓపరమేశ్వరా! నాకు భూలోకభోగాలందుగానీ, స్వర్గలోక సుఖాలందుగానీ, పాతాళలోకసౌఖ్యాలందుగానీ కోరికలేదు. నీ పాద పద్మాలయందలి భక్తినిమాత్రమే కోరుతున్నాను. ఓశివా! ఈ నా బంధువులు, దాసీలు, భృత్యులు మొదలైనవారందరూ నీయందే మనస్సు లగ్నంచేసి నీదర్శనంకోసం వేచిఉన్నారు. కావున వీరినందరినీ నాతోకూడా నీపరమపదవిని పొందించు. భయంకరమైన పునర్జన్మ మాకులేకుండా అనుగ్రహించు. ఇదే నమస్కారం'' అని చెప్పింది.

సూతుడు చెపుతున్నాడు: శివుడావేశ్యమాటలు విని ''అలాగే అని ఆమెకూ ఆమెపరివారానికీ సాయుజ్యమిచ్చాడు. నాట్యమంటపం మండుతున్నసమయంలో దూరంగాపారిపోయిన కోడి, కోతిమాత్రం మిగిలాయి. కొంతకాలానికి ఆరెండూ అడవిలో

మరణించాయి. ఆకోతి నీకుమారుడిగా, ఆకోడి నీమంత్రికుమారుడిగా జన్మించాయి. పూర్వజన్మలో రుద్రాక్షలను ధరించడంవల్ల కల్గిన పుణ్యంవల్లనే మంచికులంలో పుట్టాయి. ఆజన్మలో రుద్రాక్షలుధరించిన అలవాటువల్ల ఈజన్మలోకూడా రుద్రాక్షలనుధరించడంలో ఆసక్తి కలవారయారు. ముక్తిప్రదుడైన ఈశ్వరునిపూజించి సద్గురువునుచేరి అతడిఉపదేశంవల్ల శివసాయుజ్యాన్ని పొందుతారు. ఓరాజా! ఈ నీకుమారులవృత్తాంతం ఇది. ఆ శివభక్తులచరిత్ర ఇది. నీవు మరోవిషయాన్ని వినగోరుతున్నావా ఏమి?'' అని ప్రశ్నించాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో రుద్రాక్షమహిమానువర్ణనమనే ఇరవయ్యో అధ్యాయం.

— / —

## ఏకవింశోధ్యాయం

సూతుడు ఋషులతో చెపుతున్నాడు:

బ్రహ్మర్షి అయిన పరాశరమహర్షి అమృతోపమానమైన పూర్వకథను చెప్పగావిని చాలా సంతోషించి కాశ్మీరదేశపు రాజైన చంద్రసేనుడు చేతులుజోడించి "లోకంలో సత్పురుషుల సాంగత్యం గొప్పప్రయోజనాలను సాధిస్తుంది. కామధేనువులా సర్వాభీష్టాలనూ తీరుస్తుంది. సర్వసందేహాలను నివృత్తిచేసే మీ దర్శనభాగ్యంవల్లనే అజ్ఞానాంధకారం నశించి నాకు జ్ఞానదృష్టి కల్గింది. ఓ మునివర్యా! ఈ పిల్లల పూర్వజన్మ వృత్తాంతం అంతావిన్నాను. కాని నా కొడుకు భవిష్యత్తును గూర్చి చెప్పగోరుతున్నాను. ఈ పిల్లవాడికి ఆయుర్దాయమెంత? ఎంత భాగ్యవంతుడవుతాడు? ఎంత పండితుడవు

తాడు ? ఎంతకీర్తి నార్జిస్తాడు ? భక్తిశ్రద్ధాసక్తులెంతెంత ? ఎలాంటి వాడవుతాడు ? ఈ విషయాలన్నింటిని చెప్పగలందులకు వేడుతు న్నాను. మీకు భక్తుడను, శిష్యుడను, మిమ్మలినే శరణుకోరిన వాడను." అనగా పరాశరుడు "ఓ రాజా ! భవిష్యత్తులో జరిగే చెడు విషయాలు ఎలా చెపుతాను ? ఎంత ధైర్యవంతులకైనా భవిష్య త్తులో జరిగే చెడువిషయాలు వింటే కొంచెమైనా విచారం కల్గు తుంది. అయినా నీవు నిష్కపటంగా అడిగావు కాబట్టి చెప్పకూడని విషయాలైనా నీ పట్లగల ప్రేమవల్ల చెపుతాను. నీ కొడుకుకు ఇప్పటికి పన్నెండేళ్లు గడిచాయి. ఇక ఏడవరోజున మరణిస్తాడు" అని చెప్పాడు.

కాలకూట విషంతో సమానమైన ఆ పలుకులువిని రాజు చాలా విచారించి భూమిమీద మూర్ఛిల్లాడు. దయాహృదయుడైన ఆ ముని అతడిని లేవనేసి ఓదార్చి "ఓ రాజా ! విచారించకు. నీకు మంచి విషయాన్ని చెపుతాను విను. ఈ సృష్టికి పూర్వం కళంకం లేనిదీ, ఒక్కటిగా ప్రకాశించేదీ, చిదానందమే స్వరూపంగా కలదీ, జ్యోతిస్వరూపమైందీ, శివరూపమైన పరమాత్మయే ప్రపంచమంతా ఆవరించి ఉంటుంది. ఆ పరమాత్మ మొట్టమొదట రజోగుణరూపంగా బ్రహ్మను సృజించి అతనికి ప్రపంచనిర్మాణమనే పనిని చేయడానికి నియమించి అతనికి వేదాలను ఇచ్చాడు. ఆ పరమాత్మయే సకల లోపనిషత్తులలో సారభూతమైన పరమాత్మ జ్ఞానానికి సంగ్రహరూప మైన రుద్రాధ్యాయాన్నికూడా ఉపదేశించింది. అందులో నాశరహిత మైందీ, అన్నిటికీ మూలభూతమైందీ, బ్రహ్మస్వరూపమైన పరమ శివతత్త్వమే వర్ణింపబడింది. ఆ విరాట్ స్వరూపుడై తనంతటతాను పుట్టిన బ్రహ్మలోకాల స్థితికోసం తన నాలుగు ముఖాలచే నాలుగు వేదాలనూ ఉచ్చరించాడు. బ్రహ్మ నాల్గుముఖాలలో దక్షిణముఖం

నుంచి యజుర్వేదం వెలువడింది. అందులో సకలోపనిషత్సారమైన రుద్రాధ్యాయం ఉంది. దానిని పూర్వులైన మరీచి, అత్రి మొదలైన మునులు వేదాలతోకూడా అధ్యయనం చేశారు. వారు తమ తమ శిష్యులకు ఉపదేశించారు. వారు తమ శిష్యులశిష్యులు, వారి కుమార్లు, వారి మనుమలు మొదలైన వారందరిచేత అధ్యయనం చేయబడింది. ఈ రుద్రాధ్యాయమే ఒక గొప్ప మంత్రం, గొప్ప తపస్సు, దాని పారాయణంవల్ల నరులకు మోక్షం కల్గుతుంది. ఎవరు మహాపాతకాలూ, ఉపపాతకాలూ చేశారో వారుకూడా రుద్రాధ్యాయం పారాయణచేస్తే మోక్షాన్ని పొందుతున్నారు.

వేదనిర్మాణం తరవాత బ్రహ్మదేవుడు మంచి జన్మలుగలవారూ, చెడ్డపుట్టుక గలవారూ, అయిన దేవతలను, పశుపక్ష్యాదులను, మానవులు మొదలైనవారిని సృష్టించాడు. వాళ్ళచే జగత్తంతా నిండింది. ఆయా వర్ణాలవారికి తగినట్లుగా కర్మకూడా నిర్మించబడింది. వారంతా ఆ కర్మానుసారం ప్రవర్తిస్తూ ఆ కర్మ ఫలాలను అనుభవిస్తున్నారు. ఆ బ్రహ్మ లోకయాత్ర నడవడంకోసం ముందుభాగంలో ధర్మాన్నీ, వెనకభాగంలో అధర్మాన్నీ సృష్టించాడు. ధర్మాన్ని ఆచరించేవారు పుణ్యఫలాన్నీ అధర్మాన్ని ఆచరించేవారు పాపఫలాన్నీ అనుభవిస్తున్నారు. పుణ్యకర్మలోనర్చేవారు స్వర్గాన్నీ, చెడ్డకర్మలు చేసేవారు నరకాన్నీ పొందుతారు. స్వర్గానికి ఇంద్రుడు, నరకానికి యముడూ అధిపతులు. ధర్మానికి కామ క్రోధాది ఆర్గురు కుమారులున్నారు. వీరిలో ఎవరిని సేవించినా నరకమే ప్రాప్తిస్తుంది. కామానికి గురువుగారి భార్యతో కూడటం, కల్లుత్రాగటం, చండాలస్త్రీతో సంగమించడం అనే ముగ్గురు ప్రధానమైన కుమారులు. అలాగే క్రోధానికి తల్లిదండ్రులను, బ్రాహ్మణుని, వీరులను చంపడం మొదలైన ప్రధానమైన కుమారులున్నారు.

లోభానికి దేవునిసొమ్ము అపహరించడం. బ్రాహ్మణునిసొమ్ము అపహరించడం, బంగారాన్ని దొంగిలించడం అనే ముగ్గురు కొడుకులున్నారు. పై చెప్పబడిన కామాదుల పుత్రులగు చండాలురను యమధర్మరాజు నరకాభివృద్ధికోసం పాపకర్మాధిపతులుగా చేశాడు. వారు తమ కర్మలను చేసేభృత్యులచేత, ఉపపాతకాలచేత నరకాన్ని నింపారు. పాపాధిపతులగు కామక్రోధాదులు కైవల్యం ఇచ్చే రుద్రపారాయణచే తరిమికొట్టబడి యముని దగ్గరకు వెళ్ళారు.

"ఓమహానుభావా! మావిన్నపం ఆలించు. నీకు జయమగుగాక! మేమంతా నీసేవకులం. మమ్మల్ని నరకాభివృద్ధికోసం నియమించావు. లోకంలోజరిగే రుద్రపారాయణప్రభావంవల్ల మేము దగ్ధమై దూరంగా తరిమికొట్టబడుతున్నాం, ప్రతిగ్రామంలో, నగరాలలో, పుణ్యక్షేత్రాలలో రుద్రజపంతోనిండిన లోకంలో మేమెలా నివసించగలం? వేయిప్రాయశ్చిత్తాలనైనా లెక్కచేయనిమేము ఈ రుద్రజపాన్ని క్షణకాలమైనా సహించలేకపోతున్నాం. లోకనాశనకారకులలో ముఖ్యులమైనమాకు రుద్రజపంవల్ల భయంకల్గుతున్నది. ఆభయం మాకు చాలా ఘోరమైంది. అది విషంతోసమానం. కాబట్టి సహింపశక్యంగానిదీ గొప్పదీఅయిన రుద్రజపంవల్లకలిగినబాధను తొలగించవలసిందిగా కోరుతున్నాం" అని ప్రార్థించారు.

సూతుడు పల్కుతున్నాడు: ఆవిధంగా పాపనాయకులందరూ యమునితో మొఱపెట్టుకోగా ఆతడు బ్రహ్మకడకువెళ్లి తనభృత్యులు చెప్పినదంతా విన్నవించి "ఓజగన్నాథా! పాపాలనుచేసేవారిని శిక్షించడానికై నీవు నన్నుసృష్టించావు. కాబట్టి నేను ఇప్పుడు నిన్నే శరణుకోరుతున్నాను. ఇప్పటికీ లోకంలోపాపంచేసేమనుష్యులున్నారుకాని వారంతా రుద్రపారాయణచేసి పాపులైన మావంశాన్ని నశింపచేస్తున్నారు. పాపులవంశంపోతే నరకం ఉండదు. నర

కంలేకపోతే నారాజ్యం నిష్ఫలమవుతుంది. కాబట్టి ఓభగవంతుడా! దీనికి నీవే ఏదో ఒకఉపాయం ఆలోచించి నరులమీద నాకున్న అధికారాన్ని నిలబెట్టు" అని విన్నవించాడు.

సూతుడు చెపుతున్నాడు : అదివిని బ్రహ్మదేవుడు రుద్రపారాయణకు విఘ్నంకల్గడానికి ఒకఉపాయం ఆలోచించాడు. అజ్ఞానానికి అశ్రద్ధ, చెడ్డఆలోచన అనే ఇద్దరుకుమార్తెలను సృష్టించాడు, వారిద్దరూ జ్ఞానానికి కూతుళ్లయినశ్రద్ధకూ, మేధకూ శత్రువులు. వారిని మనుష్యులమీదికి ప్రయోగించాడుబ్రహ్మ. ఆ ఇద్దరూ లోకంలో ప్రవేశించి రుద్రపారాయణచేసేవారిని మోహింపజేసి పాడుచేస్తుండగా యముడు చాలాసంతోషించి కృతకృత్యుడైనట్లుగా భావించి తనలోకానికి తిరిగివెళ్ళిపోయాడు.

పూర్వజన్మలలో చేసినపాపాలవల్ల మానవులు ఆయుర్దాయం తక్కువగలవారై పుడతారు. వారు రుద్రపారాయణచేస్తే వారి పాపాలునశిస్తాయి. రుద్రపారాయణంవల్ల జీవులకు దీర్ఘాయువు, బలం, ధైర్యం, ఆరోగ్యం, జ్ఞానం, ఐశ్వర్యం, పెంపొందుతాయి. ఎవరు రుద్రాధ్యాయం చెపుతూ శివుణ్ణి స్నానంచేయించి ఆఉదకంచే వారు కూడా స్నానంచేస్తారో వారికి మృత్యువుఉండదు. రుద్రాధ్యాయంచే జలాన్నిమంత్రించి ఎవరు దానితో స్నానంచేస్తారో వారు మృత్యువునుజయించి శివసన్నిధానంలో సంతోషంగా ఉంటారు. 'నమస్తే రుద్రమన్యవ' ఇత్యాది మంత్రవిధానంతో సంతతధారగా శివుణ్ణి జలంతో అభిషేకించాలి. ఆసమయంలో శివాత్మకమైన నమకాన్ని పారాయణచేయాలి. ఆధారకు ముక్తిధార అనిపేరు. ఆనమకాన్ని ఒకసారి పారాయణచేసి అభిషేకంచేయవచ్చు లేదా మూడుమార్లు కానీ అయిదుమార్లుకానీ ఏడుమార్లుకానీ పారాయణచేయవచ్చు. నమకం ఒకసారి పారాయణచేసి చమకంలో ఒకఆధ్యాయంచెప్పి

తరవాత నమకంచెప్పి చమకంలో రెండో అధ్యాయంచెప్పి ఈవిధంగా పదకొండుమార్లు నమాకాన్నీ చమకాన్నీ పదకొండుఅధ్యాయాలు చెపుతూ శివాభిషేకంచేస్తే మోక్షంకల్గుతుంది. దీనికే ముక్తిస్నానం అనిపేరు.

పైనచెప్పిన దేనిచేతనైనా లేదా 'శచ్ఛంమో రావృణీమహే' అనే అనువాకంచేతగానీ, కేవలం ఓంకారంచేతగానీ, ఇతరములైన పురుషసూక్తం దశశాంతులు మూలమంత్రం, రుద్రగాయత్రీ మొదలైన ఇతరవిధానాలచేతగానీ శివుని అభిషేకించాలి. శతరుద్రమనే పేరుగల నమకంచే అభిషేకించినవారికి నూరుసంవత్సరాల ఆయుర్దాయం కలిగి, ఏపాపాలూలేనివారై శివునికిప్రీతిపాత్రులవుతారు. కాబట్టి నీకుమారుడు రుద్రపారాయణచేస్తూ స్నానంచేయాలి. ఆవిధంగాచేస్తే భూలోకంలో ఇంద్రునితోసమానమైన భోగభాగ్యాలు కలిగి పదివేలసంవత్సరాలు సుఖిస్తాడు. రుద్రజపంచేస్తే బలానికీ ఐశ్వర్యానికీ లోపంలేకపోవడమేకాక శత్రువులులేనివాడై సమస్త పాపాలూ నశించి రాజ్యం నిష్కంటకంగా పాలించగల్గుతాడు. వేదాలు చదివినవారూ, జ్ఞానులూ, యజ్ఞాలూ, తపస్సుచేసేవారూ, సమభావంకలవారూ, నిర్మలమనస్కులూఅయిన బ్రాహ్మణోత్తములచే రుద్రజపంచేయిస్తే దానిప్రభావంవల్ల శీఘ్రంగాశుభంకల్గుతుంది.

సూతుడు చెపుతున్నాడు: ఆ రాజు ఈ విధంగా చెప్పిన మునీంద్రుణ్నే రుద్రపారాయణకు గురువుగా నియమించి ఇంకా నిర్మల చిత్తులైన అనేకవేలమంది మునులను రుద్రపారాయణకు వెంటనే పిలిపించాడు. శాంతచిత్తులైన వేలకొలదీ బ్రాహ్మణులు పుణ్యవృక్షాలైన మారేడుదళాలతో నీటితోకూడిన నూరుకలశాలను స్థాపించి రుద్రపారాయణచే ఆ నీటిని మంత్రించి ఏడవరోజు వచ్చేసరికి యథావిధిగా ఆ రాజకుమారుణ్ని స్నానం చేయించారు.

ఆ విధంగా స్నానం చేయిస్తుండగానే హఠాత్తుగా ఆ రాజకుమారుడు క్షణకాలంపాటు మూర్ఛిల్లాడు. కాని వెంటనే తెలివివచ్చి "ఒకానొక పురుషుడు దండహస్తుడై నా వద్దకు వచ్చాడు. భయంకరమైన స్వరూపంతో పెద్దదంతాలతో నన్ను చంపడానికి వచ్చిన ఆతణ్ని మహావీరులైన రాజులూ భటులూ బాగా కొట్టారు. తాళ్ళతోకట్టి దూరంగా ఆతణ్ని తీసుకుపోయారు. మీరు నన్ను రక్షించడంచేత ఇంతవరకే నాకు తెలుసు.'' అని చెప్పాడు. ఆతణ్ని బ్రాహ్మణులు ఆశీర్వదించి రాజుకు కల్గిన భయాన్ని పోగొట్టారు. ఆ తరవాత ఆ రాజేంద్రుడు బ్రాహ్మణులను దక్షిణలచే సంతోషపెట్టి పూజించి సంతృప్తిగా భోజనంపెట్టి వారి ఆశీస్సులనుపొంది బంధువులతోకలిసి భోజనంచేసి సభలో ప్రవేశించాడు.

అంతలో దేవర్షి అయిన నారదమహర్షి స్వయంగా ఆ సభకు విచ్చేశాడు. సభాసీనులైన మునులూ, రాజూ ఆతడికి భక్తితో నమస్కరించి ఉచిత సింహాసనంమీద కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించారు. తరవాత రాజు "ఓ మహర్షీ! మూడులోకాలలో నీవు చూసిన ఆశ్చర్యకరమైన విషయాన్ని మాకు చెప్పవలసింది. మేమంతా వినడానికి ఆసక్తిగా ఉన్నాం.'' అని అడిగాడు. దానికి నారదుడు "ఇప్పుడే ఆకాశంనుండి దిగివస్తూ చాలా ఆశ్చర్యకరమైనదానిని చూచాను. అది మీకు చెపుతాను వినండి. యముడు చిత్రగుప్తుని పిలిపించి ఈ కుమారుని ఆయుఃప్రమాణమెంత అని ప్రశ్నించాడు. అప్పుడాతడు ఈతని ఆయుర్దాయం పన్నెండేళ్ళు మాత్రమే అని చెప్పి మళ్ళీ ఆలోచించి పదివేల సంవత్సరాలని పలికాడు. దాంతో యముడు భయపడి వీరభద్రుణ్ని కొలిచి శాంతింపచేసి మృత్యువును దుర్వారబంధనాల నుండి విడిపించాడు. అప్పుడు

వీరభద్రుడు యముని, మృత్యువును విడవగా వారు వారి ఇళ్ళకు వెళ్ళారు. వీరభద్రుడు కైలాసానికి వెళ్ళిపోయాడు. నేను ఇక్కడకు వచ్చాను. కాబట్టి నీ కొడుకు రుద్రపారాయణ ప్రభావంతో మృత్యువును జయించి సుఖంగా పదివేల సంవత్సరాలు ఆయుర్దాయం కలవాడయాడు." అని చెప్పి నారదుడు తన లోకానికి వెళ్లాడు. మునులు తమ ఆశ్రమాలకు సంతోషంగా తిరిగి వెళ్లారు.

సూతుడు చెపుతున్నాడు: ఈ విధంగా కాశ్మీరదేశపు రాజగు చంద్రసేనుడు ఆతని కుమారుడు ధర్మడూ రుద్రపారాయణ చేసి సమస్త పాపాలు నశింపజేసికొని కృతార్థులయారు. ఏ మానవులు శివుని మహత్తును కీర్తిస్తారో ఎవరు చెవులతో వింటారో వారు కోట్లకొలదీ జన్మలలో పూర్వం చేసిన పాపాలను నశింపజేసుకొని నిర్మలమనస్కులై శివసాయుజ్యాన్ని పొందుతారు.

ఇది స్కాందపురాణాంతర్గతమైన బ్రహ్మోత్తరఖండంలో నమకమను నామాంతరంగల రుద్రాధ్యాయం యొక్క మహిమాను వర్ణనమనే ఇరవై ఒకటవ అధ్యాయం.

— / —

# ద్వావింశోధ్యాయం

సూతుడు పలుకుతున్నాడు: సంసారబంధంలో చిక్కుకున్న మనుష్యులకు మోక్షం కలిగించేదీ, శుభకరమైనదీ అయిన ఒకానొక మార్గాన్ని శివుడే చూపించాడు. మహామునులచే సేవింపబడునదీ, దేవతలచే చక్కగా పూజింపబడునదీ, సాక్షాత్తు కైవల్యసాధకమైనదీ అయిన ఈ మార్గాన్ని నీచులకూ, వేదాధ్యయనాధికారం లేని స్త్రీలకూ, శూద్రులూ మొదలైనవారికి సాధారణంగా చెప్పబడింది.

శివసంబంధమైన కథలను వినడంవల్ల సంసారభయాన్ని తొలగింపజేసేదీ, వెంటనే మోక్షాన్ని ప్రసాదించేదీ, అందరిచే కొనియాడదగిందీ, పవిత్రమైందీ మార్గం. ఇది అజ్ఞానాంధకారంలో మునిగినవారికి జ్ఞానదీపం. భవరోగులకు పరమౌషధం. మహాపాతకాలనే పర్వతాలకు వజ్రాయుధం దెబ్బలా దారుణమైంది. కర్మబీజాలను నశింపజేస్తుంది. సర్వసంపదలకూ సాధనమైంది. అటువంటి కథలను ఎవరు వింటారో వారు కేవలం శివస్వరూపులవుతారు. దీనికి ఏ సందేహంలేదు. ఎవరు శివకథలను వింటారో పఠిస్తారో వారి పాదరజమే సర్వపుణ్యతీర్థాలని మునులు చెప్పారు. ఎవరు మోక్షాసక్తులవుతారో వారు పురాణాలలో చెప్పబడ్డ శివకథలను ఎప్పుడూ భక్తితో వినాలి. ఆ విధంగా కుదరకపోతే ప్రతిరోజూ రెండు ఘడియల కాలమైనా వినే నియమం కల్గిఉండాలి. దానికికూడా శక్తిలేకపోతే పుణ్యమాసాలలోగాని, పుణ్యతిథులందుగానీ, పుణ్యదినాలందుగానీ, పురాణప్రసిద్ధమైన శివకథలను శ్రద్ధగావింటే వాడు కర్మలనే మహాటవులను దగ్ధంచేసి సంసారాన్ని తరిస్తాడు. ముహూర్తకాలంగానీ లేక అందులో సగంకాలంగానీ, క్షణకాలంకానీ, శివుని పవిత్రకథలను వింటే వారు దుర్గతినిపొందరు. సర్వయజ్ఞాలవల్ల, సర్వదానాలవల్ల కలిగేఫలాన్ని నరులు కేవలం పురాణశ్రవణం వల్ల పొందగలుగుతారు. ఈ కలియుగంలో పురుషులకు పురాణశ్రవణంకన్నా వేరైన ధర్మమార్గంగానీ, ముక్తిపథంకానీలేదు. మనుష్యులకు శివపురాణం వినడంకన్నా మరోమంచి సంకీర్తనం లేదు. అదియే మహాఫలాలనిచ్చే కల్పవృక్షం. కలియుగంలో మానవులు తక్కువ ఆయుర్దాయం కలవారూ, బలంలేనివారూ, శ్రమకోర్చుకోలేనివారూ, చెడ్డఆలోచన కలవారూ, దుఃఖితులూ, ధర్మాచారాలను విడిచినవారూ అవుతున్నారని ఆలోచించి భగవదంశ

సంభూతుడైన వ్యాసుడు వారి హితంకోరి పురాణమనే సుధారసాన్ని కల్పించాడు. అమృతాన్ని త్రాగినవాడొక్కడే జరామరణాలు లేనివాడవుతాడు. కాని శివకథామృతాన్ని గ్రోలితే మొత్తం వాని వంశమంతా జరామరణాలు లేనిదవుతుంది. బాలుడైనా, యువకుడైనా, వృద్ధుడైనా, దరిద్రుడైనా, దుర్బలుడైనా, పురాణాలు తెలిసినవానికి శుభంకోరేవారు నమస్కరించి పూజించాలి. పురాణజ్ఞుణ్ని ఎప్పుడూ నీచబుద్ధితో చూడకూడదు. ఎందుకంటే ఆతడి నోటివెంటవచ్చే పలుకులు కామధేనువులా కోరినకోరికల నిస్తాయి. సాధారణంగా లోకంలో నరులు పుట్టేసరికే వారికి గురువులేర్పడి ఉంటారు. (విద్యాగురువు, మంత్రోపదేశ గురువు మొదలగువారు) వారందరిలో పురాణజ్ఞుడే గొప్పగురువు. ఎన్నో వేలపాపాలవల్ల జన్మిస్తూ మరణిస్తూ ఉండేవారికి పునర్జన్మ లేకుండా చేసేవానికన్నా గొప్ప గురువెవరు ?

పురాణజ్ఞుడు నిర్మలుడుగ, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహం కలవాడుగ, మత్సరంలేనివాడుగ, సజ్జనుడుగా, దయగల వాక్కుగలవాడుగా, పుణ్యకథలనే చెప్పేవాడుగా, బుద్ధిమంతుడుగా ఉండాలి. పురాణం చెప్పేటప్పుడు వ్యాసాసనం వేసుకొని కూర్చుండి ఆరంభించింది మొదలు చివరివరకూ ఎవరికీ నమస్కరించకూడదు. ధూర్తులూ, దుర్వృత్తి కలవారూ, చెప్పేవారిని జయించాలనేకోరిక కలవారూ, కుటిలవృత్తి కలవారు ఉన్నచోట పురాణాలు చెప్పకూడదు. దుర్జనులతో నిండినచోట, శూద్రులూ, కుక్కమాంసం తినేవారున్నచోట, జూదమాడేఇంట్లో పుణ్యమైన పురాణకథలను బుద్ధిమంతులు చెప్పకూడదు. మంచివారున్న గ్రామంలో, మంచి క్షేత్రంలో, దేవాలయంలో, పుణ్యనదీనదతీరాలలో పురాణకథలను బుద్ధిమంతులు చెప్పాలి. పురాణం వినేవారు శివభక్తికలవారై, ఇతర

కార్యాసక్తులు కానివారై మాటలాడక శ్రద్ధగా ఏకాగ్రచిత్తులై వినే వారై ఉండాలి. పురాణకథలను భక్తిశ్రద్ధలు లేకుండావినే మనుజాధములకు పుణ్యం రాకపోగా జన్మజన్మలకూ దుఃఖమే కల్గుతుంది. తాంబూలం మొదలైన కానుకలచే పూజించి పురాణకథలను ఎవరు భక్తితో వింటారో వారు దరిద్రులైనా సమస్తభోగాలను అనుభవిస్తారు. పురాణం చెపుతున్నప్పుడు మధ్యలో లేచి వెళ్ళిపోయేవారికి భోగరూపాలైనభార్య, సంపదలు నశిస్తాయి. తలపాగాధరించి పుణ్యకథలను విన్నవారు పాపాత్ములై బెగ్గురుపక్షులుగా పుడతారు. తాంబూలంతింటూ పవిత్రపురాణకథలను వింటే వారిని యమకింకరులు తీసుకుపోయి వారిమలాన్ని వారి చేతనే తినిపిస్తారు. పురాణం చెప్పేవారికన్నా ఎత్తయిన ఆసనంమీద కూర్చుండి డాంబికంగా వినేవారు అక్షయమైన నరకాన్ని అనుభవించి కాకులై పుడతారు. వీరాసనం వేసుకొనిగానీ, మంచంమీద కూర్చుండిగానీ సత్కథలను వింటే వారు వంకరచెట్లయి పుడతారు. పురాణం చెప్పేవారికి నమస్కరించకుండా పురాణం వినేవారు విషవృక్షాలుగా, పరుండివినేవారు కొండచిలువలుగా పుడతారు. పురాణం చెప్పేవారితో సమానమైన ఆసనంమీద కూర్చుండివింటే వారు గురుభార్యాసంగమ దోషం పొంది నరకానికిపోతారు. పురాణం చెప్పేవాడిని కానీ, పాపాలను నశింపజేసే కథలనుగానీ నిందిస్తే వారు నూరుజన్మలవరకూ కుక్కలై పుడతారు. పురాణం చెపుతుండగా ఇతర విషయాలు మాటాడే వారు గాడిదలై పుట్టి తరవాత జన్మలో ఊసరవెల్లిగా పుడతారు. పురాణకథలను జన్మలో ఒకప్పుడైనా విననివారు ఘోరమైన నరకాలను అనుభవించి అడవిపందులుగా పుడతారు. పురాణకథలను చెపుతుండగా తాము వినకపోయినా సంతోషిస్తారో వారు శాశ్వతమైన పరమపదాన్ని పొందుతారు. పురాణం జరుగుతుండగా సాదుచేయ

డానికి ప్రయత్నించే మూఢులు కోటిసంవత్సరాలు నరకం అనుభ వించి, తర్వాత ఊరపందులై పుడతారు. పుణ్యపురాణకథలను చక్కగాచెప్పి అందరినీ వినేటట్లు చేసేవారు నూరుకోట్ల కల్పాల వరకూ బ్రహ్మపదాన్ని పొంది సుఖిస్తారు. పురాణజ్ఞునకు తన ఆస నంలో సగం, కంబళులను, లేడిచర్మాలను, నూత్నవస్త్రాలను, మంచాలను, గ్రామాలను దానమిచ్చేవారు స్వర్గలోకంలో అధిక మైన భోగాలను అనుభవించి, బ్రహ్మాది ఊర్ధ్వలోకాలను పొంది మోక్షాన్ని పొందుతారు. ఎవరు పురాణం చెప్పేవారికి నూత్న వస్త్రాలను పెడతారో వారు ప్రతిజన్మలోనూ జ్ఞానంకలవారై సకల భోగాలనూ అనుభవిస్తారు. మహాపాతకాలు చేసినవారైనా, ఉప పాతకాలు చేసినవారైనా పురాణశ్రవణంవల్ల మోక్షాన్నిపొందు తారు. ఈ విషయంలో ఒక ఇతిహాసాన్ని చెపుతాను. అది సర్వ పాపాలనూ పోగొడుతుంది. విచిత్రమైందీ, మనోహరమైందీ అది.

దక్షిణాపథ మధ్యలో బాష్కలమనే ఒకఊరు ఉన్నది. అక్కడి మనుష్యులంతా మూఢులు, కర్మను విడిచినవారు. అందున్న బ్రాహ్మణులు ఆచారవిదూరులు, వేదాలపట్ల విముఖులు, జపస్వా ధ్యాయ రహితులు, పరస్త్రీ వ్యామోహులు, వ్యవసాయంచేసే వారు, శస్త్రధారులు, దేవుడులేడని వాదించేవారు, చెడ్డనడత కల వారు. కాబట్టి జ్ఞానవైరాగ్యాలుగల మోక్షధర్మం వారికి తెలియదు. ఆ గ్రామంలోని స్త్రీలు పాపపుపనులయం దాసక్తికలవారు. కామ విషయాసక్తితో స్వేచ్ఛాప్రవృత్తి కలవారు. దుర్బుద్ధి కలవారు. వక్రమార్గం కలవారు. మంచిఆచారాలనూ, వ్రతాలనూ విడి చినవారు.

ఆ గ్రామంలో విదురుడనే ఒక బ్రాహ్మణు డున్నాడు. అతడు చాలాదుర్మార్గుడు, కులాధముడు. భార్యఉన్నా వేశ్యాలోలుడు.

ఆతడి భార్యపేరు మంజుల. ఆత డామెనువిడిచి ప్రతిరోజూ రాత్రి పూట మన్మధబాధాపీడితుడై వేశ్యాగృహాలకుపోయి భోగించే వాడు. ఆతడి భార్యకూడా నవయవ్వనవతి కావడంవల్లనూ, భర్త రాత్రులందు తనను ఒంటరిగా విడిచివెళ్ళడంవల్లనూ మన్మధబాధకు తాళలేక ఆమెకూడా తనకిష్టమైనవానితో భోగిస్తుండేది. జారునితో తిరుగుతూ, దురాచారంకల భార్యనుచూచి కోపగించి విదురుడు ఒకరోజు ఆమెతో జారు డున్న సమయంలో ఇంటికివచ్చాడు. ఆతణ్ని చూచి ఆజారుడు జారుకున్నాడు. దాంతో భార్యను పట్టుకొని ఆతడు గుద్దులుగుద్ది చితకబాదాడు. భర్తకొట్టేదెబ్బలకు తట్టుకోలేక ఆమె కోపంతో నిర్భయంగా "నీవు ప్రతిరాత్రి నన్నువిడిచి వేశ్య లతో రమిస్తున్నప్పుడు నాగతిఏమిటి ? నేనా రూపవతిని, యౌవన వతిని. మీ సంగమంలేకుండా ఎంతకాలం మన్మథతాపానికి ఓర్చుకో గలను" అని నిలదీసి అడిగింది.

అదివిని బ్రాహ్మణుడు "నిజమే నీవు చెప్పినమాట కాదనను. అయితే నీకు హితమైనమాట చెపుతాను విను. నీవు జారులనుండి ధనంతీసుకొని యథేచ్ఛగా భోగాలనుభవించు. ఆడబ్బుమాత్రం నాకియ్యి. నేనుదాన్ని వేశ్యలకిచ్చి సుఖాలనుభవిస్తాను. ఈవిధంగా చేస్తే నీ కోరికలూ నా కోరికలూ తీరతాయి." అని చెప్పాడు. దాని కామె అంగీకరించింది. ఆవిధంగా వారిద్దరూ దురాచారప్రవృత్తితో కొంతకాలం గడిపారు. ఆ బ్రాహ్మణుడు మరణించాడు. భర్తపోవ డంతో పుత్రులూ, వయస్సు ఉడిగిన ఆమె తమ ఇంటిలోనే చాలా కాలం గడిపారు.

దైవవశాత్తు ఒక పుణ్యపర్వంనాడు ఆమె బంధువులతోకూడి గోకర్ణక్షేత్రానికి వెళ్ళింది. అక్కడి తీర్థంలో స్నానంచేసి దేవాల యంలో కూర్చుండి దైవసంబంధమైన ఒక పవిత్రమైన పురాణకథ

